# జ్ఞాపిక

ఈ గ్రంథము "దురాశ భంగమును గలిగించును." అనునీతిం దెలియఁజేయుం గావున దురాశాభంగమనియు, సునందనియొక్క పరిణయ వృత్తాంతమును దెలుపుటచే సునందనీపరిణయ మనియుఁ బేర్కొనంబడియె. గ్రంథశీర్షికయందుఁ గథాప్రారంభమునకుఁబూర్వమున మొదటిపేరును, కథాప్రవేశ మయినపిదప గ్రంథాంతమువఱకును రెండవపేరును జూడఁగలరు. కావున నారెండు నీగ్రంథమునకుఁ బర్యాయనామము లని తెలియవలయును.

## ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

| | | |
|---|---|---|
| ప్రతాపుఁడు | = | కళింగదేశపురాజు. |
| జయదేవి | = | ప్రతాపుని భార్య. |
| సునందని | = | ప్రతాపుని కూఁతురు. |
| జయపాలుఁడు | = | ప్రతాపుని కొమారుఁడు. |
| సుమతి | = | ప్రతాపుని మంత్రి. |
| ఉగ్రసేనుఁడు | = | ప్రతాపుని సేనాధిపతి. |
| కుబేరుఁడు | = | సుమతి కుమారుఁడు. |
| జయమాలి | = | సుమతి కూఁతురు. |
| కలకంఠి | = | సునందని చెలికత్తె. |
| మంగళాంగుఁడు | = | అంగదేశపు రాజు. |
| సుదేవుఁడు | = | మంగళాంగుని కొమారుఁడు. |
| మణికంధరుఁడు | = | మంగళాంగుని మంత్రి. |
| వామనాచార్యులు | = | పురోహితుఁడు. |
| చండోఁడు, రాముగాఁడు, కోసిగాఁడు | | ఎఱుక దొంగలు. |
| చెంచోఁడు, వెఱ్ఱోఁడు, పిచ్చోఁడు | | ఘాతుకులు. |
| జీవాజీసింగు, రామసింగు, లక్ష్మణసింగు, ప్రతాపసింగు | | భటులు. |

# ARGUMENT

Pratapa, king of Kalinga, with his wife Jayadevi, with Jayapala his son, Sunandini his daughter, and with Sumati his minister goes a-hunting Sumati, a very avaricious villain has been long plotting, to do away with Pratapa's dynasty and himself become the ruler. For this end he had procured the services of Ugrasena, the commander-in-chief who had promised to work hand in glove with the minister, as he (Ugrasena) was madly in love with Jayamali, Sumati's daughter whom Sumati used as a bait for Ugrasena. Now in the Forest, Sumati with the help of Ugrasena has Jayapala, the son of Pratapa, kidnapped Jayapala is ordered to be murdered. But just at the nick of time some dacoits come upon the scene and liberate him To the mourning Pratapa and Jayadevi, Sumati preaches the hollowness of mundane pleasures, and works upon their feelings, so cleverly as to make them resolve, to abnegate their kingdom in favour of Sunandani and themselves to do penance in the Forests The villainous minister returns to the Capital with Sunandini and schemes an ingenious plot. He instructs his son Kubera to court Sunandini and thus he hopes to change the dynasty to his own line But it always the unexpected that happens Sunandini spurns the advances of Kubera and while recreating herself in the suburbs of the town, finds a handsome prince sleeping under the shade of a tree The prince was, "Sudeva" of Anga country, who had travelled to very near the limits of the Kalinga capital on a wild goose-chase and was taking rest. Sudeva wakes up to find a beautiful damsel staring at him Cupid enters then and the lovers exchange confidences. Sunandini relates the story of her missing brother and her parents pining in the Forest. Sudeva promises to find out her brother and sets out on that enterprise All these proceedings are witnessed by Sunandini's playmates who had come along with Sunandini and who were watching Sunandini hidden in a clump of trees Jayamali was one of the

playmates and she falls in love with Sudeva at sight of his handsome appearance and directly resolves to win her object through her scheming father Now the plot thickens around our villainous Sumati He has to contend against unexpected factors His scheme through Kubera had proved futile Sunandini had come across Sudeva another prince, whom his daughter was bent upon winning for herself In this fix he orders the ever faithful "Ugrasena" to catch hold of Sudeva and imprison him which is done Now another section of the party sent to capture "Sudeva" come upon Jayapala (who was wandering in the Forests unable to find his way home) mistake him for Sudeva and imprison him also. "Sunandini," seeing that her lover had not returned at the appointed time is heart-broken and voluntarily leaves the kingdom and goes in search of him Now a horrible idea strikes our minister He resolves to starve Sunandini in the Forests which news, he argues, would certainly hasten the death of the son-bewailing Pratapa This he believes would place the kingdom in his own hands Secondly he hopes to acquire the Anga country also, by coercing the imprisoned Sudeva to marry his daughter. But there was "Ugrasena" an unpleasant obstacle So he orders some ruffians to intoxicate him and mutilate him in a Forest which is done But Providence again foils all the Minister's attempts. Sunandini in the robe of a hermit wandering in the Forests come across the mutilated and fast expiring Ugrasena and hears from his lips the deep treachery of Sumati and all his deeds. So she comes to know that Sudeva was imprisoned in the Kalinga capital itself and runs up there In the meantime the ruffians who had been ordered to murder Jayapala and who had not done so carry the news to Pratapa after a long time Pratapa returns to his capital Just then "Sunandini" in the garb of a Sanyasi also arrives Sumati's whole treachery is revealed and he is duly punished—avarice is defeated—Sudeva and Jayapala are set free and Sunandini is given in marriage to Sudeva.

ఈనాటకమాడను 7-8 ఘంటల కాలముపట్టును. ఇప్పటికాలము వారికి 4-5 ఘంటలకంటెను హెచ్చుగ నాటకము లాడుట సహ్యమని తోఁపదు గనుక యీక్రిందవివరించిన రీతిగ నాడనగును. మూడవయంకములోనుండు 1వ రంగమున్ను పంచమాంకమునందలి నాల్గవరంగమున్ను కొంతతగ్గించుకొనవచ్చును. కొన్నిపద్యములు వదలనగును.

## సూత్రధారుఁడు. దేవతాప్రార్థన.

## ప్రథమాంకము.

రంగము 1 అరణ్యమునందు ప్రతాపుని సుతుఁడగు జయపాలుని దొంగ లెత్తుకొని పోవుచున్నారు. (నిశ్శబ్దముగ జరుగును)

రంగము 2. జయపాలుఁడు కానరామి, తలిదండ్రులగు ప్రతాపుడు జయదేవియున్ను అక్కయయిన సునందనియున్ను విలపించుచుండ, వారి మంత్రియగు సుమతి వారికి వేదాంత ముపదేశించును. ప్రతాపుఁడు తనసుతయయిన సునందనికి రాజ్యపట్టంబుగట్టమని యానతిచ్చి, సుమతిని, సునందనితో రాజ్యమునకుఁబంపి తాను తన భార్యతో తపస్సుచేయుటకు నరణ్యమందు నిలుచును

రంగము 3. సుమతి తన బుద్ధిబలముతో రాజును కాననంబునఁజేర్చితినని యుప్పొంగుచు, తనకొమారుడయిన కుబేరునకును రాజసుత యయిన సునందనికిని వివాహముసల్పి రాజ్యము తా నపహరింపవలెనని దురాలోచన చేయుచుండును. సుమతికిని కుబేరునకును జరిగిన పరిణయసంభాషణ. కుబేరుఁడు తన్ను సునందని యెటుల నయిన మోహించి వరించునటుగొనరించెదనని తండ్రికి మాటయిచ్చి పోవును.

## ద్వితీయాంకము.

రంగము 1. ఎటుకలు ఒక లుబ్ధధనికునివోఁచి యడవిలో దోఁచినధనముఁబంచుకొనుచుండ బాలుని రోదనధ్వని వినిపించును. అది యేమయినది చూడనాయెటుకలు పరుగిడుదురు.

రంగము 2 ఘాతకులు జయపాలునిఁజంప యత్నించుచుండగా ఎఱుకలు నివారించి జయపాలునిఁ దాముగొనిపోదురు

రంగము 3. ప్రతాపుని సేనాధిపతియయిన యుగ్రసేనుఁడు మంత్రి కూతురయిన జయమాలిని మోహించి యామంత్రిచేయు రాజద్రోహములకు సాహాయ్యపడితిననిన్ని తనభుజబలము యెంతటికార్యమైనను నిర్వహించుననిన్ని యింతటిపని "తనతండ్రికిఁగాను నేనునరించితినని" జయమాలి తన్ను వేగమే వరించుననిన్ని దానిం జూడఁబోవలెననిన్ని మాటలాడుచు మంత్రి మందిరంబునకుఁబోవును

రంగము 4. జయమాలి తాను తనమాయలచే చేయరానిపనులు ఉగ్ర సేనునితో చేయించితిననిన్ని వానినప్పుడే నిరాకరించుటకు తగదని మాట లాడుచుండ ఉగ్రసేనుఁడు ప్రవేశించును. వారిరువురకు నయిన సంభాషణ.

రంగము 5 సునందని తనతమ్ముడు దొరకమికిని తన తలిదండ్రులకు సంభవించిన దుఃఖమునకును జింతించుచుండ కుబేరుఁడు ప్రవేశించి తన్ను పెండ్లి చేసి కొనుమని వేడుచు, సునందని వానినిఁదప్పించుకొని పోవును. కుబేరుఁడున్మాదుఁడై ప్రేలుచు వెళ్ళిపోవును

## తృతీయాంకము.

రంగము 1 సుదేవుడను అంగదేశపు రాజకొమారుడు వేటలో దోవతప్పి ప్రతాపుని పట్టణమునందలి యుపవనమున విశ్రమించి నిద్రించుచుండును వనవిహారము సేయుచున్న సునందని కొంతవిధమయిన మనోవికారంబు గల్గుచు, సునందని తన చెలికత్తెలకొ సమాచారంబుదెలుపక యేకదేశంబపేక్షించి పోవును జయమాలి కలకంఠులు ఒకపొదచెంటిలో డాగి సునందని చర్యచూచుచుండును సునందని తనకుగలిగిన మారవికారంబునకు జింతించుచు చెట్టుక్రింద పరుండిన సుదేవునిఁజూచి మోహించును. వారిరువురి సంభాషణ సునందనీ వ్యసన వృత్తాంతంబు విని సుదేవుఁడు తానెఱుఁగనయిన జయపాలుని శోకదవృత్తాంతంబు

ఆరునెలలపై ఆరుదినములకు వత్తునని సునందనికి మాటయిచ్చిపోవును పొదరింటిలో దాగిన జయమాలి సుదేవునిజూచి మనమున మోహించి దానిని వెనివేయక సునందనిని గలసికొని మాటలాడుచు మందిరంబునకు వెళ్ళును.

రంగము 2 జయమాలి సుదేవునిపై మోహముపట్టలేక ప్రలాపించుచు తనతండ్రికి వనమందుజరిగిన సకలవృత్తాంతము దెలియజేయుచు సుదేవునకు దన్నిచ్చి వివాహము సేయుమని వేడికొనును. సుమతి ప్రయత్నించెదనని వెళ్ళిపోవును.

రంగము 3 సుమతి ఉగ్రసేనుని పిలిపించి సుదేవుని వృత్తాంతంబు దెలిపి వాడు జయపాలుని వెదకి ప్రయత్నింపనట్లు చేయవలెనని యాలోచించును

## చతుర్థాంకము.

రంగము 1. సుదేవుడరణ్యములో నలసి నిద్రించియుండ ఉగ్రసేనుని భటులగు రామసింగ్, ప్రతాపసింగనువారు వానినిఁబట్టికొనిపోయి చెఱనుంతురు

రంగము 2 జయపాలుఁడు తప్పసాకిన యొఱుకలను దప్పించుకొని అడవిలో నిద్రించుచుండ మఱికొందఱు ఉగ్రసేనునిభటులు జీవాజిసింగు లక్ష్మణసింగనువారు జయపాలునిజూచి సుదేవుడని వానియందు పట్టుకొనిపోయి చెఱనుంతురు.

రంగము 3. సునందుని సుదేవునకై చింతించి గడువుమీరెనని జడిసి సుదేవుని వెదకుటకై సన్యాసివేషంబునఁబోవుట నిర్ధారించును

రంగము 4. సుమతి తనబుద్ధిబలముచే నన్నియు సాధించితినని గర్వించి తనరహస్యములన్నియును దెలిసినయుగ్రసేనుని చంపు మాటలాడును

## పంచమాంకము.

రంగము 1 చెఱకాచువారు జయపాలునిఁజూచుచుండ, తామానాడు ఆబాలుని ఎఱుంగకయిచ్చి చంపితిమని ఉగ్రసేనునకు అబద్ధము చెప్పితిమి వాడది తెలిసినచో లక్ష్మి ప్రాణముతీయునని భయపడి అడవిలో తపస్సు చేయు

చుండు ప్రతాపునకా సమాచారంబుదెలుప అతడు ఉగ్రసేనునిఁజంపి తను రక్షించునని నిర్ధారించి ప్రతాపునివద్దకుంబోయి యతనిని బిలుచుకొని రాను వెళ్ళుదురు.

రంగము **2.** సుమతి ఉగ్రసేనుని కాళ్ళనరికించి అడవిలో ద్రోచిపోవును. ఉగ్రసేను డఱచుచుండును. సన్యాసి వేషముధరించిన సునందని వానికి నీరిచ్చి యూఱడింప ఉగ్రసేనుడు మంత్రిమాటలువిని రాజుకు తానొనరించిన ద్రోహంబులన్నియు వ్రాసియిచ్చును దానింగొని సన్యాసి పట్టణముఁజేరఁబోవును.

గంరము **3.** సుమతి నిద్రించి పలవరించుచు మరలలేచుచు చెడ్డకలలుగాంచును

రంగము **4.** ప్రతాపుడు తనసభలో మంత్రితో మాటలాడుచుండ సన్యాసి వచ్చును. కొన్నిమాటలాడి ఉగ్రసేనుని జాబిచ్చును. దానిని సుమతి చదవలేక క్రిందపడును. సుమతి కాలుసేతులు ఖండిచులాగున రాజు సెలవిచ్చును చెఱనుండి సుదేవుని విడిపింపవాఁడు సభకువచ్చును దురాశ యెవరికిఁగూడదని సుమతి హితనీతిన్విపదచెప్పి తనశిక్షయనుభవింప వెళ్ళిపోవును

" సునందనీ సుదేవుల వివాహము."

శ్రీరామసాహాయ్యము

---

## కృతికర్తృసేయు దేవతాప్రార్థన.

శా. “శ్రీరామావనిజాపతిం, జారుగణ్యుఁ, శ్రీమించనూఁగారు, మే
లేరా నాగములె!” యటన్న; “నిజ, మహా, మీమనం బెంకేయుఁ,
బోరామిం గడు మించె నాగములపైఁ బో;” యంచు మేలంబుగా
నారామామణి యాడ, నవ్వుహరి నే నశ్రాంతము న్గొల్చెదన్.

## పుష్పమాలికాబంధము.

చ. హరశరశీహారహారయశ! యక్షయ! సజ్జనమానదాన! శ్రీ
హరి! దురితారి! నీదయనె, యవ్యయ! కోరితి; నీతి ఖ్యాతిగా.
సరస! రసేర! నారసన సద్రసవాక్కులు చాలు మేలుగా,
మురహర! యీర వేగ, మునిముఖ్యముదాస్పద! నందనందనా!

## నాగబంధము.

చ. నరహరి! క్షేమ దీరఁగను నానుడి సజ్జనధీమతంబు నే
యర; వినయా! దయారసమయా! మదమత్తఘనారిశాసనా!
ధరదమనా! సుసార! సముదా! మునిహర్షద! వైరిభీమ! శ్రీ
ధర! హరి! మాన మీర, శ్రితదాత! సుబుద్ధి! సువీనవాహనా!

## నాగపాశబంధము.

చ. దశరథరామ! శ్రీశ! నతదాత! దురత్యయ! ప్రీతిఁ బ్రోవరా;
శశధరాస్య! యీశ! యజ! కుంజరసఖ్య! మహాదికారణా
పశుపతిచింతనా! శమితపాతక! నిర్జరనాథ! యీ, సదా

యశముఁ, దినాయముఁ శుచి, మహామహవర్తిత! సార ధీనిధీ.

---

## రథబంధము.

క. శ్రీనా! రామా! రామా, మానద! చింతింతు నీదుమహిమ ల్మదిలో;
వే నాదుకృతినిఁ బ్రోవర, దీనాయా స్వాంగవారతీ! రాగమతీ!

---

## చక్రబంధము.

శా. సత్యశ్రీనిధి! దుష్టశాసన! దురాశాభంగదా! సత్యజా!
నిత్యా! నిర్మల! రామనామ! నయదా! నీఁగ న్గదే కష్టముల్
గత్యావాస! నిశాటభేదన! మహీజా! ముక్తిదా! విత్ర్యజా!
జాత్యాభాస! హరీ! నిను న్బొగడఁగాఁ జాతుర్యముల్ లే దజా!

---

## గోమూత్రికాబంధము.

క పురహర! మునిజనసంభర! శరణాగతరక్ష! భవశంకర దేవా!
నరవరదా! నిను నమ్మితి, స్మరహర! మృగధర! సుధర! శంకరదేవా!

మ అజరుద్రాద్రిపరు ల్వరించిహరుఁ, లాహార్యాదిసత్వాధికుల్,
నిజ మహాభక్తి నియుంపించి విపతి స్సేవించి మే లందఁగా,
గజరాజానన! నీదుపూజలు సదా గావింపఁగా లేక, యే
విజయంబు న్గాన శక్యమే జగతి నో విఘ్నేశ్వరా! పార్వవరా.

## చంపకమాలిక

సరస రసాభమాధురుల శాస్త్రవివాదముల జేరి, పెక్కువా
సరములు విద్యలం దనుపి, సారము లెల్లఁ గ్రహించి మించి, వా
క్సరవి సరాళభంగిఁ గనుసాధనసంపద లున్నఁ గాని, మా
పరముగ నిన్ను హృత్సరసిజంబున నిల్పి, నిరంతరంబు వే

సరక భజింప కున్నఁ, గొనసాగదు గ్రంథ మటన్న భారతీ!
సరవిని శాస్త్రము ల్చదువ, సజ్జనసంగతి సున్న నైన, నే
సరసులు మానసంబునను నై యానఁ జేయఁ దొడంగితిం గృతిన్;
సరసిజగర్భరాణి! నిను సన్నుతి సేసెద; సత్కృపామతిన్.
సరగున వచ్చి, నాదుఘనసత్క్రియ లందుచు హెచ్చరించుచున్
సరసనె యుండి, సంతతము సన్మతి నిచ్చుచు నన్నుఁ గాచి, కీ
సరులగువారివాగ్విశిఖజాలము లంటఁగ నీక మాన్పవే;
సరససుధారసం బొలుక, సారెకు నారసనాగ్రసీమ వా
క్స్వరణులు గల్గునట్లు, నవసారసలోచన! వాణి! నిల్పవే;
సరళసువర్ణసంకలితశబ్దము లిచ్చుచు నన్నుఁ బ్రోవవే;
సరసమతి న్సదా దలఁతు, శారద! నీతివిశారదా! నినున్.

### పండితుల యభిప్రాయము.

మండపాక - పార్వతీశ్వర శాస్త్రులవారు.—

శ్రీభవ్యుండగుమల్లి నాధకవి కీర్తింజెందె నేవంశమం
దాభద్రంబగు వంశమందుజనితుండై కీర్తిభూభాగము౯
ద్యోభాగంబునునిండుచుండఁదగుసత్కోలాచలశ్రీనివా
సాభిఖ్యార్యుఁడనల్పకల్పితకథాత్యంతాద్భుతంబౌ దురా
శాభంగాఖ్యసునందనీపరిణయాంచన్నాటకంబీడ్యమై
శోభిల్లంగనొనర్చెముద్రితముగాసొంపొందఁగాఁజేసిశ్రీ
సౌభాగ్యోన్నతిఁగన్నచెన్నపురిలోసంధిల్లి భావంబులే
కీభావంబెనయంగసంతసిలి తత్కృత్యుత్తమంబిచ్చె వి
ద్యాభోజుండగుతత్కవీశ్వరునితత్కావ్యంబుఁగన్గొంటినం
దేభంగింగనుఁగొన్న నెన్నఁదగునట్లైనెన్నియోనీతులెం
తో భాసిల్లుకవిత్వరీతులును సంతోషంబుఁగల్గించె తే
వే భూచక్రమునందునాటకములిట్లేనాటకంబైననా
నాభావంబులఁగల్పనాకథలనానందంబునొందించె నే?
లాభంబుల్ గలవెన్నియైనను యశోలాభంబె లాభంబు త
ల్లాభంబెల్ల తెలుంగులంగవులకుల్లాసంబుఁగల్గించు. నౌ;
నౌభాస్వత్కవితైకజన్యమదిమాన్యంబౌకవిత్వంబు స
త్ప్రావిన్నప్రతిభాఫలంబు ప్రతిభాయత్తంబుయత్నంబు య
త్నాభోగంబునసర్వభోగములుసంప్రాప్తంబులౌటబ్రమే?
యీభూమీసురుఁడాంధ్రసంస్కృతచణుండేకాకదాషాలాణి
త్యాభిజ్ఞుండయిన్యాయవాదిబిరుదంబార్జించి బళ్ళారిలో
ద్యోభూజంబటులాశ్రితేష్టఫలదుండుత్సాహవంతుండునై
నీభారంబుసుమీయనంగరిపునేనింబ్రోచుచు౯ స్వార్జితం
శోభూరిద్రవిణంబుపాత్రములకేయర్పించుచు౯ దుష్టచే
ష్టాభావంబుగసంచరింపుచుస్వకీయన్యాయవాదిత్వమం

తో భూష్యంబుగ మిత్రకార్యములు సాధుల్ మెచ్చ సాధింపుచున్
లా భాలాభసమానమానసమునన్ లాలించునంచున్ ప్రజల్
స్త్యా భర్తల్ దమకార్యసిద్ధికి వచింపం దత్క్రియాసిద్ధిలో
నే భూతంబులకైన బాధకము గాదెట్లట్లవర్తించువాఁ
డై భాషించుటకైనఁ దీఱుబడి లేనట్లుండియున్ ధాత్రిభీ
రూ భండారపు చూఱకాఁడని ధీరుల్ మెచ్చునట్లద్భుతం
బౌ భాతిన్ నిజవాగ్విభూతి కృతిగా హత్తించె నీ పాత్తమం
దే భంగంబును లేని యిట్టి చరితం బీగ్రంథమందున్నదో
నా భీష్టోక్తులరీతి నీతిమయమై నానాజనాహ్లాదకం
బై భాగీరథి రేవఁ బావనరసంబై దేవదేవాంకితం
బై భారత్యవతారమీతఁడను ప్రఖ్యాతిం బొసంగించున
ట్టీ భాగ్యంబులయిక్క యిక్కరణి నేర్పే పొందఁగల్పింపఁగా
లో భం బెద్దియు లేనిచోఁ గృతులు వేలున్ లక్షలున్నార్పఁడే
శ్రీ భాషాగిరిజేశులిట్టి కృతులెచ్చేయింత్రు గాకంచు దు
ర్గా భర్గాశ్రితమండపాకకులజాగ్రత్పార్వతీశాగ్రజుం
డీ భాస్వన్నదనాబ్ధిశాద్రపదమందీ పద్యమం పెందమిన్.

మచ్చ - వేంకటకవి —

తే. గీ. శ్రీయుతంబు కోలాచల శ్రీనివాస, విరచితంబు సునందనీ పరిణయంబు
నాటకంబు నందిత బుధ కూటకంబు, హాటకాంబర కృపనంది యదిజదివితి

చ. ఇదివఱకెవ్వరో సుకవులిద్దఱు సంస్కృత హూణ భాషలం
దుఁదనరు నాటకంబులు దెనుంగొనరించిరటంచు వింటి మీ
విదితగుణుండు వారివలె వేఱొక భాష దెలుంగొనర్పకిం
పొదవ స్వశక్తి నూత్నకృతి నుర్వి నొనర్చె నుతింపఁ జెల్లదే

చ. అగియును గాక గ్రంథమున నాతఁడు బంధకవిత్వమింపునన్
బొదలనొనర్చె నీ సొగసు మున్పటి వారల నాటకంబులం
బొదవదు గాన నీ కవికులోత్తము సత్కృతి చేత నాంధ్రవా
క్సుదతికి నూత్నభూషణము జొప్పడెనంచుఁ దలంచెద న్మదిన్.

సుసర్ల - దక్షిణామూర్తి శర్మ.—

క. శ్రీకాళాచలకులకల, శాకూపారకువలాప్తచదివితిసాంబఁగా
నీకబ్బము, నామనమిట, వాకొంటివినుము శ్రీనివాసకవీశా

గీ. నరసుధర్మాభియుక్తము సరసహావ, వివిధవృత్తాళిలలితము విధిబలప్ర
దర్శకర్మచయఫలనిదానమహిమ, వరార! కవిశ్రీనివాసనీయదికృతియిది.

గీ. బుద్ధియెంతసుమతైదైవభుజబలంబ, దెంతయుగ్రునిదైనఁగానంతమైన
విధిబలమునకుసమమానె? విశ్వమంద, టంచునీకృతినీతివచించుభళిర!

కనుకనే.

గీ. దేశరాడ్భాషలంగడతేఁజనట్టి
వాసిసంస్తవమందెడుదారివిధియె
నీకుఁజూపించినటులేనీదుబుద్ధి
విధ్యనుసరణఁజేసెఁగవీశకీర్తిఁ
గోరి "విధిమాయదాఁటగ నేరితరము"? ॥

రాజామంత్రిప్రగడ భుజంగరావుగారు.—

చంపకమాలామాలిక.

జిలిబిలిముద్దుగుల్కగతిఁజిల్కలపల్కులఁ బోల్పదంబులన్
జిలజిలదేనెసోనలనుజాల్పడఁగొల్పెడుకోమలార్థముల్
జిలజిలనూరులూరఁబెనుఁజేరలఁజుర్రఁగనౌరసంబులన్
గిలకిలనవ్వులంగులుకుకేళినిజవ్వనితెల్పుభావముల్
బళెబళెయంచుమీనులకుఁ బండువుసేయఁగ మెచ్చనౌధ్వనుల్
చిలచిలబూవుఁదేనియలఁజిమ్మనగ్రోవినిజిమ్మువృత్తములున్
తెలతెలవారమేనఁజిరుతెమ్మెరలామనిఁగ్రమ్మురీతులన్
సలసలఁగాఁగిఁగ్రాఁగినునుజక్కెరయుక్కెరగూర్చుపాకముల్
తళతళబెళ్కుమేల్మణులతళ్కులఁజిల్కెడునయ్యలంకృతుల్
వలపులువెల్లిగొల్లలుగవర్తిలుమల్లెలజల్లుశయ్యలున్
పలువురుమానసంబులసెబాసుసెబాసనుమేల్గుణంబులున్.
మొలకలువారురీవులనుముద్దులమూటలగట్టుకల్పనల్

సలలితతానమానములజాళ్ళలనోలలనాడు గానముల్
ఘలుఘల్లుమంచుమంచువిడుగజ్జెలకొజ్జలజేర్చుతాళముల్
పులకలునించుసంచులనుబొంకముసుంకముగోరునంకముల్
వలపులుగుల్కుపల్కులనువన్నెలుచిన్నెలువన్నె సంధులన్
జెలగసభన్ సభాసదులుచిత్తరుబొమ్మలయెత్తునన్ గుతూ
హలపడిచూడనౌనభినయంబులు సర్వసనల్పరూపకం
బులనురచించుచోబిరుదు మోసినచేయియనంగనౌ కొలా
చలకుల శ్రీనివాసకవిచాతురిమీరరచించునాటకం
బులనుమదాలసాచరిత్రమున్ సుఖమంజరియున్ సునందినీ
లలనవివాహమున్ జదివిలోలసవృత్తినిలాతివృత్తులన్
దెలియఁగనేరనైతినలతేఁటనునీటునుజూడనట్లయా
నలుసులనేరగానగునె నాణెములౌర నాణలరాసులన్
దలపదలంపనారుచులుతామరతంపరలౌగదామదిన్
భళిభళియంచుహేలపురిభాసిల్లులక్కవరాదిదేశరా
జ్యలవలిరాజిమంత్రిప్రగడాహ్వయసార్థకవర్థమానస
త్కులజభుజంగరావుబహాదూర్ జమిదార్ కవివ్రాసిదెల్పెడున్.

---

## గుంటూరు వెంకటసుబ్బరాయ శాస్త్రిలవారు:—

### సీసమాలిక.

శ్రీకవితాపరిపాకభావుకవాక్య — లైనకోలాచల శ్రీనివాస
రావుగారివలనరసభావముల్లుమీఱ — రచియింపఁబడునవ్యగ్రంథజాత
మునసుఖమంజరియును సునందనిపరి — ణయముమదాలసనాటకంబు
ననువానిఁజదువుచోననుపదమునుసుధా — రసధారలనవారిఁ ద్రావుచున్న
వడువునవోరూ రెవహవా రెవహవారె — యందలిరసములచందమరయ
శృంగారమునుగన్నగంగాసుమందుడు — న్నంగనకైయంగలార్వకున్నె?
కరుణరసముఁగన్నఁగౌశికుననువెన్న — కరణినిమదిమున్నకరుగకున్నె?
వీరరసముఁగన్నవికటుతనూజుండు — కోరమీసముగిరిపోరకున్నె?
హాస్యరసముఁగన్ననతిధీరుఁడునుఁబొంగి — పొరలునవ్వననేలదొరలకున్నె?

రౌద్రముఁగనఁగన రానిముసలియుఁబల్క్ - నాటివీరులశివాల్ మీటకున్నె?
అద్భుతమునుగన్న నలవిధాతయుఁబిచ్చ - వడిముక్కుమీఁద వ్రేలిడక యున్నె!
ఘనభయానకముఁగన్నను వాల్మిగండైన - మూలమూలల దూరంబోవకున్నె?
భీభత్సమునుగన్న భీరువుల్ భృగురాము - తోడ నెత్తుట నీదులాడకున్నె?
శాంతరసముఁగన్న నెంతటి పెటుఁడైన - నినుపకచ్చరముం జొనుపకున్నె?
యను గతి మిత్రిఁ ద్రోఁచెనే రూపకంబుల - యందలి రుచుల నేమందు నింక
నామహాగుణవృత్తులామహాలంకృతు - లా కావ్యకన్యకయందె కలవు
నలుసులవి యున్నె యంచుఁ గొనంబుతెంచి - చూచితా, నేతి వేంకటసుబ్బరాయ
శాస్త్రి గుంటూరుపురిమిషన్ శాస్త్రశాల - ప్రథమపండితుఁడీ కృతిఁ బ్రస్తుతించు.

---

పుంగనూరు స. వి. సుబ్రహ్మణ్యశర్మగారు:—

వ॥ తియ్యని తేనెలొల్కు పుక్కిఁడంపుఁ బలుకులం బోలెఁ జవులఁ దేలి వీనులఁ దోయి లింప నింపగు పలుకులంగేవల మదీయహితంబె యెఱుకపఱచు తమయనుంగుఁ గమ్మనెమ్మిం గనుఁగొని నాకనుంగవయఁ దరుటయ కాక చదువఁజదువ నెమ్మనమ్మును ఘనమ్ముగ సంతసంపు మున్నీటం దరిఁ గోరక తొప్పదోఁగుచుం దనుపారకున్నయది

---

నిడుదవోలు సుందరం పంతులవారు:—

వ॥ హృద్యానవద్యగద్యపద్యాత్మకమును, భాషామహోదయమున కాకరంబును, దురాగ్రహావేశవివశులగు నరపాశుల కగ్గలికై నాశపాశ సదృశంబును నగు భవదీయ విరచిత సునందనీ పరిణయనాటికయు, నందుపైఁ దమవలన నింపొందఁ బొందుపఱుపఁబడిన యుపన్యాసమును, భాండారము నలంకరించెను. గ్రంథమంతయు సాంతముగఁ జదివితిని. అందలి యుక్తిబాహుళ్యమును, నవ్యకల్పనాకౌశలమును, సుగమకథాసందర్భసుద్ధియు, మంజుల పదపుంజరంజితరచనా చమత్కృతియు, సుప్రసిద్ధార్థగౌరవ శయ్యావిశేషంబులును, విశేషించి, తమకుంగల లోకానుభవంబును, నారయ నీగ్రంథరాజంబు కన్న మిన్నయని మన్నింపఁదగు వన్నెగల నీతరగతిని కొకటున్నదన్న నడిసున్నగా నెన్నుచున్నాను. శ్రీనివాసకృతమగునది శ్రీనివాసము గాకుండు టెట్లు?

బ్రహ్మశ్రీ-శతఘంటము వేంకటరంగ శాస్త్రులుగారు:—

తమరు సప్రేమముగ నానంద ముద్రాక్షరశాలావిక్రేతృలముగఁ బంపిన భవద్విర చిత సునందనీపరిణయనాటకము కతిపయదినములకుఁబూర్వము నాకుఁజేరినయది. కా ర్యాతి పాతవశమున నాపొత్తమును సమగ్రముగఁ జదువనయితి గావున్నను నక్కడక్కడఁ జూచి స్థాలీపులాకన్యాయముగ భవదీయరచనాచమత్కారమున కెంతయునలరితి చిత్ర కవిత్వమును వివిధవృత్తములను లలితపదగుంభనంబు మెఱయ రసోచిత శయ్యాచాతుర్యం బు నివ్వటిల్ల ద్రాక్షాపాకమాధురీధురీణప్రకారంబు పెంపార రచియించుటయందుఁ దమ కల వడిన నైపుణ్యముంగని యెంతయు సంతసించుచున్నాఁడను పురాణభాషాభ్యాసంబు నను, న్యాయాధికరణకార్యజాల నిర్వహణంబునను గాలముఁగడపుచుండియుఁ దామాంధ్ర భాష యందింత నేర్పును గడించినందు లకిసంతసం బద్భుతాశ్రమేడితంబయ్యె.

---

కోపూరు సుబ్బరామయ్యగారు:—

గ్రంథమంతయు, వృత్త్యనుప్రాసాంత్యనియమాది మధ్యాంత్యయమకే చ్ఛావాక్య సంఘట్టన, రసప్రాధాన్య, శబ్దస్ఫురణ, ద్విప్రాస, శబ్దచిత్ర, బంధకవిత్వాదులచే, రసికజన మనోరంజకమై విరాజిల్లెడు 19 వదగు. (మకరగతిరగడ) అన్వర్థమై అంత్యనియమ ముచే రాజిల్లెడు 205వదగు (సీసపద్యము) సర్వతః ప్రాతసీసమని తప్పక జెప్పనొప్పు. గ్రంథమన్న, ద్రాక్షాపాకంబు చేరంజిల్లెను. కిదయన్నదురాశాఖంగ మనదగి నీతిబోధక మైయున్నయది నూతన వృత్తప్రయోగముచే ఛందశ్శాస్త్రజ్ఞత వెల్లడి యగుచున్నయది లాక్షణికులచే నిరసింపఁబడినసుకవి ప్రాసంబులగు ప్రాసంబులిందు పూజ్యమగుటచే నియ్యదిపూజ్యమగుచున్నయది

---

HIS HIGHNESS THE RAJAH OF VENKATAGIRI K. C I. E,

DEAR SIR.

I am desired by His Highness the Rajah of Venkatagiri K C I E to acknowledge with thanks a telugu drama nicely composed by you called "సునందనీపరిణయము" which you were kind enough to send him 2 months ago His Highness went through the work twice carefully He thinks that this is the first original telugu drama ever came out of the press and he appreciates your work as well as

its moral He says that though he is not a good authority to comment upon such dramatic works, yet the style is very good and the beautiful wording of వృత్తములు it contains will undoubtedly please the audience that attend it He says on the whole it is a very good work and there is no doubt that it will make a valuable addition to the telugu literature

అనంతపురం మహంకాళి నారాయణరావుగారు:—

తే గీ. మిత్రరత్నమనీవుపంపినకృతిద్వ
యమునుజేరంగవచ్చెనిక్కముగనీకు
నప్పగించితినిరెంటినీయవసరమున
నల్పమైననుదీర్తుగాయనితలంతు.

చ మొదలుసునందనీకృతిసమున్నత ప్రేమనునీవుబంపగా
జదివితిగానిదానిపయిజయ్యన బంపనువందనంబులన్
మదమునగాదుకార్యభరమగ్నుడనై మొదలూరకుండియా
పిదపవిళంబమాయెనని నెచ్చ నయూర్చితి నేమి సేయుదున్.

క పాటిగనీవిపుడంపిన
నాటకమేదెల్పుఘనగుణంబుననాదౌ
కౌటిల్యమోర్చితీవని
యోటుతలంపగమహాశయులకి వేగుణముల్

తే, గీ. ఎఱిఁగితినిబాంధవుండనియింతవరకు
నిప్పుడెఱిఁగితినిన్నుమహేచ్ఛగాగ
సహజపాషాణమేనువజ్రంపురాయి
రాపువడినప్పుడేగదారాయిగాదు,

క. పదపద్ధతిలక్షణయుత
మదిగావునప్రేలుమమువనగునైయొవరికిన్
దుదవరకుజదువుకోరిక
ముదలించుననీకవిత్వములుబుధమిత్రా

తే, గీ, లలిసె నెట్టు ఘనులు పరీక్షలవ వేని
కేని నిది పరనీయము గా నెనర్ప
గావలయు నందునప్పుడు కేవలంబు
న్యాయమొనరించినట్టని నామనంబు.

పెనుగొండ రొద్దం హనుమంతరావుగారు :-

ఈవల నాధునిక కవులు గొందరు కొన్ని నాటకములను వ్రాసియున్నారు వారి యుద్యమములు మిగుల శ్లాఘనీయములు గానున్నయవి. ఆనాటకములు భాషాంతరీకరణములగుటవలననో, లేక కారణాంతరములవలననో వానిభాష నాటకభాషాస్థితికి నిలువక మిగుల నిమ్నోన్నత భూయిష్ఠంబై యున్నయది.

ఈసునందనీపరిణయ నాటకమునందలిభాష యట్లుగాక, నాటకభాషాస్థితికి నిలుపంబడి తత్త్సమయ సందర్భ సముచిత రసభూయిష్ఠశబ్ద సమాస వాక్య గద్య పద్యోద్దామంబై మిగుల రమణీయంబై యున్నదనుటకు సందియము లేదు

# సునందనీపరిణయము.

## ప్రథమాంకము.

### నాంది.

సూత్రధారుఁడు—

ఉ. శ్రీసతి ధాత్రిఁ జేరి నీకుఁ జేరఁగఁ బోయెద నేనటంచుఁ దా
వాసిచెలంగ శేషగిరి వాసముఁ జేయుచు నుండి యచ్చటన్
భాసిలు నిందిరం గలసి భక్తులఁ బ్రోవఁగ నిచ్చ నెవ్వఁ డా
వాసవవంద్యుఁ డిచ్చుత మవారిగ సౌఖ్యము లీజనాళికిన్

నాంద్యంతమున సూత్రధారుఁడు.

గీ. భాగవతముగాదు, భారతసైప్రతి, గాదు రామువార్త గాదు ఋషుల
చిత్రచరిత గాదు చెవియొగ్గి వినవల, దనుచుఁ ద్రోయఁబోకుఁ డయ్య ఓని

ఏమి యిది వేళ మీఱినను నటి రాక యున్నది? దాని తెలివి దాని మందయానమునొద్ద శుశ్రూష సేయుచున్నది కాఁబోలు స్త్రీలు జడమతులు గదా?

నటి— నాయకా! వచ్చితి. కోపము వలదు.

సూత్ర— మఱచితివో మగువా! నేఁ డొకనవీననాటకంబు ప్రదర్శింపఁ బండితులు మనలఁ గోరరే?

నటి— నిజము. నిజము. నవీననాటకం బెచ్చటనుండి తెచ్చెదము? వినినకథలే వినుట కెవరొప్పుదురు? మనవారున్న కథలను దలక్రిందు

సేయనే సమర్థులుగాని నవీనకథలను గల్పింప వారి కెక్కడ లేనిసంకటంబు సంభవించు. శబ్దసంపద లేనివా రందమా? ఝంఝామారుతంబునకుం జిక్కి భంగపడెడు సముద్రభంగములభంగిఁ బదముల పైఁ బదములు పైఁబడి వారివదనంబుల వెడలుచుండును. అలంకారవేత్తలు గారందమా? ప్రపంచంబున నగల యుపమోత్ప్రేక్షాద్యలంకారంబులకు వారిగ్రంథంబులు పుట్టినిండ్లై యుండు.

సూత్ర—ఇంతీ! ఎంతటి మతియుతు లయినను మనవారు నూతనవిషయంబు విషప్రాయం బని యెంతురు. అది నీ వెఱుఁగవే?

నటి—నిజము అర్థకామంబులవిషయం బెంత నూతనంబై యున్నను మానితం బని దానిం బూనుదురు. ఆమాట లిపుడేల? ప్రస్తుతము సేయందగినకార్యం బెద్ది? ఏనాటకంబు ప్రదర్శింపం బూనితిరి? అది నూతనంబై యుండవలయుంగదా?

సూత్ర—నూతనం బగు "సునందనీపరిణయ" మనఁబడు "దురాశాభంగము" ప్రదర్శింపం బూనితిని.

నటి—ఆకథ నూతనంబు గదా.

సూత్ర—అందునకు సందియం బేమి? నూతనం బనుటకు నాగ్రంథంబులోని యొకపద్యంబుం జదివెదను వినుము.

ఉ. పన్నిరి యున్నతోరుతరుపత్రములుంబలె గాథ లెన్నియో
మున్ను కవుల్ పురాణగతపూర్వమహీశులఁ గూర్చి నేఁడు నే
నున్నవి యుండనిమ్మనుచు నొప్పగుచిత్రచరిత్ర మొక్కటి
బన్నితిఁ బద్యగద్యములఁ బండితపామరసమ్మతంబుగన్.

నటి—అటు లయిన నది నూతనంబుగా నుండును. ఐన నీనాటకంబునకు "దురాశాభంగం" బనునామం బేల కలిగెనో?

సూత్ర—ఆకథయందు "సుమతి" యను మంత్రి యన్వర్థకనామధేయుం డు కాక దురాశచేఁ జెక్కుద్రోహంబులు దన్నేలువానికిఁ గావించి తుదకు భంగపడెను గావున దానికి దురాశాభంగం బని నామంబు వచ్చెను.

నటి—ఆర్యపుత్రా! యీక్రొత్తనాటకం బెవరు రచించినది.

సూత్ర—

శ్రీ కాశ్యపసగోత్రజుఁడు తెలఁగాణ్యద్విజుఁడు, భాసురుండగు శ్రీసేతుపతి సుతుండు
కలఁడు కోటాచలాంచితకులజులోన, శ్రీనివాసుండు సదధీనమానసుండు.

ఆకవి. దీనిని రచియించెను.

నటి—మంచిది. కాలవిళంబ మేల? నాటకంబునకుం బ్రారంభింతము.

సూత్ర—నటీ! నాటకారంభమునకు ఋతుగానం బావశ్యకంబు గదా. ఈవసంత ఋతువును వర్ణించుచు నీగానకళాప్రవీణతం జూపుము.

నటి—చిత్తము.

ఝంఝూటి రాగము అటతాళము.

భాసురంబులు మధు- వాసరంబులు బలు- మాసరంబులు- సిరుల మీసరంబులు ।ప॥
విషమశరాగ్నిచే- విరహనిదాఘము- కుసుమరసంబులఁ- గురిసెను వర్షము ।౧।
సరసాననపద్మ- సంపద శరత్తాయె- విరహిజనకంపము- వింత శిశిర మాయె ।౨।
మరుకేళిస్వేదంబు-మహిమ హిమంబయ్యెఁ- దరుణులయలుకల-తెఱు లవి వేస
కాయె ।౩।

సూత్ర—నీగానం బతిరమణీయంబు.

సరసిజనేత్రమ సారసమృదుగాత్రీ, చారుసరసగానం
బారయ వినిసంతసిల్లె, నారదుఁ డెద మెచ్చఁగా

నటీ! నీగానంబు వినం బూనినమనుజుఁడు దనయునికియే మఱచు నన సమయంబుపై జ్ఞానం బుండు టెట్టులు? నాటకంబు నకాలమున

కారంభించి జయ మాలిం బరిగ్రహించెదం జూడుము. (తెరలో) ఓరీ! యెవ్వఁడవురా! రేలుంబవళ్ళు నిద్రాహారములు లేక తన్నిమిత్తమై యధికోత్సాహంబున యత్నించుచుండు సేనాధ్యక్షుండుగ్రసేనుం డూపిరితో నుండ జయమాలిం బరిగ్రహింతు ననుచున్నవాఁడవు? మాడు నీభరతము పట్టించెద.

నటి—(భయముచేత వడఁకుచు) ఆర్యపుత్ర! రక్షింపుము రక్షింపుము. ఎవ్వఁడో మనభరతము పట్టింతు ననుచున్నవాఁడు.

సూత్ర—(వెన్ను చఱచుచు) ప్రియా! వెఱవకు వెఱవకుము. సుమతి పుత్రికయగు జయమాలికొఱకుఁ దపించుచున్న సేనానియగు నుగ్రసేనుండు "జయ మాలిం బరిగ్రహింతు" నను నామాట విని "జయ మాలిం బరిగ్రహింతు" నంటి నని యర్థము చేసికొని యిట్టి కాఱులు కూయుచున్నవాఁడు. మదోన్మత్తుల కొడలు తెలియదుగదా! ఇఁక మన మిచట నుండఁ దగదు, పోదము పద ఇది ప్రస్తావన — (ఇరువురును నిష్క్రమించిరి.)

ఉగ్రసేనుఁడు—ఎవఁడురా! జయమాలిం బరిగ్రహించువాఁడు (నలువంకలం జూచి) యెవ్వఁడును లేఁడే. కానిమ్ము. నిన్నటిదిన మాస్థానగోష్ఠియందు సందర్భానుసారంబుగ సత్వమునుగుఱించివాదంబు జరిగెనుగదా. ప్రతాపమహీపాలుం డెద్దియు విధివశం బని సిద్ధాంతీకరించుకొని, దైవమే శరణమని నమ్మినవాఁడు ఇఁక మంత్రి యొక వెఱ్ఱి యని నేనెంచెద. ఎక్కార్యంబునకును బుద్ధియే కారణంబని నిర్ధారణము సేయుచున్నవాఁడు. అప్రతిమం బగుదోర్బలప్రతాపాగ్ని ప్రజ్వలించుచుండ, బుద్ధిసత్వం బను శలభగణం బాకీలలం బడి పెద్ద నిద్దుర వోవుచుగాని ప్రాణంబున వచ్చుట మృత్యువువాతి మొత్తి

వచ్చుట కాదే? ఇది యాసుమతి యెఱుఁగకున్న వాఁడా? ఎఱిఁగియు నీ కువాదంబు లేల చేయునో తెలియరాదు. దోర్బలంబే హెచ్చని నేనుచ్చరించిన ఘారాళవచస్సమితికి వారిహృదయంబు లీకొన్నను జిహ్వాలాడంబడవయ్యె. బుద్ధిబలమే హెచ్చని నిజంబుగ విశ్వసించి నమ్మియుండినచో నామంత్రి నన్నేల యనుసరించెడు?.. ఆ! ఇఁక నే నేల యిప్పల వాని ననుసరించి నడచెద నందునో, దానికొక మహా కారణం బున్నది వాఁడా యుపవనంబున నాయువపాసననుఁజూచిన త్ఱనుండి నేఁ బడుపాటంతయు దైవం బెఱుంగు. దానిం జూచిన యది గోలె నాధైర్యప్రాకమంబు లేలొకో నీటికంటెను బలుచనై పఱచెను విధిబలం బనునది వెఱ్ఱి, బుద్ధిబలం బనునది పిచ్చి; భుజబలం బనునది తిక్క; బలం బనఁగా నబలలరూపబలమే బలము. ఆబిబ్బోక వతి నాకబ్బు టెటులు? అబ్బదెట్టులు? నాకులమెంచువారికులమున దక్కువైనను పౌరుషమునం దేమి, పరాక్రమమునం దేమి, విద్య యం దేమి, నాకుం జోడెవ్వఁడు? హా! దానియంగసౌష్ఠవం బెంతని కొనియాడినం దీఱును!!

ఉ. వెలఁతిమొగంబులీరు వెలనిద్దము మీఱును, జిల్గిసన్పుఁగా
వెలవెలఁబాఱఁజేయు వెలివెన్నెలచాలును, గల్కిగుబ్బలా
వెలఁగనుఁ బైఁడిగిన్నె లని వేర్తిగ దూఱుచు, జెక్కునిగ్గులా
తెలిజిగిఁ జేఱు సానల నిడే ముకురమ్మని గేలి సేసెడిన్

మ. హరిణద్వగక్షి చారుపరంపరరివఖ ల్లహారీవిహారముల్,
హరులమనోహరంబు లగు నార! సఖీసుఖనాగ్న్యరీసుచుత్,
హరుల హరి చు నిఁబడెకునారు, భళి! హరిమధ్యకే తగుఁన్
హరిలపనాంగ కాంచి తెఖకారు మనోహరహారి మై చనున్

సౌరభ మొందిన - జంత్రపుసొమ్మర । పరిమళ మొందిన - పసిండిసలాకర
జీవకళలు గల - చిత్తరుబొమ్మర । వాగ్విభవము గల - వన్నెలచిల్కర
వెన్నెలపులుంగుర - విందగుమోయుర । వన్నెలకేసుర - వాంపిరివేణిర
కోకిలయాంకలి - కూడౌ డౌనర । కోకము లుబ్బెకు - గుబ్బలతరుణిర
వెయ్యాఱులలో - వెదకిన లేదుర । అయ్యారే! భళి! - యంగనసవతుర,
తనుమధ్యావృత్తము ఈమానినియందం । బీమానినిచ దం
బేమానసి నైనన్ । సామాన్యమె యెన్నన్.

ఇట్టికలికి కలయికకై గుటకలు మ్రింగుచు నెన్నిదినంబులు గాచి యుండ నగును? ఎన్నటికైన నొక్కదినంబు ధైర్యంబు సేయక తీఱదు కదా. నాం డుండెడుగుండియ నేఁడు లేదా? ధైర్యంబు సర్వకార్యసాధకంబు. కాన ధైర్యంబునం బోయి యామతియుతునకు సుమతికి నామతిం దెలిపెద. వాం డొడంబడనిచో నాసాహసంబుం జూపెద. ఇపుడె పోయి వచ్చెద

(నిష్క్రమము.)

ద్వితీయరంగము—అరణ్యములోని శిబిరము.

[జయదేవి, ప్రతాపుఁడు, సునందని సుమతి ప్రవేశము.]

జయదేవి—

సరసిజవృత్తము.

ప్రాణాధారం బౌసుతు నయ్యో! పలువిధములం గని, పలుకుచు నగుచున్,
నానాసౌఖ్యంబుల్గని వానిన్, నరహరి! నగధర! నగతలములలో
బోనాడంగా నోపుదునే, హా! భుజగశయన! హరి! భువి బ్రతుకిటులన్
నే నెట్లోర్తుం? పాపి! విధీ! యీ నిగుడువ్యసనము నిలుపంగం దగునే
అకటకటా? పుత్రవియోగపటుతరచింతాక్రాంత నైననాశరీము దుష్కరము దుర్భరము. అయ్యో? నాప్రాణపదమై నాప్రాణానిలమై

నాప్రాణమై రాణించుచిన్నెలచిన్నెలాని, వన్నెలవగలకాని, చెంగలువాబగులవాని, గ్రొన్నెలమోమువాని, వెన్నెలఁబోలుదరహాసంబువాని సున్నత భుజములవాని, సన్ననినడుమువాని, నాకన్నులపండువును, నాకన్నకొమరుని, నామన్ననవాని, నేకటికలక్కటికమువాని, కాంన్యముఁ బాని కాననంబులో నేచిక్కులఁ బెట్టిరో? హా! పుత్రా! రాజీవదళనేత్రా? రంజితశుభగాత్రా? సుపుత్రా? నిన్నెబు నే మఱతు? నీవియోగంబు నే నెటు సైతు? ఈ సంతతసంతాపంబు నే నెటు సహింతు? ఈశరీర మెటు భరింతు? అంకింతకు మితిమీఱువంత లెటు సైరింతు? నీగుణశీలంబు లెంతని నే నెంతు? ఎంతని విలపింతు? తనయా? నీవు లేని నాబ్రతుకు మావి లేని యుపవనంబు గాదే? ఈవి లేని భాగ్యంబు గాదే? తావి లేని కుసుమంబు గాదే? ఠీవి లేని రాజ్యంబు గాదే? అకటా? పుత్రుఁడు లేని రాజీవనము చంద్రుఁడు లేని రాత్రిరీతి, సారసములు లేని సరోవరముమాడ్కి, కలకంఠంబులు లేని యుపవనంబుభంగి, తాలిమి లేని తపసిగతి, వ్యర్థంబు గదా? కటకటా? నవమాసంబులు గర్భంబున భరించి, దుస్సహప్రసవవేదనలు సహించి, పడరాని యిడుమలం బడి, కని, పెంచి, యెత్తి, ముద్దిడి, కడుంబ్రేమతో రేలుంబవలుఁ గాచి, కరుణించి, యిన్నివత్సరంబులు రక్షించియు, నిర్భాగ్యురాల నగుట నా కారాత్రి నిద్రం గరుణ లేదాయె పాడుపిదుర బలమాయె తెలివి మాసిపోయె, అజ్ఞానంబు ముసికొనిపోయె నిద్రాపిశాచంబావేశంబాయె. బలుమోసమాయె నే నేమి సేయుదు? ఆయ్యో తనయా? బహుప్రయాసలబ్ధ్యాశవ్రాశనులగు నిఱుపేదలకు నీవు ఒని పక చక్రవర్తిని నగు నాయుదరంబునం బుట్టినందునఁ గదా నీకిన్ని కష్టంబులు గలిగె? నే

గోత్రాలనుం గాక, తనయా! నినుం గనినది పడరానియిడుమల నినుం బడవేయుటకా? నే గురువరుల నారాధించినది, నే నురుఘోరోపవాసంబులు చేసినది, నిన్నీరీతిం బరితపింపం జేయుటకా? నిన్నీ పటుతరఘోరాటవులకు బలి యిచ్చుటకా? పట్టీ! నీ కిన్నిదినంబు లన్నంబిడినది, నిన్నీ పెనుమృత్యువున కాహారంబుగం బెట్టుటకా? దైవమా! పుత్రులు లేని మాతాపితలగతి దుఃఖగతి, నరకగతి, యధోగతి. హా! కరగతకవళంబు గతమైనట్లు, కష్టలబ్ధభాగ్యంబు నష్టమైనట్లు, ప్రకటంబడిన పసిబాలుండు పోయె. వాండు కానరాండు. కానలేదు క్రుక్కడిమృగముల బారికిం జిక్కెనందురా? వానిజాడ లేదు. ఏద్రోహి, ఏదురాచారుం, డింతటిక్రూరకర్మ మొనరించెనో తెలియరాదు. హా! పుత్రా! నిదుర లేచి, ఘోరరులం జూచి, నీవారలం గానక నీజననీజనకులను నీయప్పయ్యను పేరులం బెట్టి చీరి, యెంత దుఃఖింతువో, యెంత తల్లడిల్లెదవో, యెంత తపించెదవో గదా! తనయా! సుగుణసముదయా! సమస్తలోకప్రియా! విజయా! జయా! (క్రిందం బడి మూర్ఛపోవుచున్నది.)

ప్రతా—

బంధురవృత్తము.

పాంతులు శిశువులు నడవులకును రాం బోలునె? తోంచక పోయె నహో!
చెలువుబు మురువుకు చిలికెమనసుతుం డేచేటులపాల్పడి చిక్కెనొ యీ
వెలివగ లెటులని కని మనదు నిలకఁ జేయుదు నేమిని పురాకృత మా
పల మిది యని విధి యనుభవమునకై ఫాలతలమున వ్రాసె నొకో!

సీ. నాపూర్వసుకృతంబు నాపూర్ణవిభవంబు, నాపుత్రరత్నంబు నాముదంబు
నాకామితార్థంబు నాకామితఫలంబు, నాసుఖార్ణోరాశి నాదువాసి
నాగృహదీపంబు నాదునిక్షేపంబు, నామాఱురూపంబు నాతపంబు
నావక్షుల జేండు నాకలుములవీడు నాకీలకుజోడు నాదు జోండు

॥గీ॥ నాడుచిన్నిచెలియత నాదాత నానేత, నాయనుంగుజేత నాదుభ్రాత
ఈడు లేనివాఁడు లేఁడకటా! నేఁడు, కానరాఁడు, వాఁడు కానలేఁడు

హా! ఎంతటిబుద్ధిజడుఁడను నేను! కటకటా! ఆటపాటలకుం బలె కుటిలాలకలతో రాజగరిష్ఠులు నిష్ఠుర ఘోరాటవులకు వేఁటలకు రాఁ జెల్లునె? నాపూర్వజన్మదుష్కృతఫలం బీ వేఁటరూపంబున నా పాలిటఁ బడెం గాఁబోలు? నే నేమి సేయుదు? విధి నానొసట నిట్టి వ్రాఁత వ్రాసెను. అకటా! వలపులపుట్టి గారాబుఁబట్టి నట్టడవి యందుఁ బోయినందునకు దుఃఖింతునా? కలకాలం బిలువేల్పులఁ గొలువంగలిగిన యీ బాలుని వియోగాగ్నిచేఁ గ్రాలెడు నీకలకంఠి యకుంఠితవిచారంబునకు శోకింతునా? ఏకాలం బలుగక యెత్తి ముద్దిడి యాటపాటలచే బుజ్జగించి ప్రేమం బెంచినతనసోదరునిఁగానక కన్నీరుమున్నీరుగాఁ బొరలఁగు నానందని నీసునందనిం గని విలపింతునా? ఆ సుకుమారుని మారసమసుందరాకారుని గుణహారుని నీతిప్రచారుని నాకులవిస్తారుని కుమారుని వియోగవిచారసాగర మెట్లీఁదుదునా? ఇహపరములయం దమందానందంబు సంధించునందనుం డని పరిపూర్ణానందంబు నొందిన యంద రాశాగర్వం బందినమందభాగ్యున కేల యట్టినందనుండు దక్కు? ఏమి సేయుదు? ననుఁ బొందిన పటుతర విచారవహ్నిజ్వాలలు భయంకర దావానలకీలలవలె నాబుద్ధితత్త్వం గాల్చెను ఈసుదతిదుఃఖకుఠారంబు నాధైర్యతరువుం జీల్చెను. అకటా! నాపురాకృత దుష్కృతఫలం బే ననుభవింపక వే ఱెవ్వ రనుభవింతురు?

సుమతి—అకటా! పుత్రవైభవంబు లేనిరాజ్యం బేల? సామ్రాజ్యం బేల? హారు లేల? కరు లేల? సిరు లేల? కుమారులు గదా సదా జననీజనకుల ముదమున కాధారులు? సంతాపాగ్ని శాంతింపం జేయు నమృతాహారులు? సంచితపుణ్యఫలాకారులు?

మ. ఆరయ సంచితపూర్వజన్మవరపుణ్యాకారులై, తండ్రికిం
బరికింప న్సుఖదాతలై, యిహమున న్బాలింపుచు, న్బిష్టటన్
దరి దారి న్దరికొన్నదారుణఘనీదావాగ్నులం బాపువా
రు, రహిం బ్బన్నరకాటవీతరుకుఠారారు, ల్పుత్రకు ల్భావరా

హా! హా! అట్టిపుత్రుం డున్నటు లుండి పోయెఁగా! శ్రీహరీ! ఈ ఘోరతరపరితాపపారావారంబునం గూలుటకంటెను నీచరణారవిందంబు లారాధించి మీఱిన కైవల్యంబుఁ గోరుట సరి కాదే? అకటా! మితి మీఱెడు దుఃఖంబునం బ్రస్తుతకార్యంబు నాకేమియుం దోఁపక యున్నది.

ప్రతా.—సుమతీ! నీకడపటి పలుకులచే నాకు మితి లేని జ్ఞానంబు గలిగె. సుమతీ! గాఢాంధకారంబునం దగులుపడి దారిఁ గాననివానికి మెఱుపుదీగెయుంబోలె ఘోరవ్యసనంబునం జిక్కిన నాకు నీవచనంబులు బలుహితంబు లయ్యె.

తత్త్వవృత్తము.

మానవుఁ డీజన్మము నిజ మనుచున్ మానినిమాయల సుడివడి యందున్
మానినిఁ గూడ న్మద మతిశయమై మారునిక్రీడల మన మలరారన్
సూనులఁ గాంచు న్సుఖ మని తలఁచున్ సొక్కుచు నిక్కుచు సరియొవరంచున్
గానఁడు దానై తనదుపదములన్ గైకొని వేసిననిగళము లంచున్.

సుమతీ! విషయాదులచే శోషిలుచుఁ ద్రీషణంబులకుం జిక్కి మిక్కుటమగు కర్కశనరకంబుల పాల్పడుటకంటెను త్రివిధంబగు యోగంబుచే మించు పరిపూర్ణసుఖాస్పదం బగు తపంబు మేలుగాదే! పుత్రశోకాగ్నిజ్వాలలు నిలు వెల్ల వ్యాపించి దహించుచుండ రాజ్యపరిపాలనాలోచన యనెడు వేఱొకచిచ్చుం దెచ్చుకోనేల? నే నిచ్చటనేయుండి తపం బాచరించెద.

చంద్రిక దనుజహరణ! బుద్బుదంబు నేఁ గని తెర మని కానసై
తిని గద! చల మన్నుఁ, దీవ్రవేదనలకు గుఱియైతి ధారణిఁ

శ్రీహరీ! సంసారసాగరమునందు దారపుత్త్రాది సుఖబుద్బుదంబులఁ జూచి శాశ్వతసుఖం బందితి నని విఱ్ఱవీఁగి వెఱ్ఱి నైతిని. అవి క్షణ భంగురము లని యిప్పుడు గదా తెలిసితి.

మాణవకము ఆశలు సంసారముపై, లేశము లేకుండుటకై
కేశవ! శ్రీశా! హరి! స, ర్వేశ! నినుం గోరెద నే

సుమతి—ప్రతాపా! భూపాలుఁడు లేని రాజ్యంబు పాపాలయం బగు. ఆ పాపంబులకుం బాత్రులు వారయ్యెదరు. పాపం బొకచో పెచ్చు చుండ నీవు దపంబు సేసిన సద్గతి యెట్లు కలుగు? శరీరం బొకచో దహించుచుండ వేఱొకచోఁ బూయుచందనంపుఁబూఁతలిం బగునే? రాజ్యం బేలుటకు మఱియొకని నియమించి కాని మన మిరువురము వనతలంబునందు మునిలీలల నుండ నగును గదా!

ప్రతా—సుమతీ! నీహితవచనంబులు నామదికి సదా సమ్మతంబులు. ఆసునందనిని నాలోకానందనిని నానందంబుం గొనిపోయి రాజ్యంబునకుం బట్టంబు గట్టి రాజధర్మంబు నిలుపుము నీ కేల కష్టంబు? నీ విం దుండిన నీయంతటికార్యవిచారాయత్తచిత్తులు, నీయంతటిప్రజ్ఞాధికులు, నామేలు గోరువా, రచ్చట నింకొక్కరు లేరు గదా! నీ విం దుండం జనదు. ఈ కుసుమకోమలగాత్రిని జయదేవిని, ఈసునందనినిం, దీసికొని పోయి, పట్టణంబుం జేరి, సుఖంబున నుండుము. పసిబాలుని పోకడలు విచారింపుము, సుమతీ! నావలనఁ గదా మీ రిన్ని కష్టంబులు గంటిరి.

తే-గీ కుమరునివాత్సల్యమునఁ బోయెఁ గుమకులంబు;
అహికులము వోయెఁ దక్షకునవగుణమున,
దశవదనుమౌర్ఖ్యమునఁ బోయె దైత్యకులము,
నాకులసుఖంబు వోయెఁ గా నాకతమున.

సుమతీ! పాలవంటికులంబున విషంబుగతి నేఁ బుట్టి నాకులంబునకు నెల్ల నాకులత్వంబుఁ గలిగించితి. సుఖంబున నింట నుండినవారి నూడ నీక యరణ్యంబునకుం దెచ్చితి.

జయదే—

ఉ. భూపతి చాలదా సుతునిభూరివియోగవిచారతాపని ష్ఠే
లా పురి కేగు మన్న నిటు లాడుచు నేఁచెదు? గోరుచుట్టు దా
నాపద చాలదే? మఱల, నక్కట! రోఁకటిపో టదేలని నే
నీపరిచర్య సేయుచును నీకడ నుండెదఁ బ్రోవవే కృపన్.

ప్రాణనాథా! పుత్రవియోగదుఃఖంబు మనమున ఘనమ్ముగ నేఁచుచుండఁ బతివియోగంబను పెనుశోకదుఃఖసాగరంబున ననుం బడ ద్రోయఁ దలఁపనేల? మిమ్మెడఁబాసి నేనం దనుభవించుసుఖం బేమున్నది?

ప్రతా—

సీ. తలిరులఁ బోలెడుఁ దపసి నీపదములు, కంటకకలిత మీకాననంబు,
అతికోమలతఁ బూవులత నీదుదేహంబు, వితతాతపాతప్తవిపిన మిదియు,
మెత్తనిమెత్తల మెచ్చదు నీమేను, కర్కశపాషాణగహన మిదియు,
పిచ్చుక లఱచిన బెచ్చఱెడెదు నీవు, భీషణమృగనాదభీష్మ మిది యు
॥గీ॥ కటకటా! యిట్టికఠినత లెటుల నీవు, సైఁతువని, పంపనాడితి; సతిరో! నిన్ను
విడువ నాడిన కఠినుని విధము గాదు; కలికి! మనకిట్టికష్టంబుఁ గలిగ నేఁడు

జయదేవి! అది నీమతికి హితంబు గాకున్న నిటనే యుండుము.

సునం—

క. అనవరతముఁ గనికరమున, నను బెంచినమిమ్ము వనమునన్ విడినేఁ బో
మన మొప్పదు, జనకా యయ్యా, ఘనవిభవము వలదు నాకుఁ గనుప్రేమ ననున్

తండ్రీ! గడియ మిమ్మెడఁబాయని నను విడనాడఁ గోరుదురే? ఎల్ల కాలంబు నాయుల్లంబు రంజిల్లంజేయు చల్లనినాతల్లిని విడిచి నే

నెటుల జీవింపఁగలను? పుత్రశోకాతిశయంబున నడలుమిమ్ము విడనాడి పైనముగా నామన మోపదు గదా?

ప్రతా—

క. పరమానందకరంబై, పరమామృతధారవోలెఁ బరగెడు, నో రా!
మురువగుచిలుకలపలుకులె, యరయ న్వ్యసనములమందు లవు నవు నవనిన్

తల్లీ, సునందనీ!

సీ. బృందారకారామమందారతరుబృందగంధాధికత యిందుఁ గలదె తనయ!
మలయజపరిమళమిళితమై పై వ్రాలు మలయానిలం బిందుఁ గలదె తనయ!
చెలువులమై తావి కలరి కలయ వచ్చునళిరవసుఖ మిందుఁ గలదె తనయ!
సురుచిరతరుచారుచరతీరరంజితకాసారవర మిందుఁ గలదె తనయ!
గీ. చటులమృగయూథపటహ మీయటవి, బాల! సహజభీషణమైన దీగహన మకట
చెన్నుమీ జెడువన్నెలచిన్నిబాల! యిన్నియిడుమలు నీకేల? కన్నతల్లి.

సునందనీ! ఇట్టి ఘోరారణ్యంబులందు నీయట్టి కుసుమకోమలగాత్రు లుండ నగునే! వలదు. నా హితంబును గైకొని నను విగతవ్యసనునిఁ జేయఁజూడవే తల్లీ! (సునందని వ్యసనంబునఁ దల వంచి యూరక కూర్చున్నది) అమ్మా! మణిగణఖచితమందిరంబులం దుండి సదా మోదంబులందు నిన్ని వనమందిరంబుల నెట్లుంతునే? చెక్కు—గీటనఁ బాల్కాఱుబాలవు, బాలేందుఫాలవు, నిన్ని వనతలమందునుపఁగలనఁటే? తనయా! మన మందఱ మిం దుండిన మన రాజ్యపరిపాలనం బెట్లు జరుగునే? రాజ్యపాలన లేకున్న ధర్మాధర్మపరిశీలన గలుగక జనులు కలిప్రేరణఁజేఁ బాపంబులు సేయరే? ఆపాపంబులకు నేనకా భాగహారినగుదు? ఇట్టి పాపకూపంబునఁ బడనీక నను రక్షింప, బాలా; నిన్నుఁ బతిమాలి వేఁడెద.

జయదేవి—తనయా! నీ వీరీతిఁ జింతిల్లిన నీతండ్రిగారిధైర్యంబు చెదిల్లదఁటే.

సునం—తల్లీ! జననీజనకులవచనంబుల ధిక్కరించుట తగ దనుకొన్నను మిమ్మెడవాసిపోఁ గాళ్లాడవే? ఏమి సేయుదు? తల్లీ! శిరీషకుసుమంబు కంటెను మెత్తఁగ నున్ననామనంబు కఠినపాషాణంబుఁ జేసికొని నేఁ బోయివచ్చెద. నాకన్నీరు మీకపరిమితదుఃఖవారిధి యగును. నా దుఃఖ నీరధిలో నీక నేనే మునింగెద. తల్లీ! పోయి వచ్చెద.

ప్రతా—సుమతీ! ఈపుత్రిని వరచారిత్రను నీపుత్రింగా నెంచి దానిదుః ఖోపశమనంబు చేసి తగినరాజపుత్రున కిచ్చి పరిణయంబుఁ గావించి ధర్మంబు తొలఁగనీక రాజ్యంబుసేలుము. నాబాల్యస్నేహంబు మఱ వకుము.

సుమతి—

ఉ॥ పుట్టిననాఁటనుండియును భూవర నీదగుప్రోపునంది, యీ
పట్టునఁ బుత్రశోకమను పట్టఁగరాని మహార్తివార్ధిలో
నిట్టటు లీఁది గట్టు గన కీగతి మగ్నుఁడ వైనవేళ, నీ
పట్టికిఁ గట్టునా ధరకుఁ బట్టము సందియ మెందు నేలొకో?

ఏల సందియంబు? నీనందనికిం బట్టంబు గట్టి రాజ్యం చేలింతు. నీ తనయ వ్యసనం బపనయింతు నీ సుతుని శోకడ నే విచారింతు. ఇన్ని యుఁ జేయునోఁపుదునుగాని నీవియోగజన్యవ్యసనం బేనోర్వఁజాల. ఏమి సేయుదు?

ప్రతా—సుమతీ! మతిమంతుఁడ వగుసీ కీవ్యసనం బేల? ఋణానుబం ధం బున్న నీవియోగం బెన్నిదినంబు లుండు? చింత వలదు.

సుమతి—రాజేంద్ర! శోక తప్పదుగద? పట్టీ! సునందనీ! మన ముందు వఱకు నీదంపతులవ్యసనవార్ధి యిట్లుప్పొంగుచునే యుండును. మన ము చని వీరియారటమునకుఁ గొంతయాఱట గలిగింతము రమ్ము.

(అని సునందనితో వెళ్లుచున్నాఁడు)

## తృతీయరంగము —(మంత్రి మందిరము.)

---

సుమతి—(స్వగతము)

మ. అకలంకం బగునాత్మబుద్ధి యనిశం బత్యూర్జితస్ఫూర్తిచే
సకలార్థాధిక సాధనంబులకుఁ దా సాహాయ్యమై యుండఁగా,
వెకలు ల్లోకములోనఁ గార్యఫలము ల్వేగంబ యర్పింతు
రిట్లకటా! కర్మకు దేహశక్తికిని, నీయన్యాయము గ్గంటిరేని

ఆహా! బుద్ధి కదా బలిమి! బుద్ధి కదా విధి! బుద్ధిహీనునకు దేహబలం బున్న నేమి? దైవబలం బున్న నేమి? సకలార్థసాధనసంపత్తికీధారణి బుద్ధియే కారణంబు. సకలకార్యసాధనంబునకు బుద్ధివలె నిఖిలకార్యార్థభంగమునకు విమోహం బట్టిదియే కదా? అందుఁ బ్రకామకామినీమోహినీమోహంబుం జెప్ప నలవి యగునే? అట్టి విమోహంబునం బడి నీటిసుడింబడిన చెత్తం బోలె నుండెడుంగదా యుగ్రసేనుండు? భళిభళిరే! మోహినీపిశాచమా! మరునివశ మై మానవమానసంబుల నీ వెన్నిమాఱు లురులం దవిలించెదవు!

చ. మఱుఁ డనుధీవరుండు, మఱుమాయగఁ బూరుషకర్మనీరధిం
బరగినమానసం బనెడుచారువమీనముఁ బట్టఁజూచి, తాఁ
దరుణులవీక్షణాంచలముఁ దప్పనిగాలముఁ జేసి, హాస మ
న్సురుచిరభోజనంబు నిడఁ జొక్కుచుఁ జిక్కెడు మోహమొక్కడై

అహా హా! నామమతలతనయ వానిపాలిటిపిశాచావేశమంత్రం బాయెఁగా! ఆప్రతాపునకుఁ "గలువాయివేదాంతంబులం" గలపి కానన సీమలఁ గారాకులు మెసవునటులఁ జేసినది నాబుద్ధి కాదే? ఖేదాంతంబులగు వేదాంతంబులు వంచకుల వ్యవహారంబులకు నైతము సహాయమ్ములై యుండుం జుమీ!

క. సంతతసంతాపాగ్నిని సంతోషాశ్రువులఁ జల్లి చల్లఁగఁ జేయున్;
వింత, లహా! కలియుగవే దాంతము లజ్ఞులకు నైన నవనిని జూడన్.

సమ్మోదనిశ్శాంతంబు లగు వేదాంతంబులం జేసి కదా నా మోసములు వాసిగ ఫలించెను! అటు లాడెద నేల? అవనికై కాదే నే నిన్ని పనులు సేయుట? రాజ్యం బార్జించుటకై యెందఱు మహానుభావు లెన్నిమాయోపాయములు సమ్మత మ్మని సేయ రైరి?

సీ. అవనికై యనృతంబు లాజి నాడుచు ద్రోణు ననిఁ జంపె ధర్మజునంతవాఁడు,
అవనికై బలిఁ జేరి యాహవంబున వేఁడి హరియించె సిరి హరియంతవాఁడు,
అవనికై భృగురాము నడిగి దానముఁ గొని యటు దోలెఁ గశ్యపునంతవాఁడు,
అవనికై యాజిలో నటు డాఁగి వాలిని హతుఁజేసె శ్రీరామునంతవాఁడు,

గీ. ధర్మసారులు ధీరులు దానపరులు, సత్యసంధానువర్తులు నిత్యకీర్తు
లట్టివారలు దోసము లనక చేసి, రిట్టిమోసము లవనికై దిట్ట లగుచు

అట్టిమహానుభావు లవనికై యిట్టిమోసంబులు దోసంబు లనక చేసి రని పురాణంబులు ఘోషించుచుండ నాకార్యం బెటు దోషంబగు? ఇంతటికి నోపెనుగదా నాబుద్ధి! నాదాసానుదాసుండగు సుగ్రసేనుని కుపదేశం బిచ్చి యాకసుగందసపసిబాలునియసువులు వెసనాఱం జేసినది నాబుద్ధిబలిమి కాదే? భళీ! ఇప్పటిజను లెంతటివెకలులు! శాస్త్రంబులోనివి యని రెండుశ్లోకంబులు చిలుకపలుకులుగా నుడివినమాత్ర నట్టివాని బృహస్పతియే యనియు, వాని నోట వెడలుమాట లన్నియు వేదవాక్యంబు లనియు నమ్ముదురు. హా! జ్యోతిషికు లఁట! కాలజ్ఞు లఁట! జనులయాయుఃపరిమాణంబు నిక్కంబుగ వక్కాణింతు రఁట! ఇట్టివి వినుట మూర్ఖత కాదే? ఆరాచకొమరుండు పూర్ణాయు వని కదా లెక్కలేని కాలజ్ఞులు వెవ్వేల లెక్కలు వేసి యేకవాక్యముగ వక్కాణించిరి? జనులఫాల

కుశాగ్రబుద్ధి నిరాటంకంబుగఁ బ్రజ్వలించుచుండం గాసుపీసుబులకుం గాఁగల కార్యఫలంబులు వలుకు జ్యోతిషికులవాక్కు లాశకుసుమంబులగు? ఇట్టివారి మాటలు నమ్ముటచే జనులు తమ యజ్ఞానంబుఁ వెల్లడిపఱుచుకొనుటయ కాదే?

గీ. త్రిజగత్సృష్టి నొనరించునజుండు జనుల, ఫాలపట్టిక వ్రాసినవటువు కల్ల
సేయఁజాలినకోముష్టిశ్రేయులుండ, జ్యోతిషముపలుకులా భువిఖ్యాతిఁగనుటని

ఇవి యన్నియు నటులుండ నిమ్ము; కార్యాలోచన సేయవలయు కొన్నిదినంబులకు నైనను మన సునందనకిఁ బట్టంబు గట్టవలయుం గదా? కట్టినం దప్పేమి? నేనుగదా రాజ్యంబునకుఁ గర్తనై యుండెద? ఆ! కాదు, కాదు. ఎంతటికార్యకర్తనైనను రాజసేవకుఁ డనునామంబు నాకుఁ దప్పదు కాదే? ఆనీచశబ్దంబుం దొలఁగించుకొనుటకుఁ గదా నే నిన్నికడగండ్లఁ బడుట? ఆసుందరి సునందిని నను బరిణయంబైన నే ధన్యుండ నౌదుం గదా! ఆవిన్నాణపుఁ గన్నె నన్నేల వరించు! జవ్వనులు యౌవనపురుషులను గదా వరింతురు? నాకా ముదిమి మెండాయె. ముదములు దొలఁగి పోయె. ముచ్చటలడఁగి పోయె. ముఖసౌందర్యము మాసి పోయె, చెవులా మూసికొని పోయె. దేహమా కృశమాయె. కన్నులా సన్నగిల్లె, ఇట్టి జరాఘోరంబుచేఁ గాలున న్నేల యామించుఁబోఁడి వరించెడిని

ఉడిగెవయోమదముదితలు మసమున రోయుదు రెవ్వది రోఁత యనుచుని
ప్రాయంపుదాంపత్యభావ బులను జూచుభావజునకు నెన్వితియంబు చూడఁ
అఘటితఘటనాప్రయత్నాంబురాశికి బడబచేయునది వసుధఁ జూడని
విషమాస్త్రుసురుపెర విషయానుభవులకు నెయ్యదవిషమైయై యేఁచుచుండు

గీ. మురిపెములసను ముసుగిడు ముదిమి యదియె,
ముచ్చటల కెల్ల నెల్ల యౌముదిమి యదియె;
ముదికి నూడిసలి యనిపించు ముదిమి యదియె,
ముదము మాడని ముచ్చిచ్చు ముదిమి యదియె.

ఇట్టిబలువెతలముదిమి బలసిన నన్ను యువతులు వరింతురా? ఏలయీ వట్టిగోరింతలు? వలదువలదు. ఆసునందని నాకుఁ గోడ లయినను రాజ్యంబు నాదియ యవుంగాదే? నాసుతకు నొకరాజసుతుండు పతి యయ్యెనేని నేనెంతధన్యుండ నయ్యెదనో! ఆదియుం దీరాజ్యం బొకటి నాకు దక్కనిమ్ము. పిమ్మటఁ జూచికొనియెద. ఆసునందని నాసుతునిఁ గుబేరుని వరించు టెటులు? వాఁడు చదువరియే, నిజము. సుందరుఁడే, వాస్తవము. స్త్రీలమనంబులకు నీగుణంబు లెక్కునా? ఎక్కువు. వాకచక్యంబు లేనిచదు వెల? సౌందర్యం బేల? కుబేరుఁడు శుద్ధమూర్ఖుఁడు అత్యాతురుఁడు కార్యసాధనోపాయంబుఁగలలోన యినఁ దలంపఁడు. మాటలా, మెండు. ఇట్టివాని సునందని వరించునా? వరింపకున్న రాజ్యంబు నాకెటులు దక్కఁగలదు? (కొంతసేపు మిఁనుచూచి) ఇస్సీ! ఈయాలోచన సరికాదు. ప్రతాపునివంశంబు నష్టంబయిన జ్ఞాతులు చెలరేఁగి రాజ్యంబుపై దండెత్తివచ్చెదరు. ఇపుడే యీ యోచనతగదు ఎటు లయినను సునందనిని నాకోడలిం జేసికొనుటయే కర్తవ్యము అందుకు నుపాయము నాకుమారుని నకలకళాకోవిదునిఁ జేయుట తక్క వేఱొకటిండుదోఁపదు. కఠినపాషాణంబగ్నిచే దహింపంబడి సుత్తెలచే మొత్తంబడి యులులచేనదుట చెక్కంచుకొని యొకమందసయాకారంబుఁ బొందుచుండ, నాసుతుండు శిశువే నిఖిలకళాప్రవీణుఁ డవుట కేమి సందియంబు? వానికి నేనే యుపదేశ కర్తనయ్యెద ఆ! యేమిది! ఈయాలోచనలలోఁబడి కాలంబుం దెలియనైతిని చేయఁ దగినకార్యంబులు చాలుగనున్నవి, పోవలవదే? (వెళ్లిపోవుచున్నాఁడు)

## తురీయరంగము—రాజమందిరము.

---

సునందని—(స్వగతముగా.) అకటకటా?

> ఉ॥ తమ్ములు దిమ్ముఁ జిమ్ము కనుదమ్ములు శ్రీనవభాగ్యకర్ణముల్,
> ఇమ్మగువిండ్ల నమ్మఁ గల యెమ్మెలవాల్కనుబొమ్మ, లయ్యరే!
> రమ్మిటు కందు నీమొగము, రాజ! యటంచ నను మోముమచ్చటే
> నెమ్మెయిఁ జూచుదాన నిఁక నేమి యుపాయము చిన్నితమ్ముఁడా!

ఇట్టిముద్దులసోదరుని యందపుమోముఁ జూచు టెన్నఁడో దైవమా!

(ప్ర. సుమతి.)

సుమ—సునందనీ! చిఱునగవులతోఁ జెన్నారు నీముఖవిలాసంబు వాడి వన్నెతఱిగె, నది యేల? కనుదమ్ము లేల వనరాశి మ్మునింగినవి?

సునం.

> సీ॥ దిశదిశాయతతమోదశను బాపెడుభూరిచంద్రిక ల్మాయవే శరధరములని
> దావాగ్నికీలల దరికొనుతరు లెటు చిగురుటాకులు పూని జిగిఁ జెలంగు
> రాహువుచేఁ జిక్కి రహిఁగను టెటు లయో రాకానిశాకరుప్రాజ్యలక్ష్మి?
> ఉరుభీకరాతతగురుతక్షకవిషంబు పర్విన నిలుచునే ప్రాణి మకట!
> గీ॥ మన్ననల ముద్దుతమ్ముని మమతఁ బ్రోచి, కాననం బను పెద్దరాకాసి కిచ్చి
> తల్లిదండ్రులు తప్పుతై త్లడిల్ల, సంతసము గల్గునే నాకు సచివవర్య.

సుమతీ! కరుణాలవాలు రయిన నాతలిదండ్రులు కన్నకొడుకును గానక కాననంబునఁ గనరానికాఱియలం బడి చింతిలుచుండ దనుజాంత నాశరీరంబుం దహించుచుండ నాకెటు సంతసంబు గలుగు?

సుమ—తనయా? జయపాలునిపోకడలు విచారించుమనంబు నీకంటె నాకధికంబుగా నున్నది. బాలునిసమాచారంబు విచారింప వేగరుల పనేకులను మనయుగ్రసేనుండు నేఁడే పనిచెను. ఆబాలునికిఁ బ్రాణ

భయంబు లేదు. చిరాయు వని మన యాచార్యులు పలికినపలుకు వ్యర్థ మగునా? ఆభరణాపహరణమునకై చోరులు వానిఁ గొనిపోయి యుందురు. కన్యకామణీ! కొంతకాలంబువఱకు నీవేల సుఖంబులు మాని సఖీజనులచెలిమిఁబూనక వంతలచేఁ గుందుచుండెదవు? వలదు. విచారంబు మానుము.

సునం—సుమతీ! నీయట్టి కార్యవిచారభారకు లుండిన నేకార్యంబున కే కొఱంతయు నెట్లు కలుగు? సోదరువియోగవ్యసనంబు నన్ను బాధింపుచున్నది కాని, వేఱొకదుఃఖంబు నేఁ గని యెఱుఁగను. ఇప్పుడు నీ వాడిన హితవచనంబులు నా మనంబునఁ గొంత సంతసంబుఁ గలిగించె. సుమతీ! నాచెలికత్తె లగుజయమాలికలకంఠరులంగూడి యిఁకఁ బ్రొద్దుఁ బుచ్చుకొనివచ్చెద పోయి వచ్చెద. (చెఱియొకప్రక్కగా వెళ్ళి పోవుచున్నారు)

పంచమరంగము. మంత్రిమందిరము.

---

సుమతి—(స్వగతము.) బాలునిశుభోదంతంబులు కొన్ని పలికి యాసునందచిత్తంబున కానందంబుఁ గల్పించితి. బుద్ధిబలమునకు నెద్దియసాధ్యంబు? ఇఁకఁ జేయందగినకార్యంబు లనేకంబు లున్నవి. నాతనయ జయ మాలియతిబుద్ధిశాలిని, నాకుమారుండగు కుబేరుని మారుని వశీకరించు రూపరి యనియు, కుమారునిఁ బోలుధీరుం డనియు, సురగురునకుఁ బ్రతి యగుచదువరి యనియు, నాసునందనియొద్ద, నెడతెగక పొగడుచుండెడువాగు నాతనయకుఁ గఱపితి, నా సుత నేఁ గఱపినదానికంటె నధికంబుగఁ గొనియాడి సునందనిమనం బా కుబేరునియందు లీన మాలాగు సేయక మానదు. అటులయిన నేఁ దలంచినకార్యం బంతయు సమకూఱు. ఉగ్రసేనునివిచారం బిప్పుడేల?

ఇఁకఁ గొన్నిదినంబు లిటులే యుండనిమ్ము (ఆలోచించి) నాబుద్ధి నన్నుఁ బొందియుండ, నాబొందిలోఁ బ్రాణంబు లుండ, నాకెద్ది యసాధ్యంబు? బుద్ధికి నసాధ్యం బొకండు గలుగునే?

సీ. అవివేకతిమిరాపహారి యౌ మార్తాండ బోధ మీభువిలోన బుద్ధి సూవె;
బహుపాతకవ్రాతవాతంబు మెసపఁ జాల్బుజగ మీభువిలోన బుద్ధి సూవె;
మదవిభ్రమాబ్ధినిర్మగ్నులౌ జనులకు భూరిపోతము భువి బుద్ధి సూవె,
కార్యవిఘ్నం బను కరికి నంకుశ మగు భువిలోన జనులకు బుద్ధి సూవె;
భువి నకారణబంధువు బుద్ధి సూవె, భూరిసంతోషసింధువు బుద్ధి సూవె;
పూత వెట్టని ఫల మది బుద్ధి సూవె, పురుషభూషణరత్నంబు బుద్ధి సూవె;

మంచిది, కుబేరుఁ డేల రాక తడసియుండును? వాఁడు కడుమూర్ఖుఁడు వయోవంతుఁడైనను వనజాక్షులవదనంబుఁ దేఱిచూడ వెఱచును. ప్రస్తుతపుఁగార్యంబున కట్టివిరాగములు పనికిరావు కదా! వానికిఁ జాకచక్యంబు గఱపి విషయాధీనమనస్కునిఁ జేసెద. అటుకానిచో నా కార్యంబు వ్యర్థ మగు. వ్యర్థమా? ఏమి! సుమతికార్యాలోచన వ్యర్థం బగు ననుట కలలోనివార్త, ఈప్రయత్నంబునకుఁ గొంత కలిగెనేని వేఱొకయత్నంబు లేదా? అట్టి క్రూరకృత్యంబులకు నుగ్రసేనుండు చేదోడు వాదోడుగా లేఁడా! నాతలఁచినకార్యంబు ఫలించునంత వఱకు జయమాలీవిషప్రసూనాలు వానికిఁ గంఠహారములుగా నుండుం గద? దాని దరహాసచంద్రికలు వానిమనఃకుసుమవికాసమ్ముం గావించుచుండును.

(ప్రవేశము—కుబేరుఁడు.)

కుబే—తండ్రీ! నన్నేల పిలిపించితిరి?

సుమ—కుబేరా! ఏమిసేయుచుంటివి?

కుబే—ఊరక కూర్చుండి యుంటిని.

సుమ—అదియొకపని యఁటరా?

కుబే—అందునకు సందేహ మేమి ?

సుమ—కుబేరా! అది పని కాదు. తనయా! నీవు వయోవంతుండవయ్యు రాజ్యతంత్రములు నేర్చుటయందేమి, రాజబింబాననలతో సరసస్లాపంబు లాడుటయందేమి, ప్రొద్దు పుచ్చక, యూరక ప్రోడుఁవడిన తరుమూలంబుభంగి నుండుట నగుఁబాటు కాదఁటోయీ?

కుబే—నాకేల రాజ్యతంత్రవిధులు?

సుమ—కుబేరా! అన్నియుం దెలిసి యుండవలయు. ఒకవేళ నీవే రాజవైన నేమి సేయుదువు?

కుబే—తండ్రీ! ననుఁ జంపుపగవానికైనను రాజత్వంబు నేఁ గోరను.

ఉ, రాజితశత్రురాజు లెటు రాజ్యముఁ గొందురొ యన్ను రోఁజుచున్,
రాజులు, ధారణీజనులరట్టడిఘోషము లెల్లకాలమున్,
రాఁ, జెవి యొగ్గి వాని విని రాష్ట్రిపుఁబాపగణంబుఁ గైకొనన్
భాజను లైనవారు; స్థిరభాగ్యము భోగము వారికెట్లగున్ ?

తండ్రీ! ఎంత యుండినను రాజులకు మది నెమ్మదియు, రాత్రులఁ గంటకి నిద్రయు, లేదు కదా ? పరరాజభీతులై పరులపాపంబులందు భాగహారులగునవ్వారికి సుఖం బెటులు గలుగు ?

సుమ—కుబేరా ! అవి గ్రంథంబులలోని నీతులు. పిచ్చివారి వ్రాఁతలు. దుర్బలుల కూఁతలు. వాని ననుసరించిన రాజొకదినం బయినను బ్రతుకుట దుర్లభంబగు. లోకుల కష్టార్జితద్రవ్యంబు లేనెపంబుననైనను గొని తా ననుభవింపఁ జూచుచుండెడు పుడమిఱేఁడు కొన్నిదినంబులయినను రాజ్యం బేలును. కుబేరా! మఱియొకటివినుము. నీవు వయోవంతుడవే ! వివాహంబు వలదా ?

కుబే—నాకది యొకకాలిసంకిలియకాదే ? వివాహంబు నాపగవానికైనసనేఁగోరను. సుఃఖులు యమదూతలని నాహితు లనేకులు నాకుఁ దెలిపిరి.

తే, గీ చెలువ గలిగిన మఱి వేఱు చిలువ యేల?
ఆలు గలిగిన మఱి వేఱు తేలదేల?
నారి గలిగిన మఱి వేఱు మారి యేల?
నాతి గలిగిన మఱి వేఱు కోఁతి యేల?

తండ్రీ! వివాహంబు గావించి నాకిట్టి కాఱియలు మేళవించు కోరికలు నీ కేల కలిగె?

సుమ—కుబేరా! నీవెంతపిచ్చివాఁడవు. స్త్రీలసహజగుణంబులని కుజాతి తరుణుల దుర్గుణంబులు నీ కెవరో బోధించి యుందురు

సీ అతివ గదా భువి నతిసుఖములరేవ కష్టాబ్ధిఁ దరియింపఁగట్టినావ?
అతివ గదా పతి కతిహితములతేవ, జీవనావాప్తి సంజీవితీవ?
అతివ గదా పతి కావట మగుత్రోవ, నాథునిపుణ్యరత్నములఠోవ?
అతివ గదా పతిగతులకు నెత్రుత్రోవ, ధవుధైర్యతనునిబంధనపుఁజేవ?

అతివ గలిగిన మఱి వేఱు హితులు నేల?
నాతిగలిగిన మఱి వేఱు ఖ్యాతి యేల?
ఇంతి గలిగిన మఱి వేఱు చింత లేల?
సతులు గలిగిన మఱి పరగతుల వేఁ?

కుబేరా! నిశ్చయించి చూడ, సతులు గదా, పతులపుణ్యగతుల కానుకూల్యవతులు. హితాచారనీతులు వంశైకపునీతలు. ఇట్టిమానసీయలగు మానినుల నవమానపుఁబలుకులు పలుకఁ దగునా? కుబేరా;

తే గీ యుక్తవయసునఁ బెండ్లాడి యువిఁ గూడి
పరఁగ గృహధర్మములు సూచుపతికి, ముక్తి,
కొంగు బంగారముగ నెంతో రంగుమీఱు
మంటినిధానమా, నౌర! ముదముగాను

కుబేరా! పరిణయసుఖం బింతంతయనియు నిట్టిదట్టిదనియు వివరింపనాతరమా? తండ్రీ! నీనుండి కదా, నావంశవృక్షంబున శాఖ లేర్పడవలెను? కావున వివాహం బాడి నను విచారదూరునిఁ జేయుమని నే నిను నమ్మినాఁడను.

కుబే—తండ్రీ! నే వివాహం బాడక యుండినది నీశోకవిచారంబుగా నుండె నేని నీయిష్టానుసారంబు చేసెద.

సుమ—ఇది కదా, సుపుత్రలక్షణంబు. కుబేరా నాకిపుడు పెళ్లోకయాలోచన మనం బంటెను గదా! ఏమిసేయుదు?

కుబే—తండ్రీ! అది యేమి?

సుమ—మనకులంబున నీకుందగిన వయోరూపాతిశయ సుందరీమణులు లేరు కాదే!

కుబే—తండ్రి! పరిణయం బయిన మనసునందనిం బోలు సౌందర్యవతినిఁ బెండ్లి సేసికొనవలయు.

సుమ—(తనలో) వీనికిని సునందనిసౌందర్యంబ మనం బంటినది (ప్రకాశముగా) తండ్రీ! సునందనిం బోలు సుందరీమణులు వసుంధరయందు లేరుగా! అది యంతటి సుందరియఁటరా?

కుబే—ఏమితండ్రీ! ఆసునందనిసౌందర్యంబుఁ దెలియనివాఁడవుంబలె నటించెదవు? జగన్మోహిని యని కదా దానిం జనులు కొనియాడెదరు? ఆమాటకు సందియం బేమి?

కేదారగౌళ రాగము-చాపు తాళము.

ఎన్నఁదరమె యాయమ్మలమిన్నచ-చిన్నెలు గలయావన్నెలకన్నెను॥ పల్లవి॥
రాజబింబము బింబరాజము నగునౌర! రామమోమురీవి రమణికెమ్మోవి॥౧॥
మదమృగమును మృగమదము నగునౌర! - మదవతికనురీవి మగువమేనితావి॥౨॥
గంధనాగము నాగగంధము నగునౌర! మందయానముతీరు సుందరినూగారు॥౩॥

క॥ అమ్ములఁ దమ్ముల రాజీ, వమ్ములఁ గ్రొమ్మెఱుఁగుఁబసల వమ్మను నౌరా!
యమ్మెల్లత యరళతర నయ, నమ్ములు హేలాసువిలసనమ్ములు చూడన్

తండ్రీ! ఇట్టిది కదా దానియందంబు.

సుమ—అటు లయిన సునందనిఁ బోలువారి యువనిం గలుగుట దుర్లభంబు, ఏమి సేయవలయు?

కుబే—తండ్రీ! అది నిజము, ఏమి సేయవలయును?

సుమ—కుబేరా! సునందనిం బోలువారు ప్రపంచంబున లేరు కావున సునందనినే పెండ్లియాడుట మేలని నాకుం దోఁచెడు.

కుబే—నాయనా! నన్నుఁ బరిహసించెదరా? సునందని యెక్కడ? నే నెక్కడ? హస్తిమశకాంతరంబు గాదే? సునందని రాజుకూఁతురు, నే నామెసేవకుఁడను.

సుమ—కుబేరా! నీవు సకలసాహిత్యగ్రంథంబులుం జదివితివి కాని యందులతత్వం బెఱుంగవైతివి. ఆదిని నీయాతురత్వంబునకు న్మితి కల్పింపుము. పిమ్మట నతిహితం బగుచతురమతిని సేవింపుము తోడననా సునందనిం జేరి నయవినయంబులు నెఱపి, సమయానుసారం బగుహితవ్రులు గఱపి, యితరునిపై నుండుమమతలు చెఱచి, కాలక్రమంబున నీరతి దానికిం దెలిపి, దానిమతికి సమ్మతిఁ గావించిన, నీవు దానికిం బతివయ్యెదవు ఆతురపడితివేని నీకార్యంబు గట్టెక్కదు.

ఉ. చూరివివేకసారతరభూరుహమూలకుఠారమాతురం
బారయఁ గార్యపూర్వఫలమార్పెడుమారుతమాతురంబు, దు
ర్వారప్రయత్నవారినిధిబాడబమాతుర, మెల్లకాలమె
వ్వారికిఁ గూడదాతుర, మవారితదుఃఖకరంబు ధారణిన్

సుమ—ఇట్టిదుర్గుణాధికం బగునాతురత వదలుము. తత్తఱపడితివేని కార్యంబు రిత్తవోవును. ఉభయమై తఱి వేఁచి యుండుము. కార్యశేఖరధరాధరవజ్రంబు కదా యాతురత. ఆతురత కదా యనూరునిపాదంబులపాలిటి పెనుమృత్యువు దితివంశంబుపాలిటిదావాగ్ని యాతురత కదా? ఇవి యన్నియుఁ దెలిసి కాలక్రమంబున సమయంబుఁ గాచి కార్యంబు సాధించుకొమ్ము. పోయి రమ్ము.

కుబే—సెలవిచ్చినఁ బోయి వచ్చెద. (వెళ్లుచున్నాఁడు)

సుమ—బళే! ఇప్పటికిఁ గార్యము గట్టెక్కించితి. ఇఁక మందాలోచన చూచికొందము. (వెళ్లిపోవుచున్నాఁడు.)

# సునందనీపరిణయము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము—అరణ్యము.

ఎఱుకలు (దొంగలు)

మోహనరాగము-ఆదితాళము.

పల్లవి॥ కడసి వస్సితిమి జడియకుఁడి మీరు తడయకుఁడాము యీడ కడమవారు గూడ॥
దోసకారి వాని మోసగిల్సి మనము మూసి దాసి యున్న కాసుదోసితిమి ॥౧॥
వడ్డి కొడ్డి గట్టి, సెడ్డ లన్ని జేసి దుడ్డు గూర్చువాని, జిడ్డుగడగమె॥ ౨॥
కుడువఁ గట్ట నుండి కడుపుఁ గట్టువాని-యొడలియెడ లన్ని సడలిస్సమె మేము॥
పుడమిలోపలదుడుసువాఁడెవ్వాఁడో-దుడుసువానిధనముగుడుసువాఁడెవ్వాఁడో
పుట్టినప్పు డెవ్వఁడు కట్టుకొని రాఁడు-గిట్టువేళ వెంటఁ బెట్టుకొని పోఁడు॥ ౩॥

రాముగాఁడు—చండోడా మనము గడ గడసి వస్సితిమి. మన కేల జడుపు? కడమవారు గూడనీ నిలతము.

చెంచోఁడు—జడుపు! మన తెలలో లేదు కదా! ఆమాటాడక.

కోసిగాఁడు—ఆపొట్టోని బాగా దోసితిమని అబ్బా! వాని దెంత దుడ్డురా

రాముగాఁడు—ఎందరికొంపల కగ్గి పెట్టి యుండెరా వాఁడు?

చెంచోఁడు—ఇఁక పన్నెండేండ్లు మన కేళ్లొ అంత లేదు. హాయిగా నుండ వస్సునని.

కోసిగాఁడు—ఈపొట్టోని కింత దుడ్డెటు వస్సి యుండు నోసీ?

రాముగాఁడు—దుడ్డుదుడ్డుకు వడ్డి, వడ్డికి మారొడ్డి, మారొడ్డికి మారుమారొడ్డి, గట్టి, కొంపలు గూల్సి, యిల్లాలినమ్మిస్సి, తాళి తెస్సి సేన దుడ్డనీ యిది.

చెంచోఁడు—అటు లయిన పాపిదుడ్డసీ యిది! కడుపున కంటే నగ్సీ?

కోసిగాఁడు—మనము దుడ్డు తిందు మసీ? అంగడివానికి బత్తెమున కిత్తు ముగాదసీ? జంకేల నసీ?

రాముగాఁడు—అటుగా దసీ. పాపిదు డ్డొస్సినపుడు దానాదరుమం సే వలెనోసీ,

కోసిగాఁడు—అవునసీ మనకు జోతిస్సము పెట్టిచ్చినయ్యాకు పెండిలిటసీ. నూఱువారలిత్త మొసీ? పేఁదోడు మంచిమూర్త్తమును పెట్టు బాఁపనోడసీ వాఁడు.

రాముగాఁడు—ఇత్త్రము నూఱువారలేల? పదినూఱువారలిత్త్రము మనకేం తక్వసీ.

చెంచోఁడు—కడుపునకు కడి తినక యుండినయీణికి, కడు పెటులవస్సె నసే?

కోసిగాఁడు—రేయిబవలు దుడ్డు సూసుట, మూటఁ గట్టుట, మరల విస్సుట, మరల దుడ్డైనసుట, మరలఁ గట్టుట, మింటికి కన్నెగ రేసుట, మంటికి దినుసుట, ఇదియే వీని పని, సూసిసూసి కడుపు వస్సెనసి.

రాముగాఁడు—బిస్సాలవాఁడు పైసా యడిగిన, పాన మిస్సును కానిపైసా యిస్సునోసీ వీఁడు?

చెంచోఁడు—ఇట్టివా రుండ మనకు బతుకు తెర వసీ, లేకున్న గతి యేమసీ? మనయూరిల్లేరమ్మ మనకోస మీళ్ళను పుట్టిన్ను నసీ. ఇట్టివారు కడుపు కట్టునది మనపొట్టకు పెట్టుటకే నసీ.

కోసిగాఁడు—నిజ మసీ, యొకనిని యడుగము; ఒకచోట కోలు వుండము. యొకనివద్ద యొక పైసా యప్పు తీయము అడవిలో ఒక కాణి బూమి యెఱుఁగము. ఊరిలో ఇల్లు కట్టము. ఏపణిం జడవము. అయినను మనమె దొరలము కామసీ.

రాముగాఁడు—దొర లబ్బల మసీ? బలువగలవొరలకు రెయ్యుంబవలు

నీదుర లేదసీ. మనలకో యీక పన్నెండేంళ్లు కంటికి నల్లగా నిదుర వస్సగా దసీ.

కోసిగాఁడు—నిలు నిలసీ. సద్దు సద్దసీ. బొట్టె డేఁడో మేడ్సెడు ఇంటే మసీ?

రాముగాఁడు—అవు నసీ. ఈడేఁడోపోరగాఁడేడ్సెడు రండసీసూతామ్ పరుగుపరుగున రాండసీ.          (అనుచు పరుగెత్తుచున్నారు.

## ద్వితీయరంగము—అరణ్యము.

జయపాలుఁడు - ఘాతకులు. ఎఱుకలు

జయపాలుఁడు—

చ॥ ఇటు ననుఁ దెచ్చి యేమికత మీ విటు లాడెద నీ పన్న! మేలొకో నీ
యట జనయిత్రి నన్ను విడి హా! సుత! నా దెసనుండి యేల యె
చ్చటఁ గనుఁ బ్రామి పోయి నీ తని చాల బడల్పడి కందు, నన్న! యి
ప్పటి కెటు లైనఁ దల్లిఁ గలపం గద వన్న కడంగి వేఁడెదన్

చెండోఁడు—సంపసీ యెఱ్ఱోఁడా? ఏల తడసెదవు.

జయపా—తండ్రులారా! నన్నేల చంపుపలుకులు పలికెదరు? నే నెవరి కేనేరంబు సేసియుందు? ఘాతుకులారా? ననుఁ జంప మీకుఁ గల్గు లాభం బేమి? నాకుఁ గడు భయ మయ్యెడు. నాయయ్యను జూపిన మీకు వెయ్యాఱు వరహా లిప్పించెద. చల్లని నాతల్లినిఁ జూపినన్ మీకడుపులు చల్ల సేయించెద, అక్కఱ గలనాయక్కయ్యను జూపిన మీకు మిక్కిలిసొక్కము లిప్పించెద. అయ్యలారా! నట్టడవిని నన్నీరీతిఁ జంపకుఁడీ; మిమ్ముల వేఁడుకొందును

ఎఱ్ఱోఁడు—అబ్బా! బిడ్డలు లేక కడుపు గొడ్డోయినోఁడే ఈకందయ్యను సంపాలె గాని నను సంపసీ నాసేత కాదసీ.

పిచ్చోఁడు—ఆకూనమా టిన్న సాలు నసీ. మన సొక దిను సౌనొసీ. ఆ కంచమ్మమాటకు నాకంటికి నీ రొస్సె నసీ ఈదోసప్పని నా సేత కా దొసీ.

చెండోఁడు—ఓరీ పోంద్రసీ! మీరెంతటిపాపులు. తిన్నింటి దంతెలెన్నె వా రసీ మీరు ఉప్పుతిన్నోనియానకు వేలు సేయ నగు నసీ? సుక్క లాలె లెక్క లేనిపానాలను మేకలనుం బలె గత్తిరిస్సిన మాకీ పాపో డెం తసీ? వేటోనికి మెకముపై దయ యుండు నసీ?

పిచ్చోఁడు—వానికొలువుకన్న నట్టడవినుండి యాకూ అలమూ మెసవి గుంటలో పాఱు నీరు తాగి పొదరింట్లో సల్లగా నిదురిన్స వస్సు నసీ

చెండోఁడు—మీరలు దోవు లసీ పాపోనిపై మనసు పెట్టితి రసీ. వాని తల నే నెట్టెద సూడం ద్రసీ (అనుచుఁ గత్తియెత్తిన బాలుఁడు పరుగిడుచున్నాఁడు ) ఆసమయంబున నెఱుకులు వెనుకనుండి వచ్చి చెండోనిని గట్టిగఁ బట్టుకొనుచున్నారు.) ఓరీ! యెనక నను బట్టినోం ద్రోట్లా? విడుండివిందుం ద్రసీ. పానంబు పోయెడు రసీ. విడుం ద్రసీ

ఎఱుకు—సేతికత్తిసి రేసిన నిన్నిడుస్సాం కాని లేకున్న నీపానం వుస్కాం దు మసీ.

చెండోఁడు—అయ్యోపానం తీకం ద్రసీ. విడిసితి కత్తి. విడువిడుం ద్రసి [కత్తిక్రింద వైచుచున్నాఁడు. ఎఱుకులు విడుచుచున్నారు.] అబ్బా! బతికితి నసీ. వీరేగో పాపోనిపాల దయ్యంబు లయ్యిన్నా రసీ.

ఎఱుకు—ఓరీ! దోసకారీ! పసిపాపోని దెస్సి యట్టు గోసెదవే! ఆకంద్ర మ్మ నీకేంతప్పు సేసె నంటా?

చెండోఁడు—తప్పు సేసెనో యొప్పు సేసెనో దయ్యాన్కె తెల్యాలి. మేల్నోణియాన సేయా ల్నా ద్దసీ.

ఎఱుకు — ఏబ్బోఁడు కాఁడు నీయేల్బోడబ్బోబ్ణి రానీ యాకూనపైపేలు పడ నీము.

జయపా — తండ్రులారా! రక్షింపుఁడు [అని యెఱుకులకడకుఁ బరుగిడు చున్నాఁడు]

చెంచోఁడు — పాపోసితల దీనిసో యాదున్న పోతు మాతల దీసు నసీ. ఏమి సేతుం బాబోండార్రా?

ఎఱుకులు — పోండ్రసీ దోసులారా? ఈ పాపోని మా కప్పగిన్ని సంపితి మని సాటించం డ్రసీ. నూఱువార లిస్సేం పోపోం డ్రోసీ.

చెండోఁడు — ఏం బాబూ? మామ్ కల్లోండ్రమా? కల్ల మా తెల్లో లేదే! కల్లోణ్ణి కుల మోండ్లు వెల్తితురు కా దసీ?

ఎఱుకులు... మీరటు సేనిసో పిల్లోఁడూ పోవు. నూఱువారలూ పోవు. పోం డ్రసీ. పోనిసో మీపానాలు పుస్కొందు మసీ మామూ,

చెండోఁడు... నిజ మసీ. అట్లే సేతుం కాని నీయబ్బాండ్రారా? ఈకంద న్నను వెల్తికుండా దాసిపెట్టి పెన్సుండ్రోరీ. కాని బాబూ! మా వార లిస్సేం డ్రసీ.

ఎఱుకులు... పుస్కొం డ్రసీ; పెటూట్లో రోండ్లూ [అనుచు నూఱువర హా లెంచి యిచ్చుచున్నారు.]

చెండోఁడు... ఎట్టిమిన్నెథు దుడ్డసీ ఇది? యబ్బలారా! ఇది యెస్పట దెస్కితి రసి.

ఎఱుకులు... దుడ్డు పుట్టిన్సవిద్దియము గఱసితి మసీ మాము,

చెండోఁడు... మా కావిద్దియం సెప్పం డ్రసీ.

ఎఱుకులు... పెరూరికి సెప్పవిద్దేం కా దసీయది,

చెండోఁడు — మీవిద్దియామ్ మీకే యుండనీం డ్రసీ. మాముపోతు మసీ!

(అందఱును వెళ్ళుచున్నారు.)

## ద్వితీయాంకము.

### తృతీయరంగము...ఉగ్రసేనునిమందిరము.

ఉగ్రసేనుఁడు...అహాహా! ఆసుందరి యాచిత్తరుఁబొమ్మ సౌందర్యాతిశయంబు నామనమం దచ్చొత్తినట్టున్నది! అప్సరోంగనలఁ బొందనవని జను లాహావాదికర్మంబుల మేషాదిపశుచ్ఛేదనంబు సేయుచుండ్రు కాదే? అట్టిచో నాయచ్చరకన్నెలకన్న నెన్నఁ దగినకన్నె యగు జయమాలినిఁ గలయుటకై యొకశిశుచ్ఛేదనం బొనరించిన నది నాకెట్లు దోషమగును? హా, ఆయప్సరసలీసుందరీమణియొక్క యొక్కొకయంగమున కేని సరి యాదు రా?

సీ. శశిరేఖ యందమా, శశిరేఖ యాచెలిఫాలతలం బైనఁ బోలలేదు,
హరిణీసరోజాక్షి యందమా, హరిణి యాసఖికన్నుఁగవ కింతసాటి రాదు;
రంభ యఁటందమా, రంభ యానసఁబోఁడియూరులఁ బోల నీరూరు లోన;
తార యందమా తార యాసతి కాలిగోరితోఁబోలక తారు మింట,
నహహా! సుందరిజయమాలి యవయవంబు
లొకటొకటె దివ్యకాంతల నోటుపఱుచు,
మరుని యారపశేర మన మహిఁ దనర్చఁ,
జంద్రపరిపూర్ణరుచికళాసాంద్రయగుచు

ఆహా! ఇందిందిరాభాలకయు శకలితశశిబింబాలికయు నగునీబాలికను సంభ్రమంబు గదురఁ గూడి తనివిఁజెందుట పూర్వభవార్జితపుణ్యవైభవంబ కాదే! అది పుణ్యపురుషుల యదృష్టలభ్యంబగుటకు సంశయంబే! ఈకరభనిభోరు వినుతముఖవిభవంబుం జూచిన మానవుని మనోమర్మములను మరుఁ డుఝులం గొల్పఁడా! అహా! ఆగంధసింధురరాజగమన ముఖేందుబింబ నవలావణ్యామృతసింధువు నందీఁదుటకుం గదా యావసుందరాధిపుని సుందరతర సుకుమారకుమారశేఖరుని ఘోరాటవులందుఁ దలిదండ్రుల నెడబాపితి?

మదనదర్పణవృత్తము కన్నెఁ గలయఁ గాఁడ జేసితి న్నవయగు [illegible] శ్యముల్

నన్నుఁ గనినఁ గౌఁగిలించి నాన వీడి రమ్మనుల్;

సన్నుతు ననుఁ జేరఁ దీసి నీసమాను లే రనుల్;

మున్ను దలఁచువాంఛ లన్నియు న్మదంబుగా నిడుల్.

భళిరే! నాయనర్గళభుజార్గళబలంబు గదా యింతటిసుఖంబు నాకం దించునది? భుజబలఁబు లేనివానికి బుద్ధిబలం బుండిన నేమి? దైవ బలం బుండిన నేమి?

తే. గీ భుజబలము గాదె సమకూర్చె బుద్ధిఁ జూడఁ,
త్రిజగతీపోషణబలంబు శ్రీహరికిని,
త్రిజగతీశోషణబలంబు త్రినయనునకుఁ,
త్రిజగతీసృష్టిబల మల యజునకి కహహ!

ఇఁక నాసుందరినిఁ జూడక నిలువఁ జాలను. దానిమందిరంబునకుం బోయెదం గాక. (నిష్క్రమము.)

---

ద్వి తీ యాం క ము.

చతుర్థరంగము—మంత్రిమందిరము.

జయమాలి. అహహా! స్త్రీలుగదా పురుషమృగంబులను బట్టుటకై మరుఁడు పెంచిన దీమములు? యువతుల పైపూఁతల మను తలకును, చెలువల వంచనల వలపులకును, మదనప్రదరవిదళితవివేకు లై, కాముకులు సుడిం బడినచెత్తలుంబోలె భ్రమించుచుందురు. ఆహా! ఆయుగ్రసేను నెంతటివి మోహవారిధిలో ముంచివేసితిని! తె చ్చుకోల్వలపులు హెచ్చించి మెచ్చగువెలయాలిమోహంబున్న టించి వానినిఁ బిచ్చివానిఁ జేసితిం గదా! మదాంధుఁడై వాఁ డీమాయలను దెలియఁ జాలకున్నాఁడు.

* ఆఖేటవృత్తము *

మదిరాక్షులు రాక్షసులం చెన్నక మైయందంబుల్ మాయలె యంచున్,
మదనప్రదరంబులను న్మ్రొక్కుచు మన్నన్నొసన్న న్గానకయెంతో
మునుముక్కానుచు, న్మదిలో రమ్మని ముందు న్నెక్కాన్నోపక పల్కన్;
హృదయంబు విషం, బధరం బౌ సుధ, యెన్నన్గన్నన్ వెన్నునిమాయల్,

మాయలు మానినులకు మానవీయంబులుగావని జను లాడుదురు నాకును నట్టిమాయలు హేయంబు లని తెలియు. అయినను నా చేయఁగల దిం కేమియు లేక యున్నది. జనకు నాన మీఱినఁ బాపంబు సిద్ధించును గదా! ఈలోకమున స్త్రీలు ప్రసేయాంతరులని తెలిసియుఁ బురుషు లేలొకో వారి నబల లని నాడుచున్నారు? జలజనయనల బుద్ధిబలిమికిఁ దులఁదూఁగువా రీయిలలో లేరు. ఉవిదలకు స్వాతంత్ర్యము వల దని శాస్త్రకోవిదులు పలుకుదురు. అనిశాస్త్రంబుల లోనివార్తలే.

అంబురుహవృత్తము.

భారతి నారులలోచనసాయక భాతిన స్వడి దిట్టరా
ధీరులఁ గానను మారుతి శిష్యులు దేవతాంశకముఖ్యవుల్
నారులు గోరిన నేరును వారి సణంపఁ జాలరు పాన్కినై
వారలఁ బూరుషు లేలొకొ వెల్లిఁ వాడుచుందురు ముందుగాన్

యథార్థంబుగ స్త్రీలే స్వతంత్రలనుటకు సందియంబు లేదు వేదోక్తులు నారులవాల్భ్యాప్ర లనుకొనమ్ము లున్మ సంతరించి వారికి నమ్ముకొచ్చి చరణమ్ముల సేవింప కుందురే మూలఁ గూర్చుండినయె గాలము వైచి యిల నైన నొక్కమై నిక్కఁ జాలిన చెలులు నబల లని పురుషు లాడుట తమయందు బలంబు వ్యర్థంబుగా నిరూపించుకొనుటకుఁ గాఁ

* ఇది 21-వ ఛందంబునందలి 396508-వ వృత్తము స. స. స. భ. స. త య. గణములు 13-వ యతి యగును.

బోటు. జగత్తు స్త్రీమయాలం బనుది మఱచిరి కాఁబోలు. (ఉగ్రసే నుండు ప్రవేశించుచున్నాఁడు.)

ఉగ్ర—జయమాలీ! నీకు జయ మగుఁ గాక, జయ మగుం గాక! దేవి కుశలమా?

జయ—(సిగ్గు నటించుచు) నీయట్టి బలశాలి చేపట్టి యుండ నాకుశలంబున కేకొఱంతయు గోరంత యే నెట్లు కలుఁగును?

ఉగ్ర—(తనలో) బళి! యీమెపలుకు! కప్పురంపుంబలుకు, తేనియలొలుకు, మాధుర్యంబుం జిలుకుం గాదె?

జయ—(తల వంచికొని) ఏ మిది యచ్చెరువు? ఈదినంబున నాకుముం గోలుగఁ జెప్పక విధివిరుద్ధంబుగఁ జెచ్చెర లోనికి వచ్చితిరి! స్వతంత్రత చేకూరెం గాఁబోలు? నిజము.

ఉగ్ర—జయమాలీ!

జయ—చాలుంజాలు. నాపే రెత్తకుము. నాపేరం బిలవకుము.

ఉగ్ర—అళిచికుర! పేరం బిలిచినఁ దప్పేమి? పరిణయానంతరంబునఁ గదా నీనామంబు గాయత్రీమంత్రబుకీతి నట్టిగ నుచ్చరింపఁ గూడ నిదిగా నుండు? సుందరీ! విజయాక్షరకలితం బగు నీనామస్మరణమాత్రనె నాకఘటనఘటనా కౌశలంబు కలుగుచున్న దప్రభావ మెట్టిదో తెలియకున్నది,

క. విజయాక్షరనామము మద, గజయానా! స్మరణ సేయఁ గలుగును శుభముల్;
త్రిజగన్మోహిని! నీవో, విజయాక్షరనామపంక్తి వెలయుదువు రహిన్.

జయమాలీ! ఇట్టి నీనామాక్షరంబులయందు లియ్యమై దివ్యౌషధవిశేషమో, దివ్యామృతసారమో, యున్నది. లేకున్నఁ గ్రోలినమాత్రనె నాకెందుఘజంబు లుప్పొంగి నాయం దొకదివ్యసామర్థ్యంబుద్భవింప నేల?

జయ—  తాళ మిశ్రచాపు.

గాంచు వచ్చు నీకు.

ఉగ్ర—  శుభకాలము నా కది నమ్ము నెమ్మదిన్

జయ—ఉగ్రసేనా! నీవచనంబులకు నామనం బెంత విచారంబు నొందునో చూసునది యెఱుంగక యున్నా వేల? నావిచారంబు దైవం బెఱుంగు. నీపలుకు లనునవి నావిచారాగ్నికి శుష్కేంధనములుగా నున్నవి. ఏమి సేయవలెను? జనకునాన కలుగునంతవఱకు మన దుఃఖంబు మనమే యుపశమించుకో వలయు? నీ కీవిలంబము కష్టముగా నున్నది. కష్టములేక సుఖం బేల కలుగు? ఉగ్రసేనా! విచారము వలదు. కాఁదగినకార్యంబులు గాక యేల మానును? విదియనాఁ డగపడని చంద్రుఁడు తదియనాఁడు దాఁగునా?

చ॥ విదియనిశాస్యమున్గనని వెల్లలఁ జేఁడెటు డాఁగిపోవుఁ దాఁ
దదియనిశాప్తి? నేల యిటు తత్తర మొందెద వక్కటా! భువిన్
ముదములు హెచ్చుఁ గష్టములు మూఁడి సుఖం బొనగూడు వానికిన్
విదితము గాదె పేదవడి వెండియుఁ గల్గెడుకల్మిసౌఖ్యమున్?

ఉగ్రసేనా! నీ కీనీతులు దెలియకున్నవే? ఇంకం గొన్నిదినంబు లిటులే యోర్చి నాతండ్రి యనుగ్రహంబునం జెడక యతనియాజ్ఞానుసారంబుగా వర్తించితేని రాజ్యంబు నాతండ్రిదియగు. అపుడు కదా నీపదవి మిన్నందును! నీసుఖంబు నాసుఖం బగు!

ఉగ్ర—జయమాలీ! నీమధురవచనంబులు హితనీతియుతంబులు. నిజము, త్వరపడినఁ గార్యంబు వ్యర్థమగు. నీజనకునిమనంబున కేనాఁడు మనపై దయ కలుగునో యాపాటివఱకు వేచి యుండెద. దిన మొకయుగంబుగాఁ జూచుచుం గాచియుండెద. జయమాలీ! పోయి వచ్చెద.
(అనుచు నరుగఁ బోవుచున్నాఁడు.)

జయ—(దూరంబునకుఁ బోయి) ఉగ్రసేనా! దుఃఖింపకు. నాతండ్రికి సర్వం బెఱింగించెద. మంచిది. నీవు విశేషముపనులవాఁడవు పోయి రమ్ము.

ఉగ్ర—హృదయేశ్వరీ! నీయాజ్ఞ మీఱక వర్తించెద మఱవకుము.

(ఉగ్రసేనుఁడు వెళ్లిపోవుచున్నాఁడు.)

జయ—మదిరారసోన్మాదమత్తుఁ డగుజనునింబలె వీఁడు మారమోహరసోన్మాదుఁడై యొడ లెఱుంగకున్నవాఁడు. వీఁడు మోహవిభ్రమవిభ్రష్టవివేకుఁడై నేనాఁడినదెల్లం బ్రాగ్ధపదవి వేచన సైతము సేయుచున్నాఁడు. సర్పదష్టునకు నింబపత్రంబులు మధురములైనట్లు విషయాధీనమనస్కుఁ డగువానికి నావిషమార్గంబులు మధురామృతంబులైనయవి. వెఱ్ఱికి వేయివిధంబు లండ్రు గాదే? ఆవేయింట నిది యొక్కండని యెన్నెద. ఆ! వారిపేరి ననకేల? నేఁ బిచ్చిదానను గానా? ఇట్టి యమానితకృత్యంబులు సేయఁ జాల నని నాజనకునకుఁ దెలిపిన నచ్చట గొట్టునా? ఇపుడా లోచించి ప్రయోజనం బేమి?

(నిష్క్రమించుచున్నది.)

## ద్వితీయాంకము.

### పంచవరంగము—రాజమందిరము.

సునందని— కవిరాజవిరాజితము.

తనయునిఁ గానక తల్లియుఁదండ్రియుఁ దాళఁగ నోపనితాపముచే,
వనములఁ జేడ్పడి వాయువుఁ గ్రోలుచు వాసిఁ దొలంగుచు వాడఁగ, నే
మన్నియెడ నేవ నిని మాననివఱలఁ మానసమం బెను. మాధవ! నా
యనుజునిఁ జూపర యాయువనీశుని యారట మాఱ దయావనధీ

హా! అట్టి మహానుభావునకా యిట్టిఘోరసంకటములు? పుట్టిననాఁటఁగోలె భూరిసుఖపదవి ననుభవించిన చల్లని నాతల్లికి నిట్టి గహన

నివాసంబు రాఁ జెల్లునే? చిన్నతనమునుండియు మన్ననలచే నేనాడించుచుండిన నాతమ్ముఁ డేమాయెనో మాయమాయెను? ఆబాలకుని భృంగశాబాలకుని నగుమొగంబు మఱలఁ జూచుభాగ్యం బీ నిర్భాగ్యురాలికి నాకుఁ గలుగునో కలుగదో? దైవం బెఱుంగు.

మ. అకటా! బాలుఁడు నిద్రలేచి వనిలో నయ్యయ్య! యప్పయ్యరో!
యొకని న్మక్కిటు నెట్టి పోవ నగునే? యోయమ్మరో! యంచు; బ
ల్వికటమ్ము న్నగ వాడియాడి తుదకు న్వాతాశు వై క్రుంగెనో;
అకటా! సోదరు ముద్దుమోముఁ గను భాగ్యం బున్నదో లేదకో!

అట్టి సోదరుని విచారంబున నాకు నేమియుం దోఁపక యున్నది.

(అనుచుఁ జింతించుచుండఁ గుబేరుండు ప్రవేశించుచున్నాఁడు.)

కుబే—సునందనీ! ఈనడుమ నీతీరు వేఱై యున్న దది యేల? ఎల్లకాలంబుఁ జింతించుచుండెదవు కారణం బేమి? చిన్నతనమునుండి నే నిన్నుఁ జూచుచుందును. ఎన్నఁడు నీ వీరీతి ఖిన్నురాలవై యున్న దానవు గావు.

సునం—కుబేరా! అన్నచెల్లెండ్రుంబలెఁ జిన్నతనమునుండియు నాడుచుం బాడుచు నుంటిమి కదా? నాకెన్నఁడే నిట్టి దుర్భరవ్యసనంబునకుఁ గతంబు గలిగెనే? లేదు. ఇపుడు కదా యది నాకు సంప్రాప్తమాయెను. ఈదుఃఖంబు కొన్ని వత్సరంబులు వెలిఁ బడకే భరించితి. దినములు గడచినకొలఁది నది దుర్భరమై వెలికి నుబుకుచున్నది. ఏమి సేయఁగలను?

కుబే—సునందనీ! అట్టిచింతకుఁ గారణం బేమి?

సునం—ఏమి కుబేరా! తెలియనివానిం బలె నడిగెదవు? నాయనుంగుఁ దమ్ముని విచారంబు దక్క నాకు వేఱొక్క విచారం బెక్కడిది యగునే?

కుబే.— సునందా! ఎట్టివెఱ్ఱిదానవు! నీయనుజన్ముఁడు పోయి యయిదేండ్లయినది. కానరాకఁ బోయినవాఁ డిన్ని దినంబులు చనినవెనుక నిపుడు దొరకునే? ఏల నీకీచింత?

సునం.— ఏమి! కుబేరా! అయ్యో! నాతమ్ముఁడు దొరకఁడా? శ్రీహరీ!

చ. కటకటా! తమ్ముఁడా! విపినకంటకమూకల నొచ్చినొచ్చి తో
పటుతర క్రూరజంతువుల వాతఁబడి వోయితొ? విభ్రమద్విప
త్కటకటి కరాళశూలములకున్ గసిఁ జిక్కుచు గ్రుక్కితో! కటా!
యిటు లగునే విధీ! బ్రతుకు లింతపఁ దెచ్చితె? పాప! దైవమా!

హా! ఆనపిలో నన్నదమ్ములు కదా యాఁడుబిడ్డలపాలిటి యైశ్వర్యంబులు? తమ్ముని గోలుపోయిన నాబ్రతుకేల? హా! తమ్ముఁడా! జయపాలా! నీ వరణ్యాశరణ్యుండవై యార్తిఁ బోనెదవని నే నెన్నఁడుం దలఁపనైతిర! హా! (మూర్ఛ నంది క్రిందఁ బడును.)

కుబే.—(తనలో) నే నేమి సేయవచ్చితి? ఏమి చేసితి? దీనివివాహంబు మూన్పఁ దలంచి వివేకరహితుండనై విచారంబుం బెంచితి. దీని ననునయించు విధం బెట్టులు? ఎటులయినను దీని దుఃఖోపశమనంబు సేయవలయు నా కామితార్థంబుం బొందవలయు లేకున్నఁ బ్రాణంబుం ద్యజింపవలయు. ఇదియే నిర్ధారణమ్ము. [అనుచు సునందనికి శైత్యోపచారములు సేయుచు] సునందా! దుర్భరవిచారంబున నేల నేల వ్రాలెదవు? చాలుంజాలు లెమ్ము. నే నడిగిన నుడువు లూహాజనితంబులు గాని నిక్కువమ్ములు గావు సుమీ.

సునం.— కుబే! ఏమీ! అటు లయిన నాయనుంగుందమ్ముఁడు దొరకునే కదా?

కుబే.— సందియంబు లేదు. మతిమంతుం డగునాతండ్రి సుమతి యాబాలుని శుభసమాచారం బరయుటకే చారుల ననేకులఁ బంపి యున్న

వాఁడు. సునందనీ! చింత వలదు. ఇంతుల యానందంబుగదా కార్య సిద్ధికి శుభసూచకంబు!

సునం—కుబేరా! నీ తుదిపలుకు లనువర్షధారలు ఘనతరసంతాపవహ్నిచేఁ గ్రాలు నాహృదయంబుం జల్లఁజేసెను నీయనుంగుం జెల్లెలేదివంబున నిచటి కేల రాక తడసె?

కుబే—[తనలో] దీనిఁ దోవకుఁ దెచ్చితి. [ప్రకాశముగా] కలకంఠితో నాటపాటలం గాలక్షేపంబు సేయుచున్నది కాఁబోలును. సునందనీ! నీవు జవ్వనివై యుండియు వయోధర్మంబు లనుభవింపక యెల్లకాలంబు వంతలఁ గుందుట యేటికో తెలియకున్నది. దినదినంబునుఁ గాలం బించించుక గతించుచుండునుగాని వృద్ధి యగునా? సర్వలోకములు సృజించెడి బ్రహ్మకునైత మాయుఃపరిమితి తగ్గు నన్న మనబోటివారి కడుగ నేల?

క. దిన మొకజలబిందువుఁ గొన, ఘనతరవారాశి యింకఁ గదవే తరుణీ!
దిన మొకపెల్లఁ గదల్చినఁ, దృణమౌఁ గదె తుహినసగము నెఱిఁగనవచ్చానా?

నీ వేల జేల వై యీరీతి సుఖదూరురాల వయ్యెదవు?

సునం—కుబేరా! నీమాటలు యథార్థములె యగును. అయినను నైసర్గిక సుఖరహితం బగు నాహృదయంబునకుఁ దెచ్చుకోలుసంతసం బెంతహితంబుగా నుండును? వయోధర్మసుఖానుభవం బనఁ బరిణయంబగుట యని కదా నీతలఁపు?

కుబే—నిజము నిజము. అదియే నిక్కము.

సునం—అటు లయిన గుణశీలరూపవయోవైభవుఁడు గదా నేఁ బెండ్లియాడం దగినవరుఁడు? అట్టివరుఁడు దొరకమి జవ్వనుల కొక దుఃఖంబగుం గాదే?

కుబే — సునందనీ, కులశీలరూపాధికులు మనపట్టణంబునఁ గలవైరే? నీమనంబు వారిపైఁ బోదు గాక? తేఱి చూచిన మారుని, నత్రికుమారుని నలకూబరుని, సురవరసూనుని మీఱు సుందరాకారులు మన నగరియందొకరయినను, దొరకరే? అరుదైరే?

సునం — కుబేరా! కులశీలరూపంబుల నాకుం దగినవరు లేరుం గానరా రనుట నిక్కువము

కుబేరుఁడు — ఇది కదా కన్నులుండిన గ్రుడ్డితనము! అటులయిన వారే రయినది తెల్పెద వినుము.

మ. సారసగంధి! రూపమున సారెకు మారుని ధిక్కరింతు నే,
సూరిమిపట్టిఁ గాఁడె నలకూబరుఁ? డా యమృతాంశుఁ డన్న నా
కారము దగ్గ ఖేదమును గాంచు; వసంతు దిసంతుగొట్టుదుం,
గోరితి నీదుకూడికలఁ, గొమ్మరొ! చూడవె నన్నుఁ బ్రీతిగన్

సునందని! మన్మనఃపూర్ణానందనీ! దాఁప నేల? ఓ వికచోత్పలపత్రలోచనా! ఆలోచింపుము చూడుము. ఏ ధరావరుని కుమారులు సౌందర్యంబున నాతో సరితూఁగువారు? ఆకంతు జయంత వసంతుల రూపం బది యెంతని నే నధఃకరింతునే ఇంతీ! సొగసుల దొంతీ! ఓ రాకా సుధాకరబింబాననా? నా దిక్కు చూడవే. నేను రూపరిని గానా? చదువరిని గానా? ఆలోచింపవే?

సునం —

మత్తకోకిల ఔర! యెంతటిపొట్టక్రొవ్విది యౌర! యెంతటికావరం బి
బ్బౌర! యెట్టికృతఘ్నతాస్పద? మౌర! యెట్టిదురాగతం బి
బ్బోరి సత్కులపాంసనాదమ! యోరి బుద్ధివిహీనుఁడా!
నోరు మూయుము; తల్లి మింతట నూఱుమాట లిఁ కేటికిన్.

ఛీ! ఛీ! కుబేరా! భళిరా! నీక్రొవ్వు! నన్నా నీవు గోరినది?

కుబే — కామినీ! ఆ క్రూరమారఘోరశరధారలకు సారెసారెకు వేసారి,

శరీరము దాఁటి పోఁ దారిఁ గానక, నినుఁ గోరి, నీమఱుఁగుఁ జేరితినే రమణీ! సఖీశిరోమణీ! నీముఖసౌందర్యంబుఁ జూచిన నే నొకఁ డని యేల? సమస్తలోకాధీశులు సైతము వెఱ్ఱి పట్టి మోహార్ణవచక్రంబున సుడివడి తిరుగుచుందురు.

పణవవృత్తము భూతేశాదుల్ భుజసత్త్వాఢ్యుల్, వాతాహారులు వరమౌను ల్నీ
సీతు ల్రేతులు నిజమై కన్నన్, భ్రాంతి నిల్తురు ఖలులై పంచన్.

సుసం — ఇసీ! కుబేరా! నీ తులువకూఁత లిఁకఁ జాలును. నీ విచట నుండం దగదు, వేవేగఁ దరలుము.

కుబే —

విద్యున్మాలావృత్తము కోపం బేలే? క్రూరం బానే!
పాపాత్ముండా పంచాస్త్రుండే
ప్లైపారంగా నేఁచు న్నన్నీ
తాపం బొందెం దాళంజాలన్.

మదవతీ! మదనవేదనాదోధూయమానమానసుండ నైననన్ను నీలావణ్యామృతార్ణవంబునఁ దేల్చెదవో? లేక ఘనతరవియోగవిమోహవిచారసాగరంబునఁ బడఁ గూల్చెదవో? ఇఁక నీయదియే యాధారము. జవ్వనీ! నవయౌవనవయోభరితంబగు నీశరీరలావణ్యంబు నవహేమధామంబు న్నిరసించు నాశరీరకాంతిలోన లియ్యా మైనతఱిం గదా బంగరునకుఁ బరిమళంబు బొందుపఱిచిన చందంబగు. కలికీ! చిలుకల కొలికీ! తేనియలొలికించుచు మధురసుధాధారలం జిలుకఁగల నీకలికి చిలుకపలుకుల వెంట నాహృదయంబునకు నాహ్లాదంబుఁ గలిగించు శుభాక్షరముల న్వెలువరించి యీతాపం బార్పుము. భవన్ముఖేందుబింబాంతర్గతమ్మగు నవసుధాసారమ్ము వలన మధురాయమానంబగు నీదు బింబాధరంబు దిక్కు నెన చూచుచు స్వాతివానకు ముత్తియపుఁ జిప్పయుం బోలెఁ గాచి వేచి యున్నవాఁడను.

సునం—ఓరీ, కుబేరా! నీపని శ్రుతి మించి రాగానఁ బడుచున్నది. కాదని నేనెంత చెప్పినను నీకారుకూఁతలు విడనాడక మరల నెన్నియో తెన్నుల వర్ణించుచున్నాఁడవు. పొగరు కనులకుం దట్టియున్నది. కులగోత్రంబు లెఱుంగ నేఱకున్నావు తారతమ్యంబుం దెలియ వైతివి అను జన్మసమానుఁడు వని యెంచి తిరస్కరింపక పలుకరించినందునకుఁ గదా యిన్ని వంచనలు నీవుతలంచితివి? నీ విచట నిలువఁ దగవు పో పొమ్ము.

కుబే—సునందనీ!

సీ. చెలఁత! యోజనగంధి కుల మెద్ది? విఖ్యాతుఁ డలపరాశరుఁ డెట్టికులమువాఁడు?
మెలఁత! యూర్వశి యెట్టికులశీలముల దగు? నలపురూరవుఁ డెట్టికులమువాఁడు?
అలికుంతలా! శకుంతలకుల మెయ్యది? దుష్యంతుఁ డెంతటిదొడ్డవాఁడు?
చెలి! దేవయాని దేకులము? యయాతి యేకులమువాఁడది నీవు గుఱు తెఱుఁగవె?
తే. గీ. తెలియవే యట్టిమెలఁతల తెగలు మాని,
మానితం బని కూడిరి మంచిమగల,
కులము శీలమ్ముఁ గొల్పనే గుణము లేక?
మనము గలసినచోట నే మనవు గాక?

సునందనీ! పై దృష్టాంతరంబుల నారసి కులశీలంబుల విచారం బుడుగుము.

సునం—కుబేరా! మానితంబుగ నీ విచ్చటినుండి వెళ్లుదువా? వెళ్లఁ గెంటింప వలయునా?

కుబే—సునందనీ! నీవీక్షణాంచలము లను సంకెలలు నన్నిచట బంధింప నేఁ బోవున దెట్లు?

క. మరుబారికి వెఱచుచు నీ, చరణంబులఁ బడినయట్టి శరణాగతునిన్
సరసకుఁ దీయుచుఁ గౌఁగిట, సరసగతిం గ్రుచ్చి ప్రోవు సారసనయనా!

సుందరీ! తేటమాటలకుఁ బదివేలటీక లేల? ఉన్నయథార్థంబు నీకు విన్నవించితి. ఇదిగో శరణని నీచరణంబులపై వ్రాలెద. (అనుచుఁ జాగిలిపడి పాదముల గట్టిగఁ బట్టుకొనుచున్నాఁడు.)

సునం—(స్వగతముగ) ఏమి యమానుషకృత్యం బిది! భూలోకమునం దవివేకుల కార్యంబు లిట్టివియే కాఁబోలును? ఇట్టివార్త లెవరి చెవిం బడిన నగుఁబాటు కాకుండును? పిచ్చివారికి హెచ్చగు నిచ్చకపు మాటలు కదా మచ్చికఁ గొలిపి నచ్చిక బుట్టించుమందులు? (ప్రకాశముగా) కుబేరా! నాచరణంబులు విడువుము. నీ వెన్ని యుపాయంబుల నేర్చితివిరా! ఇప్పుడు కదా నీవు చతురమతి వనునది నిక్కంబయ్యె? నీచదువు లన్నియు సార్థకంబు లయ్యె. నీయోగ్యత తెల్లమయ్యె నాచరణంబులు నొప్పి పట్టెడిని. విడువిడుము.

కుబే—ఇప్పుడు కదా ధన్యుఁడ నైతి. (అనుచుఁ జరణంబులు విడుచుచున్నాఁడు. (సునందని వైళంబె వెళ్లిపోవుచున్నది.) (కుబేరుఁడు లేచి భ్రాంతిఁగొని) సునందనీ! నీయడుగుఁదామర లెంత నును పెక్కువ మెత్తనై యున్నవే? ఇందువలనఁ గదా నీదేహంబు కుసుమకోమలంబని జనులు కొనియాడుదురు? నే నీదినంబున ధన్యుండ నైతిం గాదే సుందరీ!

సీ. చకితైణదృఙ్నిభ చపలావలోకన! ధన్యతఁ గంటి నీదర్శనమున;
మధుకరచికుర! యోమధురసాధర! నేను మాన్యతఁ గంటి నీమాటకతన;
కల్కిచిల్కలకొల్కి! కామునిపూముల్కి! గణ్యతఁ గంటి నీకరుణకతన,
మదనునిమదదంతి! మద మార ఖుద మూఅ మనుటలు గంటి నీమమతకతన,

తే. గీ. కంటిఁ గంటిని నేఁ గంటిఁ గలికి సుఖము।
జంట యెడఁబాయకే మచ్చికంటి యింకను।
మంటికిని మింటికిని గూర్చి మంట లెగుచు।
తుంటవిల్తునిశరవహ్ని యంట దింకను.

ఉడురాజముఖీ! ఇప్పుడు గదా వసుంధరలో నాసరివా రెవరును లేరని నాశరీరం బుత్సాహంబున నుప్పొంగుచున్నది! ఏమీ? సుందరీ! ఏమియు మాఱు పలుకక, నాముచ్చటలమాటలకు నూకొట్టక యూరకుండెదవు? సునందనీ! నా హృదయానందనీ! సిగ్గుమాలిన సిగ్గు నేల యనుసరించెదవే? సుందరీ! నవయౌవనవతులగు యువతుల సుఖమునకు భంగకారి గదా కొంటెమాలిన యీపాడుసిగ్గు!

చ. తెలియ దనంత యింత యని తెప్పరిలం గ రానియనంగబాధలం
బొరలఁగఁ జేయ నెంచి కడుఁ దొందరగా వగకానిఁ గూడఁ బోఁ
దలఁచెడి నూతనాంగనల దాపునకుం జని కేలు వట్టి య
గ్గలముగ నీడ్చి లాఁగుఁ గొంటెగాములసిగ్గు తలంప నెగ్గుగాన్.

చెలీ! కలయికకు మనంబు గలసినచో సిగ్గేల? బోఁటిరో! మాటలాడవేల? సునందనీ! సునందనీ! (అనుచు నలుదిక్కులం గలయం జూచి సునందని లేమి యెఱింగి) హా! సునందనీ! మోసపుచ్చి వెళ్ళితివటవే! మోసమా! ఔరా! చేకడి వాదప్పెఁ గదా?

మ. కలలోఁ గాంచినకల్మి లేచి మరల న్గానంగ లేనట్టు, ని
చ్చల మానద్దములోని బింబ మరయం జాలంగ లేనట్టు, లీ
యిలపై వస్తువు లింద్రజాలమహిమన్ హీనంబు లైనట్టు, నె
చ్చెలిరూపం బకటా! కనుంగొనఁగ నేఁ జెల్లన్ హరీ! పోయెనే!

అకటా! ఆసుందరిరూపంబు నాకట్టెదుటనుండి నట్టున్నను స్పర్శమునకు నలవిగాక యున్నది! నామనం బరయ నిం దెం దైనను నాసుందరి డాఁగి యుండునా? [అనుచు దిక్కుదిక్కునకుం బోయి యున్మాదంబున]

సీ. హీరాదిమణిమయోదారరంపుఁగంబమా! హీరాళిరదన నీ వెందుఁ గనవె?
వైడూర్యభూషిత వైభవ భవనమా! విద్రుమాధరిఁ గానవే నిజముగ?

ఇందూపలోపేతమందిరకుడ్యమా! యిందువదనను నీ విందుఁ గనవొ
హారినీలవిలసితహారికవాటమా! హరినీలచికుర నీ వైనఁ గనవె?

తే. గీ. కనవె కరభోరుఁ గనకాంగిఁ గంజనయన?
నగపడదె నీకు నలివేణి యలసగమన?
చూడవే నీవు సొబగులసొగసులాడిఁ?
గడఁగి వేఁడెదఁ జెప్పవే? కడపమ్రాన!

(అనుచు నున్మాదంబునఁ బరుఁగిడుచున్నాఁడు.)

# సునందనీపరిణయము.

## తృతీయాంకము.

---

### ప్రథమరంగము—రాజమందిరము.

సునందని—(నిద్రలేచుచు) అరుణోదయమా యిది!

శా. చక్రం బెల్లను జక్కఁగాఁ బెనుచుచు న్సత్సంతతు ల్గాచి యే
వక్రత్వంబును లేక రాజ్యమును దాఁ బాలించి విశ్రాంతికై
యాక్రం దుండని చంద్రుని న్నిలుప వాఁ డాక్రందుల న్బెట్ట నో
షణ్రోథంబున వచ్చెఁ బూషుఁ డదె దోషం బెల్లఁ బాసె న్నభిన్

ఆహా! ఆపాతకియగు చంద్రునిదాడికి నోడి కాఁబోలు నిన్నటిరాత్రి నాకుం గంటికి నిదురరాక లేనిపోనితలంపులు మనంబున నాటి బాధింపం దొడంగె. మూఁడుయామంబులు శివరాత్రిజాగరం బయ్యె. నాలుగవయామంబున నించుక కన్ను మొగిడినఁ దొడనె యెట్టివిచిత్రపుఁ గలఁగంటిని! ఏమిచిత్రమో కాని, కన్ను మూయుటయే తడవుగఁ గంతునింబోని మోహనాకారు మ్రోలం గని, మఱల నించుక కన్ను మూఁతపడి చెందనేరని సుఖంబుల నంది, కనులు తెఱచి కందుం గదా యాకనత్కనకశుభాంగుఁడు కానరాఁడయ్యె. ఏమిసేయుదు? ఆమదనమోహనాకారుం డెవఁడై యుండునో కద.

ఉ. కంటిని గామరూపునిఁ దగ న్గలలోన నవీనసుందరుం
గంటిని గన్ను పండువుగఁ గానని సౌఖ్యము లెల్లనప్పడేఁ
గంటిని గన్ను మూఁత యిడి కాన నదేలొకొ కన్నువిచ్చి నే
నంటుచుఁ గౌఁగిలించి కడు హర్షము నందిననామనోహరుం

ఉ. మారునిమిత్రుఁడో? నిమహిని మాఱటమారుఁడో? నిమారమారకో
దారకుమారుఁడో? గురునిదారకుమారుఁడో? మాఱు లేనిశ్వం

గాఁకశచీసుతుండో? దొరఁ గానవిజయ్యుల జేవిసూనుఁడో?
యారయఁ గంటె నాదుకల నక్కట! నావరుఁ డంచు నమ్మితిన్.

అట్టిసుఖదాత నెడఁబాసి నే నెటు లుందు? ఏమి సేయుదు! హా? ఇవి యన్నియుం గలలోని ముచ్చటలు ఇపు డెంతప్రొద్దెక్కెను? మఱచితిఁ, జెలికత్తెలు వచ్చుసమయ మాసన్నం బయ్యెను కలలోనివార్త వారికిఁ దెలుపుట సిగ్గులపాటగు. త్వరగాఁ బోయి జలకంబు లాడెద. (జయమాలి కలకంఠియుం బ్రవేశించుచున్నారు.)

జయ—సునందనీ! తెల్లవారినను శయ్యాగృహంబు వెడలకున్నావ దేల;

సునం—జయమాలి! ఇపుడే మెలఁకువ గలిగెనే!

కల—సునందనీ! రాత్రి నిద్ర మానితివేల యమ్మా?

సునం—నిదుర మానితినా? ఏల?

జయ—అది యేమియో మా కేట్లు తెలియును? నీశరీరం బాకతీరుగ దాని నెఱిఁగించుచున్నది.

సునం—చాలునే నీజాణతనం బింతటఁ గట్టిపెట్టుము. నాకును నీమాటలంత కంత శోకవిధంబుగాఁ గన్పట్టుచున్నవి.

జయ—నిజ మాడితి నని నాపైఁ గోపంబు గాఁబోలును. అటు లయిన నట్టిమాట లిఁక నాకేల' అద్దముఁ జూచిన నీతీరు నీకే తెలియఁగలదు.

సునం—ఓ జయమాలీ! ఓసీ కలకంఠీ! మీపై నా కెప్పు డేనియుం గోపంబు గలుగు నఁటే!

జయ—అది నిజ మేని, కలఁ తీరు పలుకుదువు గా?

సునం—కలతి రేమి యున్న దని, నను బలుకు మందు రే?

జయ—సునందనీ! ప్రొద్దున నే లేచి బొంకు లేల యమ్మా? నీనమ్మిన చెలికత్తెలకు నిజము మఱుంగుపఱుపవలయు నఁటమ్మా?

సునం—జయమాలీ! నిజము పల్కువిషయంబున మృష లేల?

జయ—సునందనీ! అటు లయిన నీయుదంతమ్ము చెప్పఁ గూడనిది కాఁ బోలును?

సునం—జయమాలీ! ఏల యీలీల హేళనంబుఁ గావించెదవే? నాతోఁ బుట్టువు వ్యసనంబు తక్క వే ఱొక్కవిధం బగుచింత నా యంతరంగంబున లేదు గదే. నిజమే యిది. ఇందును సందియంపడఁ దగునఁటే?

తోటకవృత్తము-ప్రశ్నోత్తరరూపము.

సునం—వనితామణి! తమ్మునివంత,

జయ— లనీ!

మన సెంత నిఁ వేఁచెద ?ి మానిని!

సునం— హా!

తనుపారెడితమ్ముఁడె తాళ

జయ— నిదే,

కొని వత్తురు చారులు కోమలికో!

సునందనీ, నీసోదరుని సమాచారంబు చారులు దెత్తురు విచారంబు వలదు.

సునం—జయమాలీ! ఆబాలునిశుభంబు లిన్నిదినంబులుగాఁ దే లేని చారు లిపు డెటులు దెచ్చెదరు? ఇంక నేల నీయడియాసలు?

జయ—అట్లనకుము. సఖీ! మాతండ్రి నిన్నటిదినంబునఁ గొందఱు గారులం బిలిచి యాఱుమాసంబులు మితి వెట్టి యీలోపల నా బాలుని పోకడలు దేకున్నఁ గఠినదండన విధించెద నని బెదురు వెట్టి వారినిం బంపెను. వా రెచ్చటి నయినను వెదకి సమాచారంబుఁ దెత్తురు ఆబాలునకిం ప్రాణభీతి నిజంబుగా లేదు వాఁడు చిరాయు వని కదా కాలజ్ఞులు పలికిరి.

సునం—నిజము జయమాలీ! జ్యోతిషకు లనేకు లానాఁడు పలికిరి. వారిపలుకు లిదివఱకు నెన్నఁ డెని యసత్యములు గావు. ఈబాలుని విషయమ్మునంగూడ వారివచనమ్ములు వమ్ము గాక యుండవలయుం గాదె?

జయ—ఎన్నటికి నటు కావు. కావున సునందనీ! నీవు లేనివిచారమ్ములు మది నిల్పి యాటపాటలు సరకు సేయ కుండుట సరి కాదు.

కల—జయమాలీ! ఆటపాట లనం దలంపునకు వచ్చెను. వనవిహారంబు సల్పి యెన్నిదినంబు లాయె నమ్మా! ఈదినము వనంబునకుం బోవల దటమ్మా?

జయ—సునందనీ! కలకంఠిమాటలు వింటివటమ్మా? నాకు నదియే యపేక్షగా నున్నది. వనవిహారంబున వనటలు పోవును. నిజము.

కుసుమవిచిత్రవృత్తము.

వనజముఖీ భావమునను నెంతో, వనరుట మేలే వనరుహనేత్రా?
వనితలమందుఁ వనితలు గూడన్, వనమున నాడన్ వనటలు వోవున్.

సునం—జయమాలీ! వ్యసనగ్రస్త మగుమనంబుతో వనవిహారంబు సేసిన నది యేల రుచియించునే?

జయ—

ఉ. నెయ్యపునెచ్చెలుల్ తెలిసి నేర్పులు మీఱ నగంబు లెక్కుచోఁ,
నుయ్యేల లూఁగుచోఁ, నుదియ నుద్దులు గట్టుచు వియ్య మందుచోఁ,
దియ్యనిమ్రానిపండ్లు దరితీపులు మాని దగంగ రాల్చుచోఁ,
జయ్యనఁ గేళకూళి జలజంబులు గోసెడిచోఁ గనం దగున్.

సీ. కాలాహివేణిక ల్కదలఁగ పెన్నాడి బాలానిలము ద్రిమ్మంగఁ బాఱులీల
పలుకులఁ జిలుకలఁ బద్యము ల్సెప్పుచుఁ బల్కరించుచు నవ్వుబాలలీల,
యందనిపండ్లకు నఱ్ఱు సాచుచుఁ గొమ్మలందింప వేమమ్మ యనెడులీల,
యుగంబులాఁ దమయాకారములు గని సుదుల ముదులు సూపులీల.

గీ. ముద్దమాటలఁ బ్రొద్దులు పుచ్చులీలఁ, బుద్ధులను గూడి యుయ్యాల లూఁగులీల,
గద్దరించినఁ గన్నీరు గార్చులీలఁ జూచి సంతస మందనిచూపు లేల ?

సునందనీ! ఇట్టిబాలలీలలం గన్నారఁ జూచి సంతస మందుటకంటెను వేఱొకసుఖం బున్నదే? కావునఁ గలకంఠిమనోభీష్టంబునకు మాఱు దలఁపక మనము వనవిహారంబు సల్పుటకుం బోవలయు.

సునం—మంచిది! జయమాలీ! కలకంఠీ! మీమనోభిలాషంబునకు నేనేల విఘ్నకారిణి నై యుండవలెను? నగరమ్మువెలుపట నుండుమనయారామంబునకుం బోయి వనవిహారంబు సల్పి రాత్రి మరల మందిరంబుఁ జేరుకొందము. ప్రొద్దెక్కెఁ బోదము. (అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## తృతీయాంకము.

### ద్వితీయరంగము—అరణ్యము.

సుదేవుడు (అంగదేశపురాజుకుమారుఁడు)

సుదే—

ఉ. దూరము లయ్యె సేన లిటు దూఱలేఁ గాననభూము లక్కటా!
క్రూరమృగాళి దౌభయదఘోరనినాదము పిక్కటిల్లె, నేఁ
డారయ దారిఁ గాన కధికార్తిని ధైర్యము నీఁగి స్రుక్కె, యే
ధారుణిఁ గందు నెవ్వ డని తారుచుఁ గంటిని గంటకావనిన్

చ. చటులవిభాకరోరుతరచండకరంబులు హెచ్చె నిచ్చట,
న్నటకట! ధారుణీతలము గ్రాఁగుచుఁ గాయము మంట లెత్తె హా!
పటుతరతాప మెల్లెడలఁ బర్వి హరించెను ధైర్యసార, మిం
కెటులు శరీర మోర్వఁగల? నెద్ది యుపాయము దప్పి వాయఁగన్ ?

హా! ఏమి సేయుదు! మృగయాసక్తుండనై కిటికరటిఘీంకారారావంబులచే భీకరం బగునిష్ఠురఘోరాటవిం జేరితి. వెంబడించువారి వేర్వేఱంబంపి వారికిం దూరస్థుండ నైతి. నానాతరునికరలతావితానాచ్ఛాద

నాఘంకార పూరితంబై యగమ్యంబగు గహనంబుం దూజితి. ఇపుడు దూజినదారిం గానక తిరిగి తిరిగి వేసరితి. అక్కటా! ఈ దారుణభూతలముం దుదకుం గంటిని. అయ్యో! ఆఘోరాటవియం దింత భూరుహచ్ఛాయయైన నుండెనుగదా! ఇచట నెచటం జూచినను గంటకింత గడ్డిపోచైన నగపడక యున్నయది! ఈదిక్కునం బోయెదనన్ననో, కఠినవిష మోపలస్థలంబు. ఆదిక్కునం బోదు నన్ననో, చండకరకిరణతప్తసికతాతలంబు ముందు బోవుదు నన్ననో, దూరాగమన ప్రయాసాతిశయంబుచేత నడు గిడ నోడలు వడంకెడు నిలిచెద నన్ననో, కీలికీలలం బోలె మధ్యందినభాస్కర ఘోరకర నికరజ్వాలలు గ్రాలుచు దేహమును దహించెను. హా! హా! అలసితి. సొలసితి. తెలిసితి.

కేదారగౌళ రాగము-రూపక తాళము.

మఱచితివో నను మాధవ! యీతఱి॥ పల్లవి॥
ఘోరాటవిం- జేరి పురి- దారిం గన- నేరకనే॥ ౧॥
కీలిబలె- గ్రాలురవి- జ్వాలలకుం- దాళ నిఁక ॥ ౨॥
అడు గిడ- గడగడ- వడంకెను- నెడ లరయు! ॥ ౩॥
తోడై కా- పాడ నిను- వేఁడికొను- వాఁడ హా! ॥ ౪॥
నీరు గన- కీరీతి శ- రీరధృతి- తాళెం గను ॥ ౫॥

శ్రీహరీ! దేహంబు నిస్సత్వం బయ్యె! దాహంబు మితి మించె. చండభానుని కరతాపంబుచే శరీరంబు క్రాంగి దేహాంతర జలంబు పొంగి పొర్లెడులాగున స్వేదం బుద్భవించుచున్నది.

మ. మును మేఘుం డనువడ్డివర్తకుఁడు, తా భూలోకజీవాళికిన్
ఘనరూపంబున నప్పు లిచ్చి, మరల న్గాలంబులో నీక యీ
మనుజు ల్మోసము సేయ; ధూర్తుఁ డగునామార్తాండునిం బంపి, ము
న్దాని వే ద్రిమ్మంగినయప్పు వడ్డి మొదలుం గొన్చున్నవాఁ డుగ్రుఁడై

హా! ఏమిసేయుదు? ముందుత్రోవ తోఁపకున్నది! [అనుచుఁ గొంత దూరము ముందు వోయి] ఏమీ! దూరంబున నొకభూరుహంబు మేరువుమాడ్కిఁ జూపట్టెడు! నిజము. నిజము. అది భూరుహమె. అచ్చటికిం బోయిన నాప్రాణంబులు నిలుచు. దానిం బొడఁగనినమాత్రనె మనసున ననిర్వాచ్య మగు సంతోషము వొడముచున్నది.

క. ఖరకరకరతప్తుఁ డహా!, కర మరుదుగ బారితనువుఁ గాంచుట యరయన్
నీరిఁ గఱవున నిఱువేదయు, ధర హాలికుఁ డంబుధరముఁ, దగఁగాంచుటె పో

ఆమహీరుహంబుజాడం బోయి మీఱిన నా యాయాసంబుం దీర్చికొనియెదం గాక, (అనుచు నించుక దూరంబు వోయి) ఆహా! చేరువ నొక సరోవరం బగపడెడు. ఆతీరంబుం జేరి నీరుద్రావి నా దాహంబుం దీర్చికొనియెద. (అనుచు వనములో దూఱి నీరుఁద్రావి) బళే! యీ నిర్మలోదక మాధుర్యమహిమం బెంతని నేఁ గొనియాడుదును!

గీ. సారవిస్తారకాసారవారిపూర, మధురిమముఁ జూడ మధురసమధువు లెంత?
మధురమధుపర్కమాధవీమధుర మెంత?, త్రిదశవరులకు నాహార మిదియ నిజము

బళే! ఈకాసారవారిపూరమధురిమ మింత యుండు నే! ఒండె, చండకర ప్రచండకిరణతప్తమైన నాదాహభరంబె దీని కిట్టిరుచిఁ గల్పించి యుండునా? హా, దాహపీడితుని యెడ మరణచిహ్నమ్ము లగపడుం గాదె?

ఉ. నాలుక యెండు, నోటఁ దడి నాశన మౌ; నధరంబు వాడు; గ
ర్ణాలయము ల్లయంబు లవు, నాడెడునాస విలాస మూడెడుం,
గాలు గదల్ప రాక కడుఁ గాడ్పడు, దేహికి, నెంతపాయమో
నాలి యఘోరదాహ! మది నామదిఁ గోర నిఁకెంతవారికిన్

హా! ఇంతటిదాహంబు ననుం జంపువైరి కయినను నేఁ గోరను. ఔరా! ఈకాసారవిభవంబు! స్వచ్ఛతరాంబు సంపూర్ణంబు! కల్లోల

కలితతోయ ధ్వానవిస్తారంబు! కంజాతకింజల్కపుంజ నితాంతద్యుతి చారుతీరంబు, దూరప్రయాణార్తిప్రయాసజనార్తిదూరంబు ! ఇక నీ వనవిభవంబు నందనవనవిభవంబు నపహసించుచున్న యది.

సీ. సాలజాలము సురసాలంబె యెడు, నింక సురసాలముల నేను జూడ నేల?
తాళములెంతు పాతాళమునకు దిగి; నేల హింతాళంబు లెంచ నాకు?
పొన్నలఁ బొగడుట పొందుగా దనునాకు, సురపొన్న బొగడుట సులభ మగునె?
నాగముఁ గని నలువ యొడెన నంచ! బున్నాగమున కెద్ది పురుడు నేయ?
తే-గీ. కొల్లలుగ నెల్లతావుల నల్లసిల్లు, మల్లెపూవుల తావుల మహిమ లెన్నఁ
జాలనన, నాగమల్లెలసార మింత, యనఁగ వశమానె నియ్యార! యీవనవిభవము.
సీ. కమనీయకల్హారకలహంసకలితంబు, విమలాంబుకాసారవిశ్రుతంబు,
అంద మాకురువిందమందారమహితంబు, సుందరమాకందసురుచిరంబు,
కంకేళికేతకీకదళీకపిత్థంబు, కాంతకాంతలకసుకాంచనంబు,
మధుసుధారసపూరమధురాంబుసారంబు, నారికేళాదికనగయుతంబు,
తే-గీ. మందమారుతకందళమానితంబు, కుందకుట్మలబృందోపసుందరంబు,
నందనంబునకంటెనానందంబు, నంద మగు నౌర! యీవనమందిరంబు

తరల॥ సురవరోత్తమనందనం బిది చూడ సొంపులు గుల్కెడిన్
గరుడవాహవిహారనందితకమ్రకేళివనంబె పో
సురుచిరాతతసాలసంగతశోభితాండజజాతముల్
సరససారససారసంయుతసంపదాద్యభిరామముల్

ఇట్టివనరమ్యం బెంతని కొనియాడుదు ! పరిపూరితే నానాఫలతరు నికరలతాశోభితంబు. బంధురతరకురువిందమందిరసుందరంబు, మధుర మాకంద బృందంబులయందంబు, నమందానందకందళితహృదయార విందంబగు నరవిందంబు, ననిందితత్రిలోకవందిత త్రిదశానందంబగు నందనవనంబు. మందార మాకంద మకరందరసఝరీపూరంబు, కల హంసకీరమదకోకిలానేక విహంగ ప్రకూజితంబు, కమనీయకైరవో త్పలకల్హారకలితకాసారంబు, రాజితరాజీవరాజమరాళ విరాజితంబు నిట్టి వనమహిమం బెంత కొనియాడినం దీఱును ! ఆహా ! మార్గా

యాసమువలన నెంతయు బడలియుంటిం గానఁ గంటికి నిదురవచ్చు చున్నయది. ఈభూరుహంబు క్రిందనొక్కింత పండుకొనియెదం గాక. నిద్రకదా, పథికులశ్రమమునకుం బరిహారణౌషధమ్ము?

ఉ. ఎయ్యది పూరుషావళికి నేఁకటిప్రేయసి రాత్రివేళలం?
దెయ్యది సర్వకాలముల నెక్కుడువంతలఁ గుందువారిమే?
లెయ్యది యద్వితీయసుఖ మియ్యది యంచు నిరూఢి చేయు? నే
డెయ్యది నిద్ర గాక యది, యెన్నివిధంబులఁ జూచిన న్భువిన్?

ఇట్టిమహిమాతిశయమానితంబు గదా నిద్దుర! (అనుచు శయనించు చున్నాఁడు.)

(ప్ర. సునందనీ కలకంఠీ జయమాలులు)

వృషభగతి రగడ

జయ— నందనం బిదె పో యనం దగు నందనంబు సునందనీ! కను
కల— నందనందననందనున కానందదం బిదె సుందరీ! విను.
సునం— అంద మలమాకందబృందములందు ఫలముల నందుఁ గీరము.
జయ— మందగమనరో! యిందు నందును మందగతిని సమీరవారము
కల— ఏలొకో! కోయిలలు గన్నుల నెఱ్ఱఁజేసెడు పాడుగుణములు
సునం— గోల! పల్లవరసముఁ గ్రోలుచు గ్రుడ్లఁ గ్రక్కెడు నగ్నికణములు.
జయ— కాదు, సఖి! నీకంఠరవమనఁ గడువుమంటగ నుండు వానికి,
కల— కాదు. కాదన వలదు, నిజమగుకారణం బిదె మాట లేటికి
సునం— అంచయానరో! యంచలంచల నెఁచగుమిఁ గని మన్ని ప్రోవవె!
జయ— అంచితం బగునాటఁ గలుపు మటంచుఁ బదములఁ బడెదుఁ గావవె!
కల— కాంత! కను సేవంతిబంతులకాంతి యింతుల కెంత సమ్మతి!
సునం— ఇంత యం తనరానివింతలె! యింతి వనసీమంతినీద్యుతి.
జయ— అలరువిల్తునియలుఁగు గుములవి యలరుఁ బోణిరో యలరు లంటకు.
కల— అలికులంబులు నలియునయ్యెడ నలికచా నీ వచటి కేగకు.
సునం— అల్లనల్లనఁ బోయి మొల్లల నలిమి గిల్లవె యలసగమనరో!
జయ— జల్లులాడక కొల్ల వెట్టవె జాల మేలొకొ? సొగసులాడిరో!

కల—— కొమ్మ! యీవిరిగొమ్మఁ గనవే! ఘుమ్ఘుమఘుమ్మని తావు లలరెడు.

సునం—— కమ్మమధువులు చిమ్ము నవి వేగమ్మె రమ్మిటు చెమ్మ లడరెడు

కనవె తిలకముఁ గన్నుఁగొనలను గనకలంకా! కలయఁ జూచును

జయ—— తనివి దీఱఁగఁ గౌఁగిలింపవె తనరి కురవకతరువు ననుచును.

కల—— పొన్న పూచెను సన్నుతాంగిరొ! పొగరునగవులు నగినఁ జూడవె

సునం—— కిన్నెరొ! ప్రేంకణము పూచెను కలరవంబునఁ బాట పాడవె.

జయ—— కినుక చే నీ వేలొ కో శంకేలెఁ దన్నక యూఱకుండెదు?

కల—— వసట ననుచును యిమియవే యీవకుళ, మేలను గారవించెదు?

సునం—— చిలుకపలుకులు పలుక గోఁగులు చిగురుజిగితోఁ జెలఁగి మెలఁగును.

జయ—— అలుకతో నెదరించి పలికిన నలరి చాంపేయములు కలుగును

కల—— మమతతో లేమావి నంటిన మానినీ! మన మెఱఁ జూచును!

సునం—— కమలనయనరొ! సింధువారము కలయ నూర్పులు విడువ ననుచును

జయ—— వనజనయనరొ! వనవిహారము వలదు వలదే జలవిహారము?

కల—— చనుమిదే చెలి! జలజజాలము చాలఁ గలిగిన నగును హారము.

సునం—— సారెసారెకు సారసారససారసంబుల నేల గోరెదె?

జయ—— సారసాక్షిరొ! సరసత ల్గని సరస నుండెదు సరసిఁ జేరుదె?

కల—— వనిత! లలితపు లతలడోలల వలదె యూఁగఁగ బలువిలేఁబుల?

సునం—— వనరుహాక్షిరొ! వినుపఁగదె వనవర్ణనాధిక భాగ్యలీలల

---

జయ——కలకంఠీ? మనసునందని యీ వనవిభవంబు వినఁ గోరెడిని.

వర్ణింపఁగల వఁటే?

కలకంఠి——

చ. శుకపికశారికానికరసూక్తులు మంగళవాద్యనాదముల్,

ప్రకటితపుష్పమంజరుల భాసిలు బాసిక లెంతొ భవ్యముల్?

సకలపరాగగంధముల సంపద, లక్కల బుక్క మోదముల్;

రక మసు మాధవుండు, వనరామ వివాహము లాడుచిత్రముల్.

ఇట్టి మాధవవనరమా వివాహమహోత్సవంబులు కన్నులకె లుగా నున్నవి, సునందనీ! ఈ శుకపికశారికానికరముల కలకలంబ

నీ నీహారనీర ప్రపూరితఝరీక్షీరంబులు, నీ కమనీయకమలకల్హారకలిత కమలాకరంబులు, నీ నవరత్నఖచితకందరంబులుం, గలయీమృగ మదఘనసారగంధపారసౌరభావృత విహారారామంబుల విహరించు మందమారుతంబు, లహా! యీవిభవంబులు గల యుద్యానవనంబును వివరించి వర్ణింప విరించియుం జాలఁడన దీని సమాకల్యంబుగం గొని యాడ నాతరమఁటే!

సు—చెలీ! సునందనీ! ఏలనే మాటాడక ఊచ్చవడి నిలిచితివి?

నం—

తరుణిరో! యెట్టికాలమునఁ దర్శితినో గృహసీమ లక్కటా?
యురతరతాప మెల్లెడల నుగ్రముగాఁ దను వంటి క్రాఁగు; నే
నరయఁగ జాల నేమొ, యొక కైనను నింపని తోఁప దయ్యె; నా
తరమె శరీరభార మిఁకఁ దాల్పఁగఁ? దథ్యము నమ్ము, కోమలీ!

జయమాలీ! నాకేదియో చెప్ప నలవి కాని వికారంబుగా నున్నదే. ఇట్టి దట్టిదని నిర్ణయింపఁ జాల కున్నదాననే.

స—ఆహా! సారసాక్షీ! చేరువ నుండు సహకారభూరుహఫలసార ములు మన మలరారం గ్రోలి కీరములు క్రీడలం జేయుచుండుటీరుం జూచితే?

వనమయూరవృత్తము.

శ్రీవనమయూరముల చెన్నుఁ గన వేమే?
యీవనజహారముల నీహఁగొన వేమే?
యీవనవిహారముల యింపుఁ గన వేమే?
యీవనమె జీవనమె యింతి విన వేమే?

—జయమాలీ! చాలుఁజాలు. నే నెద్ది చూచినను భయంకర శస్త్రం ర్గంబులో సెదిగనే తోఁచుచున్నది.

వసంతతిలకావృత్తము

నాకేరియున్నవెల నాతిరొ యంబుజంబుల్
నాకేశ్వరావరిజనందను నంబకంబుల్
కేకివ్రజాలు బలుకేకఁ, ఛీకరంబుల్,
రాకాసివాసములు రామరో! నందనంబుల్

జయ — సునందనీ! నీశరీరతాపంబునకుం బ్రశామకముగా నింతలోఁ జలువలఱేఁడు వచ్చెను నూఱడిల్లుము

ఉ. తామస మెల్లఁ గూల్చుఁ దినతాపము లెల్ల నడంచు ధారుణిన్
భామల కెల్లసౌఖ్యము బ్రభాసిలఁ గూర్చు సమస్తసృష్టికిన్
ధామముఁ దెచ్చి యిచ్చు, నిరతంబును వేల్పులఁ బ్రోచునైన, నో
భామిని! చంద్రుఁ డిప్పు డిట భాసిలు వాసిగ నూఱడిల్లుమా

సునం — జయమాలీ! కన్నకష్టంబులం బడక చూరితరైశ్వర్యంబుతోఁ బుట్టిన యీభూజనులకు నెట్టిదుర్గుణంబు లుద్భవించునో, యట్టి దుర్గుణంబులు సిరితోఁ బుట్టువగు నీచంద్రునకుం బుట్టె. వీఁ డమృతవదనవిషహృదయుఁడు. వేపచెట్టునం దీపు లేనట్లు విషజనితునకు సుగుణం బుద్భవింపదు. వానిం జూడ నగునా?

(1)మ. గిరిజాధీశుని యుత్తమాంగమునఁ దాఁ గ్రీడించుఁ గీ డెన్నకా
సిరి జేని స్తనుఁ దాఁకి నిల్చి, గురుయోషిద్రత్నముం గూడెడున్,
గరిరాడ్వ్యాసల మర్మ మెల్లఁ గలఁచుం, గాఱించెడుం దమ్ములన్,
సిరితోఁ బుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్?

(2)మ. సరస స్వారలు దారలై సకళలై సాంగత్యముం గోరుచున్
సరవిన్ రాఁ, బురివిచ్చి వారి, నకటా, సంతప్తలం జేసి, రా
తిరి శూన్యస్థలవాసి యై, కుముదినీస్త్రీఁ గూడుఁ జంద్రుం, డిసీ!
సిరితోఁ బుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్?

(3)మ. హరిణాంకుండు సదోషుఁ డుజ్జ్వలుఁ డహో! హాలాహలం బాత్మలో
ధరియించున్; ఘనమార్గ మంచు బయలం దాఁ దారు, మిత్రాగమ

బరఁగు స్థానుఁడు ; రాకఁ గూడుఁ ; గుజయోగానందుఁ డై నిక్కుడున్ ;
సిరితోఁ బుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్ ?

(4)మ. స్ఫురదాచారవిచారమానికులసంభూతాత్ముఁ డై వీఁడె యం
బరవీథిం, గడుసమ్మతం బని సుధాప్రాప్తి న్మదో న్మత్తుఁడై,
సిరిచేఁ జెల్వగు సోదరీగృహము నాశిల్లంగఁ జేయుం, స్ఖళా !
సిరితోఁ బుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్ ?

(5)మ. సిరిచే నాసరివారు లేరనుచు వాని న్బాసి, ప్రద్యుమ్నుఁడున్
బరదారాదుల పాలు చేసి, పిదప న్బాంధుక్షయాద్యాధులన్
నిరసింప న్బడి. స్వావనీతలమున న్నిల్వంగ లే కేగఁడున్
సిరితోఁ బుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్ ?

అకటా! ఇట్టిదుర్గుణాధికుండగు చంద్రునిం జూడ నేలనే? కొనియాడ నేలనే? చాలుఁజాలు. సూర్యుండస్తగిరిం జేరనుద్యమించెడు అదిగో కనుము.

ఉ. పుట్టుచుఁ గర్మజాలములఁ బుట్టఁగఁ జేయును బ్రహ్మరూపుఁడై ;
నిట్టగ నిల్చి కర్మములఁ నిక్కఁగఁ జేయును రుద్రరూపుఁడై ;
గిట్టుచుఁ గర్మపాశములఁ గిట్టఁగఁ జేయును విష్ణురూపుఁడై ;
యిట్టి త్రిమూర్తి కర్మకరి రేఁగడుఁ జూచితె పశ్చిమాద్రికిన్.

జయమాలీ! ప్రొద్దు చాల మీఱెను. మనము వేవేఁగం బోయి, కుంద మందారారవిందాది కుసుమబృందంబులం దెచ్చి, మందిరంబునకుం బోదము.

జయ—సునందనీ! మంచిది. నీమనోభీప్సితంబు. (ఆలోచనతో గొంత సేపు పైనఁజూచి) ఔ, అనుసరించెదము. (వేవేఁగం గొంతదూరంబునకుం బోయి కలకంఠితో) కలకంఠీ! మన సునందని మనంబుఁ దెలిసి కొంటి వఁటే,

కల—మనంబు తెలియు టేమి? ఉద్యానవనంబునం బ్రవేశించి నప్పటినుం డియు దాని తీరొకరీతిగా నుండెడి, అది యేమో నాకుం దెలియదు

జయ — నీవు బాలవు, ఎకిమి యెట్లు తెలియును? సునందని విరహాగ్ని చేఁ బరితపించుచు మన కది చెప్పఁగూడమిచుటకై రహస్యముం గోరుచున్నది. ఈ నమరుప్రరము నొకయాఁరంబునం దూఱి పొంచి విందము.

కల — అమ్మచెల్ల! యెట్టిమాట లాడెదవే? పొంచి వినుట మంచిదఁటే?

జయ — కలకంఠి! యెంతటిగోలవె నీవు?

గీ చంచలాక్షిరో వినవమ్మ పొంచి వినుట మంచిగుణమ చు (ద్రాసె సమంచితముగ
హంసయానల నిటిలంబులందు బ్రహ్మ, కాన జానల కది యుగ్గుతోన కలిగె
నీవు బాలవు కావున నెట్టివి తెలియవు. ఊరక నావెంట రమ్ము.
ఈ పాదరింబ హాఁగుడము (అనుచు నొకలతాగృహంబున మాటు వడుచున్నారు)

సునం — (ఏకాంతప్రదేశంబునం గూర్చుండి)

సీ హా! రామరామ! నే నారామమునఁ దూఱి యారామలను జేరి యారజమునఁ
గోరిక లీరిక లూర ముదం బార గారవంపువిహారసారమతిని
మీఱుచు విహరింప, మితిమీఱి మతిఁ గేరి తీరుగాని వికారభార మయ్యె,
గిరగిర మని పలగిరులు తిరుగసాఁగె, నరుదార న్నాకసం బవనిఁ బడియెఁ,
తే-గీ దెమ్మెరలశైత్య మక్కటా! దిమ్మవట్టె జిలుకపలుకులు చెవులకు ములుపలయ్యె
నళుల యులివులు నా కళు లయ్యె నకట! చెలులసల్లాపములు బలు చిలువ లయ్యె.

అకటా! ఆ రామమును దూఱి విహరించినతఱినుండి మితిమీఱు మ్నోవికారం బుద్భవించి సరివారి సరససల్లాపంబులు సైతము విరసంబులై తోఁచె కలలోఁ గనిన కామసుందరుఁడు కంటికిఁ గట్టినట్టుగ పడెడు. ఏ దారిఁ బోయిన, నేదరిఁ దూఱిన, నేగిరు లెక్కిన, నేయూరములు సొచ్చిన, నేతరుల నీడ నిలిచిన, నేకేరములఁ బల్కరించిన, నేశారికల హెచ్చరించిన, మీఱిన బాధలకు నాకరం బయ్యెం గాని, నెమ్మది లే దాయె. మది బెదురుగా బదరుచిలుకలదురుత్తులకు, మూలకాకులు

పెంచినకోకిలలకూఁతలకు, మద మేఁటి మదవతులపాలి మాఁరులుగా నఱచుశారికానికరరవములకు, మధుపానప్రమత్తచే మదిరాక్షుల మెదలపైఁ బాదలు తుమ్మెదలధ్వానమ్ములకు, గుండెలు ఝల్లు మనఁగ, మది తల్లడిల్లఁగ, నాసుందరుని సంయోగాభిలాష హెచ్చఁగ, నాయనురాగరసంబు మనంబునఁ బూర్ణీభవించుచు, మిక్కుటమై పొక్కుడుదేహతాపంబుచేఁ బొంగుచు నాకిట్టి దట్టిదని యెఱుంగ లేని వికారంబులం బుట్టించె. నే నీవెతలతో నిట నుండఁ జాల. వైళంబె శీతలసికతాతలంబులఁ జేరెద. (అనుచుం బోవుచు) ఏమి! ఈమహీరుహచ్ఛాయ నెవ్వండో మహానుభావుం డొకండు నిదురించుచున్నవాఁడు! ఆహా! ఇది కదా, పురుషసౌందర్యంబు! వీనికి రాజకుమార-చిహ్నము లున్నయవియే! ఏమీ! వీని నే నెచ్చటనో చూచినటులున్నది! ఎచటఁ జూచి యుందును? నిన్నటిరేయి నాకలలో వచ్చిన కామసుందరుఁ డితఁడె యై యుండునా? నిజము. అందునకు సందియం బేమి?

సీ. జిగియడుగులు చూడఁ జిగురుల నగియెను, నడుము చూడఁగ లేదు పిడికెఁడైన!
మోముచందము చందమామ యందము మాన్చు, ననురాగ రాగ మూరౌర! మోవి!
అఱమోడ్పుఁగన్నులే యరవిందములఁ గెల్చు, నఱనెల నెల్చు నౌరౌర! నుదురు!
చికిలిచెక్కులచెన్ను చెఱచుఁ జంద్రికకాంతి, చపలాలతానిభచ్ఛాయ మేను;

తే.గీ. నవనవంబులు శ్రీనిదుర్చెవు లయారె! నవన మొనరింప నవు నౌర! నాసచెలువు!
సరుచిగళమున కెంతటితరము దరము! మల్లెమొగ్గలచాలు పో పల్లువరుస

హా! ఇతఁడు నాకలలో వచ్చి, కలకాలంబుఁ గాచి యుంచిన నా మానధనంబు నపహరించి, యీ వనతలంబున నున్నవాఁడు. ఔరా! వీనియందంబు; గ్రంథంబుల వినుచుండిన యా శ్రీవర సురవర ధనవర రమాకుమారుల నేమి, యా వనవర రాకాసుధాకరుల నేమి, యీ సుకుమార రాజకుమారునకు సరిపోల్పం దరమా? ఔరా! వయోవిలా

సభరమా! భళిరే! నా పూర్వభవార్జితపుణ్యంబు నాకై యీరీతిఁ బురుషరూపంబున ఫలించెఁ గాఁబోలు? వీనిం బల్కరించి చూచెదం గాక. (ఒకయడుగు వైచి) ఆ! పరపురుషుని నే నెటు పల్కరింతును? స్త్రీల కది చులుకఁదనంబు గాదే? ఏమీ! వీఁడు నాకుం బరపురుషుం డెటు లగు? ఈమోహనుని మోహనమంత్రంబుచే బంధింపంబడిన మనంబునకంటెను నాకు వేఱొకమనం బున్నదే? లేదు లేదు. ఈసుందరునిం గనిన నిమిషంబుననే మనంబున నా యత్నంబు లేకయే యొకనిర్ధారణంబు గలిగె. అట్టి నిర్ధారణంబు మరల్ప హరిహరపితామహులకుం దరంబు గాదు. ఈసుందరుం డలసి సొలసి హాయిగా నిదురించెడు చందంబు కన్పట్టెడు. నిద్రాభంగంబు సేయనోప? (అని సంశయించుచుండ, సుదేవుండు నిద్రలేవగా సునందని యొక చంపకము చాటున దాఁగుచున్నది.)

సుదేవుఁడు—(సునందనిం జూచి స్వగతముగ) తొలకరి తళుకుమించుల మించెడు నీచంచలాక్షి, యీయుంచయాన యెవతెయయి యుండును! ఈబాలకు, బాలేందుఫాలకు, హరినీలనిభాలకజాలకుం దుఱఁదూఁగెడి యందం బీయిలలోన యేల? ఈరేడులోకంబులలో నెచట నేనియుఁ గలదా? ఈజవ్వని యివ్వనియం దెవ్వనికై నిలిచి యుండునో? ఈకుందరదన సారసవదన నాచేరువ నుండి చంపకతరుమూలంబునం డాఁగె నేల?

* మలయానిలచలనంబుల, నలకలు చలియింప, నట్టియలికులములు బ
ల్వలపున నులియుచు రాఁగనా, చెలి బెగ్గిలి చంపకంబుఁ జేరెఁ బోరే!

ఈకలికి కన్యగా నగపడెడు! పల్కరించిన నేమగునో? ఏకాంతంబున మఱుఁగువడి యున్న మానినీమణిని బల్కరింపఁ జెల్లునే? పల్క

రింపకున్న మనోరథం బీడేఱు టెట్లు? ఆసుందరి కన్య కానిచో నా కిట్టి ఘనం బేల గలిగెడును? పల్కరించి చూచెదం గాక. (ప్రకాశముగా) ఓచంచరీకాలకజాలకా! ఓచంద్రార్ధనిటల! ఓచారుచమూరు లోచన! ఓచంపకసుమసమనాస! ఓచంద్రికాసమహాస! నీ వెవ్వరిదానవు? ఈచంపకతరుమూలమునం దేల దాఁగితివి?

సునం—(ప్రత్యుత్తరం బియ్యక యూరక నిలుచుచున్నది.)

సుదేవుఁడు—ఓ చాంపేయభూజమా! ఆచందనగంధి యాగంధగజగామిని యాపూర్ణేందువదన నీయందు డాఁగియున్నది. ఆసుందరాంగి నాతోడ నొకమాటాడినం జాలును ఆ వాతిశం జూపిన నీకు నతివేలముగ నతులోపకరించెద.

సునం—(తనలో) పంచబాణగతిం జవ్వలించుపల్కులఁ బల్కరించెడి యీపంచశరాకారుని నీసంచున నుడికించుట మంచి దగునే? (అనుకొనుచు నాచెట్టుచాటు వాసి యొకించుక యభిముఖముగ నిలుచుచున్నది)

సునందనీ సుదేవుల ప్రశ్నోత్తర సీసము

సుదే—అయ్యారె! యతివరో! యెయ్యది నీపురి? యెయ్యది నీనామ? మెద్ది కులము?
సునం—భూప! కళింగాఖ్యభూపాలకన్యను, ధర సునందని యనఁ దనరుదాన
సుదే—జవ్వని! యివ్వని నెవ్వనికై నీవు నిలిచితివి నాకు నిజము చెపుమ
సునం—వనికేళి సల్పను వచ్చితి సఖులతో, వసుధ యెయ్యదని తమవంశ మెద్ది!
సుదే—అంగరాజ్యము నేలు మంగళాంగుని కూర్మిసుతుఁడ సుదేవుఁడ సూక్ష్మమధ్య
సునం— గీ ఏకతము మిమ్ముఁ దెచ్చె నిక్కైకతముగ?
సుదే— వేటకై వచ్చి యడవిని వేఱుపడితి
సునం— పరిజనులు రోయుచుందురు పరుగిడవలె
సుదే— సకియరో! నన్ను విడనాడి చనుట మేలె?

సునం — రాజకుమారా! కుసుమాపచయంబునకై ప్రియాళులు వేఱ్వేఱం బోయిరి. ప్రొద్దయ్యె. వేవేగ వారిం జేరవలె.

సుదే — సుందరీమణీ! నన్నీరీతి విడిచి నీవు నీవారిం జేరిన నీవియోగ తాపంబున నే నావారిం జేరనే! వనజానన! నిన్నుం గనుంగొనినది మొదలు మనమున మఱరాని మనసిజు బాధలు పెనంగొనె! తాళం జాల. ఇంక నన్నుం గరుణించి రక్షింపుము. నీకు దక్కినవాఁడ. నీ పాణిగ్రహణంబుఁ గోరెడువాఁడను. నను రక్షింపుము.

సునం — రాజకుమారా! ఈ గారవంపుమాటలు నా వీనులకు విందులుగా నుండినను, మనంబున కతికష్టంబులుగా నున్నవి.

సుదే — జీవితేశ్వరీ! అది యేల? నీ మాటలు చిత్రంబులుగా నున్నవి.

సునం — రాజకుమారా! నేను వ్యసనగ్రస్తను. అఖిలసుఖానందనిరతుండగు నీవు నన్నుఁ గోరం జనదు. పుణ్యవంశంబునం బుట్టిన నీయట్టి మహానుభావుఁడు లోకోపకారార్థంబుగా సుఖియై మని యుండుటే నా కపరిమితసంతోషంబు.

మ. అకటా! కోరఁగ నాకె భూరితరచింతాక్రాంతనై యున్న క
న్యకను? న్నాకఁగ శక్యమే యనఘ పీడాయత్త మా ద్రవ్యముల్?
సకలోర్వీతల మెల్ల నేలుచు, మహాసౌఖ్యంబులం గాంచి యో
యకలంకాధికరూప! లోకనుతి చే నానందముం బొందుమా

రాజకుమారా! ఇట్టి వ్యాకులాయత్తచిత్తను నన్నుం గోరి యేల వ్యసనగ్రస్తుండ వయ్యెదవు?

సుదే — (ఆత్మగతముగ) ఈసుందరికి వ్యసనకారణం బేమై యుండునో? చూచినతోడనే నామనం బీమెయందు లీనమై యున్నది. ఇట్టి సుగుణమణికిఁ గల వ్యసనోదంతంబుం దెలిసికొని దానిం దీర్పనినాఁడు నాపౌరుషం బేటికి? కాల్పనే? (ప్రకాశముగా). సునందనీ! నీవ్యసనంబునకుం గారణం బేమి? శంకింపక తెల్పుము? జాగేల చేసెదవు?

సునం— రాజపుత్ర! నావ్యసనంబు నీకును వ్యసనకారణం బగుం గావునం దెలుపుటకు నోరు రా కున్నది.

సుదే—అటులయిన నాకు వ్యసనత్రయంబు గలిగించినదాన వగుదువు. నీదుఃఖంబు గనుట మొదటిది. అందులకారణంబు తెలియమి రెండవది. నష్టమనోభీష్టుండ నౌట మూఁడవది. ఇట్టివ్యసనాగ్ని త్రితయమునందు నన్నాహుతి సేయుట నీకు ధర్మం బగు నేని నీవ్యసనంబు గప్పిపెట్టుము.

సునం—సుందరాంగా! అట్లయిన నిఁక యత్నంబు లేకయే తెలిపెద వినుము

సీ. వినుము రాజకుమార! విన్నవించెదను నాదు వ్యసనంబునకు మూల మసదృశంబు,
నా తల్లిదండ్రులు నాతమ్ముఁడును నేను నడవికి వేఁటకు నరిగి, రేయి
నిద్రించు చుండంగ, నిసువు తమ్ముఁడు వోయెఁ గానలో, వెతకినఁ గానరాఁడు;
నాతల్లిదండ్రులు నాకుఁ బట్టముఁ గట్టి, ఘోరాటవులఁ దాము గుందుచుంద్రు;
గీ. కటకటా! యిట్టికష్టము లనుభవింపఁ, దగిన దిది యని వ్రాసె నా ధాత నాదు
నొసట, నది కని యోర్వంగ నసదె? యిట్టి, కష్టతర మగుబ్రతు కెట్లుకడపుదానఁ?

సుందరాంగా! నాఘనతరవ్యసనవృత్తాంతం బిట్టిది.

సుదే— తురంగవృత్తము.

వనజనయనరో! వలదు వల దిఁక వంత మానవె మానినీ!
వనతలిని సత మరసి కనుఁగొనువాఁడ నీ యనుజన్మునిన్.

సునం—కనఁగఁ దమ కెటు లవును శిశువును? గానలే కిటు రానిచో,
మనము గలఁచెడి వగలభర మెటు మానుదాన మహీవరా?

సుదే—సునందనీ! నీ కట్టిసందియంబు వలదు. ఎట్టులో కాని యారాచపట్టిప్రాణంబున నుండు నను శుభసూచన నాకగపడుచున్నది. నెఱవేఱంగల కార్యంబునకిట్టి యుత్సాహంబు పుట్టుచుండును. చింతవలదు.

సీ. వనజాతవదన! నీ వనవరతం బిటు వనరుటఁ జూడంగ వశమె నాకు?
నేను నీవాఁడనే, నాన యేల నె నీకు? మానినీ! వల దనుమాన మిఁకను;

సోదరువార్త కృశోదరి! తెచ్చెద, సాదరంబునఁ బంపు సదయ వగుచు?
నాలు నెలలపైన నాలుదినంబులు మీఱక నినుఁ జేరి మెలఁగువాఁడ.
అటుల గడువున రాకున్న నను జూవార్త! లంబుజాక్షిరో! తేకున్న నవనిలోన,
నేను లేనని తెలియుమా నిక్కముగను। హరికొమరునాన హరిహరు లాన చాన!

కన్నెరో! కన్నీ రేల మున్నీరుగాఁ దొఱఁగెదవు? మానినీ! మోహం
బున నాడిన యుత్సాహంపుంబలుకు లని తలంపకు ఆ మహనీయు
లగు నీతలిదండ్రుల కష్టంబులు వినిన తత్క్షణమంది వారికి హర్షంబుఁ గలి
గించి నే నెపుడు నీమన్నన లందెదనా యను కుతూహలంబు నామ
నంబున నిండి యున్నది. అలికులవేణీ! తల యెత్తి చూడ వేలకి
సుందరీమణీ! నామహాసాహసంబున కుత్సాహంబుగా నీమోమెత్తి
కరుణారసభరితంబు లగు నీకటాక్షవీక్షణంబుల నించుకపాలయింపవే!

సున౦—రాజపుత్రా! (యని ప్రత్యుత్తరంబు నిచ్చుటకును నోరు రా,
కున్నది.);

సుదేవుఁడు—సుందరీ! ప్రత్యుత్తరం బియ్యనోపని కారణం బేమియు
న్నదే? పోయి రమ్మనినఁ జాలు. పోయి వచ్చెద ననునామాటకు మంచి
దనినం జాలుఁగా. మాటాడ నిష్టము లేకున్నఁ దల యూఁచినం
బోవదే? అదియెు నీసమ్మతం బని నేఁబూనినకార్యమ్ము పండించుకొని
రా నోపుదుం గాదే?

సునం—

ఉ॥ నీదుశరీరకాంతియును నీదు విలాసవిహారలీలలున్
నీదు మొగంబు లేనగువు నీదు గుణంబులు చూచి నిక్క మా
నాదయితుండ వీ వనుచు నమ్మినదానను వాఙ్మనంబులన్,
సోదరుఁ డెమ్మనంగ మన సొప్పదు, వద్దనఁ జాల, నెట్లొకో?

సుదే—సతీమణీ! నీయట్టి హితయుతమతి నీక్షితిలోనఁ గాన. నినుం గని
నంతనే నీగుణాతిశయంబులు చూచినంతనే, నీ యనురాగపూరిత

వాక్యములు వినినంతనే, నేనీయిలలోఁ గలసుఖము లన్నియు నందితి నని తెలిసితి.

మణిగణనికరవృత్తము.

అతివరో తెలిసితి నతిశయ మగునీ
హితయుత మగుమతి, నితరులకును నీ
మతి కలుగునె? సతి! మహి నినుఁ గని యం
దతఁ గలసుఖములు, దెలుపఁగ వశమే?

సుందరీ! నాపై మోహాతిరేకంబు సోదరునిపైఁ బ్రేమాతిరేకంబు మాతాపితలపై భక్త్యతిరేకంబును నీమనంబున ముప్పిరిగొను చున్నవని యెఱుంగుము, సునందనీ! విచారంబు వలదు పోయి వచ్చెద, సెల విమ్ము.

సునందని—

చ. గురుతరసద్గుణాకరుఁడ! కోరితిఁ జిత్తమునందు నీవు నా
వరుఁడ వటంచుఁ, గాన నను వారక వేగమె పొమ్ము, రమ్ము, సో
దరుశుభవార్తఁ దెమ్ము; సుఖదాతవు గమ్ము; ధరిత్రి నీవు గ్రు
మ్మరి మఱి వత్తు వంచు నిఁక మానసమందు ధరింతుఁ బ్రాణముల్

సుందరా! నినుం గోరినదానను, శీఘ్రంబుగ మరలి వచ్చి నామనోహర్షంబుఁ గావించెద వని నమ్మి, సదా శ్రీహరిచరణారవిందములు డెందంబున సేవించుచుండెద.

సుదే—సుందరీ! విచారంబు వలదు, శైఘ్రంబె మరలి వచ్చెద, సునందనీ! నీసోదరుని యాకారలక్షణంబులం దెలుప వైతివే!

సునందని—సుందరా! ఆబాలునికిఁ గుమారచక్రవర్తి చిహ్నము లెన్నియో యున్నియుం గలవు. పైఁగా నాయాకారంబు మనంబున నుంచుకొనిన వాని స్వరూపచిహ్నంబులు వేఱుగఁ జెప్ప వలసియుండవు.

మఱియొక విశేష మున్నది వినుము నా సోదరునికిఁ బాదతలంబునఁ జిన్నిపుట్టుమచ్చ యొకటి యున్నది.

సుచే—సుందరీ! ఇఁక జాలును. నేఁ బోయి వచ్చెద.

సునం—సుందరాంగా! గడువు మఱవఁ దగదు సుమీ.

సుదేవుఁడు—నాప్రాణంబునకంటెను దానియెడ నెక్కువమక్కువ యుంచెద. ఇఁకఁ దడవు సేయకు నేఁ బోయి వచ్చెద. (అని సుదేవుఁడు వెడలుచున్నాఁడు.)

సునం—

గీ. బాధఁ జెందునాదుభాములు వాపిన, భానుజోపమాను భాసమానుఁ
జూపి యంతలోనె పాపె నక్కటకటా! పాడుబ్రహ్మ యేమిపాపమో యిది?

హా! మాటలసందడిని వేళ మఱచితిని. సఖులు నాకై వేచి యుందురు; మందిరంబులకు మరలుసమయం బయ్యె. (అనుచుఁ గొన్ని పూవులు గోసికొని చెలులఁ గలయఁ బోవుచున్నది.)

జయ—కలకంఠీ! సునందనవిధ మెల్లఁ గంటివే? మంచిది విననివార్త లెవరికిని దెలుపకు ఏమియు విననిదానివలె నుండుము కలకంఠీ! మనము వేర్వేఱం బోయి కుసుమంబులం గోసికొని సునందనిం జేరం బోదము.

కల—జయమాలీ! మన సునందని కుసుమాపచయంబునకు వేర్వేఱం బోవలెననినందునకుం గారణంబు దాని విరహతాపం బనిపలికితి వే? ఇపుడు నీవేల వేఱుగఁ బోఁగోరెదవే? ఆసుదేవునిం జూచినతఱినుండియు నీకును విరహతాపం బగ్గలం బయ్యెం గాఁబోలు?

జయ—కాదు, కాదు. సఖీ! సునందని వచ్చునంతలో మనము నలరులం దెచ్చి యుంపవలయు నని యట్లంటిని. ఒంటరిగా నీవు పోనేరకున్న మన మిరువురముం గుసుమంబులు గోయుదము. పద. (అనుచు కుసుమంబులం గోసికొని సునందనిం గలయఁ బోవుచున్నారు.)

సుమ — జయమాలీ! ఎంతప్రొద్దాయెనే? కుసుమాపచయకుతూహలంబున వేళ మఱచితిమి సుమీ!

జయ — సఖీ! నీవు వలచిన వరకుసుమంబు సంఘటించెనఁటే?

సుమ — (తనలో) ఏమిది! వరకుసుమ మనుచున్నది! రాజపుత్రునితోడ నా సంభాషణమును విని యుండదు గద? ఎట్లు వినఁగలదు? ఏమో కుటిలబుద్ధి గదా? వినినను విని యుండును సరి, వినెఁబో. నన్నేమి చేయఁగలదు? నిర్నిమిత్తంబుగ నీవలవని విచారంబులేల? ఒక వేళ మేటిపూవని యే యడిగి యుండునేమో? [ప్రకాశముగా] చిక్కెఁ జిక్కె, ఇదిగో చూడుము జయమాలీ! సాయంకాలమాయెను. ఇఁక మనమందిరంబులకుం బోదము. రారమ్ము. (అనుచు గృహంబులకు వెళ్లుచున్నారు.)

## తృతీయాంకము — తృతీయరంగము.

(మంత్రిమందిరము) జయమాలి, సుమతి, కుబేరుడు

జయ — ఆహా! ఆ సుదేష్ణుం డెంతరూపరి! ఆమహానుభావుం డందు మానినీమానసాపహరంబు సేయు మహాశక్తి యమోఘంబుగా నున్నది కాఁబోలును! సూదంటుఱాయి లోహంబునుం బలెఁ జూచినమాత్రనె నామానసంబును వానిరూపం బాకర్షించెం గదా!

ఉ. చిత్రరుచిప్రలంబులను నేసెడు నా నవమోహనాంగుఁ, డా
చిత్తజరూపుఁ, డాయువతిచిత్తమనోహరమూర్తి, యెప్పుడే
చ్చోటఁ దెనరీతి నామనసు నుండ, భళీ! యని సంభ్రమించెఁ;
జిత్తజవైరుఁ డట్టితఱిఁ జిత్తజునిం బరిహరించె, నక్కటా!

మాలినీవృత్తము.

తెలుప తెలుప మాటల్ - సేరఁగ స్థానఁ బాటల్
దెలుపు నవయఁ జేడ్కల్ - శ్రీతి చేఁ జిక్కఁ డిట్సీ!

గాలమొగమున కీడే! యాతనిం బోద నెంచో
కూలుకున్న పసుతేజమా! కోరి యెట్లోర్తుం జూడకే

ఎటుల నాసుందరుని సునందుని బొందుకోఁగలదును. అద్వితీయ బుద్ధిచాతుర్యుం డగు నాతండ్రి యుండ, నతులితసత్త్వశాలియై యగ్రసేనుం డుండఁ, బటుతరకుటిలోపాయనిపుణనై నే నుండ, నెట్టులా సుందరుండగు సునందునకుం బ్రియసఖుం డగు? సునందునికిం బిచ్చి కుబేరుఁడే గతి. ఆసు దేవుండు నన్నుం జేపట్టునంతవఱకు నాకీహారము లేల? విహారము లేల? యాహారము లేల? వలదు, వలదు. (అనుచుఁ జింతించుచు నాభరణాదులం దీసి పాఱవైచి కూర్చున్నది. సుమతి ప్రవేశించుచున్నాఁడు.)

సుమ — తల్లీ! జయమాలీ! ఏలనమ్మా! నీముఖవిలాసంబు చెడినది? నీతనూవల్లి వాడినది? తల్లీ! నీ హీరహారావళు లేమాయెను? భాసురాభరణంబులు శరీరంబునకుం బలువాయెనే? చీనిచీనాంబరంబు లుండ మాసినచీరలాతనయా! యికు ఘూషణాంబరములు? ఆటపాటలు విడనాడి యాకులపాటు నొందు గారణం బేమి కలిగెనే? తనయా! దుఃఖింపక దుఃఖకారణంబుం దెలుపుము. చూచితివే సునందునిపై వ్యామోహమ్మున సర్వకాలంబు దాని స్మరణమే సేయుచు సర్వంబును దానిమయం బని ప్రేలుచుఁ గుబేరుండు వచ్చుచున్నవాఁడు.

(కుబేరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కుబేరుఁడు—

దోదకవృత్తము. చిక్కితె మారునిచిన్నికటారీ!
దక్కితె నాకిఁక దాటు మిటారీ!
యక్కునఁ జేర్చవె యాశయొయారీ!
యక్కఱ తీరనె యంగజనారీ

సుమ — కుబేరా! చాలు నీయున్మత్తకృత్యంబులు; నే నీతండ్రిని. సునందునిని కాను. నీ కెంతఁ పిచ్చి పట్టెను రా? ఉన్మాదరసంబు తల కెక్కి

నది కాఁబోలును? అది సునందనియా? నీయనుంగుంజెల్లెలు జయమాలి కాదఁటగా? ఇట్లు భ్రాంతుండ వైతివిగా? ఊరక యుండుము. సునందనిం దెచ్చియిచ్చెద నించుక సైచి యుండుము. జయమాలీ నీవ్యసనకారణంబుం దెలిపి నాయుడు కార్ప వైతివి గద? నీవిచారం బెట్టి బెట్టిదమైనను నేఁ దీర్చెద. దుఃఖింపకు. హారహారావళులం బూని పారసాత్ములం జేరి యాటపాటలతో సుఖించుచుండుము.

**జయ**—తండ్రీ! నా కేదియుఁ వలదు.

**సీ.** వలదు పాటలు నాకు, వలదు మాటలు చాలు వల దిఁక, నాటలు వలదు తండ్రి!
ఏల విహారము? ఏల యాహారము? ఏల యీహారము? ఏల గృహము?
వనమున నే నొకపసిమానవయనుఁ గనుఁగొంటి హరియించె మనము నతఁడు,
అన నేమి మనసునందని వాని వరియించి తనవానిగాఁ జేసికొనియె నకట!
అంగరాజ్యము నేలు మంగళాంగునిపట్టి శృంగారనుతుఁడు శుభాంగుఁ డతఁడు

**గీ.** చాలు జయపాలఁ దెచ్చెద నామ! యాఱు నెలలపై నాఱుదినములు నిండులోన
ననెడుబాసలతోఁ బోయె నకట! యతఁడు వానిఁగూడక మన నిఁక వశమె నాకు?

తండ్రీ! ఆసుందరుఁడు సునందనిం బరిణయంబు కాక నన్ను వరించిన నే జీవించెద. కాకున్న నాత్రోవ నేఁ జూచుకొనియెద. సప్తసముద్రంబు లింకిపోయెనె? సప్తకులాచలంబులు క్రుంగెనే? ఘోరారణ్యంబులు నీఱయ్యెనే? ఘోరమృగంబు లరుదాయెనే? అహిసమూహంబు లన్నియు శాంతి వహించెనే? అగ్నికి శైత్యంబు గలిగెనే? విషం బమృతం బగునే? కత్తిధార మెత్తవడెనే? ఉరిత్రాడు కలువాయెనే? వాపీకూపతటాకాదులు వట్టిపోయెనే? చూతము తండ్రీ, తెలుపం దగిన దంతయుం దెలిపితి. ఇఁక నాయాన తకుము.

కుబేరుఁడు—(చివాలన లేచి)

**సుకాంతివృత్తము** ఇదే యసిన్ | మదాన్వితున్
సుదేవునిన్ | వధించెదన్

(అనుచుఁ జేరువ నుండు నొకకత్తి చేతం బూని పరుగిడుచున్నాఁడు.)

జయ—తండ్రీ! కుబేరునిం బట్టింపుము. వాఁడా సుదేవునిఁ జంపం బోవుచున్నవాఁడు. తండ్రీ! శీఘ్రమ్మున లెమ్ము. పొమ్ము. ఆసుదేవునితోడ నా ప్రాణంబులుం బోవుం జుమీ.

సుమ—(లేచి పోయి మరలి వచ్చి) జయమాలీ! చింతింపకుము. వానిం బట్టి తెచ్చుటకు భటుల ననేకులం బంపితి. వాఁ డేలపోయి యున్మత్తుం డయ్యె. మంచిమందు లిప్పించెదం గాక.

జయ—తండ్రీ! మందులకుం బాయ్యెడిరోగమా యది? సుగంధనిపై వ్యామోహంబుచేఁ గలిగిన రోగము కావున, దాని నెటు లయిన వానికిం గట్టి బ్రతికించుకొమ్ము.

సుమ—జయమాలీ! ఆవిషయంబున నేఁ జేయుప్రయత్నంబు లన్నియు విఫలంబులయ్యె. ఇఁక నేమి సేయువాఁడ? కానిమ్ము. మఱికొన్ని యత్నంబు లాలోచించి యుంచితి. నవియు నిష్ఫలంబు లైనచో, నీదాసానుదాసుం డుగ్రసేనుం డున్నవాఁడు కాఁడే.

జయ—తండ్రీ! నీకు నమస్కరించెద. ఇఁక నా దురాత్మకుని పేరు నాయెదుట నుచ్చరింపకుము.

మ. అహహా! కీలికి నాజ్యధారగతిగా నాయుగ్రసేనాఖ్య, నా
మనముం బ్రజ్వలితంబు సేయు, నిఁక నీమాయల్ మహాజాలముల్
చన; నాపంచవికారము ల్విదరె, నే సైరింపఁగాఁ జాలఁ, బో
లనివాని న్గదుఁ బెద్దఁ జేసితివి శీలంబు న్గులంబుం జెడన్.

సుమ—త[illegible]రూ! తొడఁగినకార్యంబు లింకను బెక్కు లున్నవి. కార్యంబునకై గాడిదెకాళులం బట్టుకొనక వసుదేవునంతవానికిం దప్పునే?

మ. అదె నాఁ డచ్యుతుజన్మకాలమున నాద్వారంబునం దున్న గా
డిదె వాపోవఁగ, నన్నుఁ బ్రోవు మని పట్టె న్గాళ్లు కీడెంచ కా

యదువంశోత్తమునట్టివాఁ డకట! నాకా యింక నీదోషముల్?
తుది ముట్టంగనె కార్య మెల్లఁ, బిదపన్ దుఃఖంబు మాన్తున్సుతా

తనయా! కార్యంబు మనది కావున నింకం గొన్ని దినంబు లాయుగ్రసేనుని సరస సరససల్లాపంబు లాడుచుఁ, బగటివేషధారులవగ వగలం గులుకుచు, వెలయాలికీర్తి రిత్తమోహంబులు హెచ్చించుచు వానిమనంబునకు మెచ్చుగ నుండుము కార్యంబు తీఱినచో వానికి వచ్చుభంగంబు నీవుం గనియెదవు గాక

జయ

క. మానప్రాణధనంబులు, మానవులకుసౌఖ్యదంబు మానము సౌమ్యా
మానినులకు, నటుగావున, మానము నా కేల పానిమాయలు తండ్రీ!

తండ్రీ! ఇది బహుకష్టకార్యంబు. ఆమానహీనునితో నేనీకీలి నటించుట నాకవమానంబగా నున్నది. పరివారు వినిన నగుబాటు కాదా?

సుమ—తనయా! కార్యసాధనయందు మానావమానంబులం దభిమానముంచిన మానవుం డిమ్మహి నెక్కార్యంబును సాధింప నోపండు కావున నీవట్టిదురభిమానంబు వహింపక నాయాన లన్నియుఁ గొఱంత లేక సేయుదు వేని నాకు రాజ్యప్రాప్తియు నీకు వరప్రాప్తియు నగు, నటు చేయకున్న నీరెంటికిం జెడుదుము సుమీ.

జయ—తండ్రీ! నీమాటలు నిజము, ఆసుందరుని సుదేవునిం బొందుటకై నీయాన లేవి యైనం జేయుదు. నమ్ముము.

సుమ—అటు లయిన నెమ్మది నుండుము. నేఁ బోయి వచ్చెద. ముందు జరుగఁదగిన దేమియో యోచింపవలసియున్నది. (సుమతి వెళ్లుచున్నాఁడు.)

జయ—(తనలో) ఇక్కడికి నాకడుపుమంట తీఱినది సుమతి తలపెట్టిన కార్యము నెఱవేఱ దేన్ని, లోకము లెల్ల దిర్దిరం దిరుగవే? తమ్ముని

చింత దక్క వేఱొక్కటి లేదని టక్కరికూఁతలు కూయుచు నిక్క
వమ్ము డాఁచిన టక్కులాఁడి యగునా సునందని మిడిసిపాటిఁకఁ గనుఁ
గొందుంగాక (వెళ్లిపోవుచున్నది)

## తృతీయాంకము—చతుర్థరంగము.

మంత్రి మందిరము - సుమతి - ఉగ్రసేనుఁడు.

సుమ—ఏమి యిది? యుగ్రసేనుం డింకను రాక యున్నవాఁడు?
వాఁడు వచ్చునంతవఱకు ముందు జరుగఁదగిన కార్యాలోచన సేయు
చుండెద. కుబేరుఁడు సునందనిపై నుండు మోహంబుచేత నున్మాదంబు
హెచ్చి పిచ్చివానింబలెఁ బట్టువడక తిరిగెడు. వాని నెటులయినం
బట్టుకొని మంచిమందు లిప్పింపవలయును. వానికి మంచిమందు సునం
దనిపొందే కదా? సునందని సుదేవుండను వాని మోహించిన దఁట.
ఆసుందరుని నాసుతజయమాలి నైతము మోహించినది. సుదేవుం
డు రాజకుమారుం డఁట. చక్రవర్తిచిన్నె లుండువాఁ డఁట. ఇంచు
మించుగ జయపాలునిం బోలు సౌందర్యశాలి యఁట. ఇవి య
న్నియు నిజ మఁట. ముందు సేయందగిన దేమి? (ఆలోచన సభి
నయించి) బళే! ఈయోచన బాగుగనున్నది ఇది ఫలించిన రెండు
రాజ్యంబులు నా దండనకు లోఁబడి యుండు ఒకరాజ్యంబు నాద
నుట కిపు డేసందియంబును లేదు గదా రెండవరాజ్యము నాదియగు
టకు మాత్ర మేమి సంకోచ మున్నను? సుదేవుఁడు నా తనయను
బెండ్లియాడ సమ్మతింపండా? నయభయము లుండఁ గారాగృహం
బు లుండఁ గష్టదండన లుండ నొకబాలుని సమ్మతిఁ గొను టేమి
కష్టంబు? ఇఁక సునందనివిషయమా! అది కుబేరుని మోహించు
నా? మోహించి వరింపవలె ననునది సిద్ధాంతమా? వేఱొకవిధ

మయిన వివాహవిధి లేదా? అంతకు మీఱిన నంతకునకు మీఱం గల రా? ఇపుడేల యీమాటలు? ఉగ్రసేనుఁడు వచ్చుచున్నట్టున్నది (ప్ర. ఉగ్రసేనుఁడు)

ఉగ్ర—మామా! వందనంబు లాచరించెద.

సుమతి—ఉగ్రసేనా! ఇటు రమ్ము.

ఉగ్ర—మామా! మనకార్యములు మనము గోరినటుల సమకూడెను గదా! ఏమికారణంబున నను రప్పించితివి? శుభకార్యంబునకే గద?

శా. మామా! మామకబాహుదర్పమున నేమాటోటముల్ లేక యే
మామా! నేసితి నన్నికృత్యములు సన్మాన్యంబుగా నీకు నై;
మామా! మాలిని నిమ్ము వేగముగ నీమాటోటు పోనీక, యో
మామా! కాలవిళంబ మేల? శుభము ల్మాకిచ్చి వేఁ బ్రోవుమా

మామా! పరిణయంబునకు ఈపటిదినంబే ప్రశస్తంబని జ్యోతిష్కళావిదులు వక్కాణించిరి. కాలవిళంబము వలదు.

* [ మదోన్మత్తవృత్తము. ] *

వేచి యున్నది వెంపుఁ గానక వెతలఁ గుందుచు వెలఁది, నే
వేచినాఁడను వేలుపఁ గూడఁగ వెలుకఁబాఱుచు వెకలి నై,
కాచినాఁడను గలఁత చాలును గలికి నివ్వర కరుణన్నై,
దాఁచ నేలికఁ దగనితావఱుఁ దడయఁ జాఁను దలఁచినన్

కావున మామా! కాలవిళంబము చేయక శుభప్రయోజనంబుల జరుపుము.

సుమ—

గీ. అల్లుడా! యేమి తెల్పుదు నయ్య! వినుము
మన సునందని వనమున ఘనుని నొకనిఁ

---

* ఇది 21 వ ఛందంబునఁ బుట్టిన 103193 వ వృత్తము ర. న. స. న. స, న స గణములు 6, 12 18 దవస్థానముల యతియు నుండవలయు.

గాంచి వరియించి తమ్మని గాథఁ దెల్పి
వెతకఁ బంపిన దఁట వాని వేగిరమున.

ఉగ్రసేనా! అంగదేశపురాజకుమారుండగు సుదేవుం డఁట యీ రాపట్టి. ఆఱుమాసంబులపై నాలుదినంబులకు జయపాలుని యుదంతంబుఁ దెచ్చెదనని వాగ్దానంబు చేసి పోయినవాఁ డఁట. కంటివే! యుగ్రసేనా! బాలుని పోకడలు విచారింప నొక్కఁడు గుటిగా నిలచెను. దేవ రహస్యంబులంబలె నుంచిన మనకృత్యంబులు వాఁడు తెలియుట కేయాస్పదంబు దొరకునో? అచేతనంబులు సైతము వీను లుండినవానిం బోలె విని మనకృత్యంబులకు సాక్ష్యములై నిలుచునేమో యని దిగు లగుచున్నది.

ఉగ్ర—మామా! భీతిఁజెందకుము.

గీ. బాపురే! చాలు చాలును, బయము వలదు;
పట్టి వాఁ డెంతవాఁ డయ్య? పట్టి వానిఁ
గట్టి తలఁ గొట్టి దిట్టలై నట్టడవిని
ద్రోయుభటులను బంపెద దోస మనక.

మామా! అప్రతిమంబగు నాదేహబలప్రతాపంబులు నిండారి యుండ నీకేభయమును వలదు. దేహబలంబునకు న్మించినకార్యంబెద్ధి యునులేదు కాదే?

సుమ—అల్లుడా! నీమాటలు నిజంబు లైనను బుద్ధిబలం బెద్దానికి నావశ్యకంబు. కట్టైనయుకను గట్టైయొకటే చాలదు. ఇనుపములికి సైతమావశ్యకంబు. దేహబలంబు నీసొమ్ముగానుండినను బుద్ధిబలంబు నాసొమ్ము. నీ వా సుదేవునిం బట్టి చెఱయం దుంచుము. పిమ్మటఁ గాఁదగినకార్యంబు నేయోచించెద.

ఉగ్ర—మంచిది మామా! నీయానఁ గొనియెద. పోయి వచ్చెద.
(అనుచుఁ బోవుచున్నాఁడు.)

సుమతి—

శా. ఔరా! వీనిమదంబుఁ గావరము మత్తాలాపముల్ హెచ్చెఁ; "నీ
గారాపుప్పుత నీర మామ" యనుచుం గాఱుల్ కాడుం బ్రేలెఁ; వీఁ
డా రాజ్యంబున నుంట నగ్గూఁడు? సరే! యాకార్య మొక్కింతయుం
దీరం గారగృహంబొ ప్రేతగృహమో దిక్కౌ సమీపందమున్.

గుడిత్రాళ్లనుండియే గుడిని పెకలించినట్లు పీసిభటసమూహమునుం డియే కొందఱినిఁ జీలఁదీసి వీనిం గ్రూరదండనకుఁ బాత్రుం జేసెదం గాక. ఇంక నెక్కడికిఁ దప్పించుకొని పోఁగలఁడు? నాకార్యంబు కా సంతయుం గానిమ్ము. ఆకుబేరుండు చిక్కక పఱుగిడె నఁట. వానిం బట్టుకొన మఱికొందఱు భటులను బంపవలయు, నేఁకఁ బోవలయు (నిష్క్రమించును.)

---

## తృతీయాంకము—పంచమరంగము.

అరణ్యము,

(ఉగ్రసేనునిభటులు-జీవాజిశింగు-రామశింగులక్ష్మణశింగు-ప్రతాపశింగు)

జీవా—కటకటా! నీచులకొలువు బలుబలువు. రామశింగూ! మన మెన్ని క్రూరకృత్యంబు లని సేయుచ మోయీ!

లక్ష్మణ—లెక్క లేనన్ని క్రూరకర్మంబు లొనరించినను మఱల శిక్షింపను లకే మనల నాతఁడు నియమించెను.

రామ—వానిదురాచారంబు లిన్నియని లెక్కింపనగునా? వాఁ డొకఁ డేల? కలియుగంబునం గలిసి కలిగినమానవులయం దనేకు లిట్టి వారే యని నాకుం దోఁచెను.

జీవా—ఇంత చేసినను మూఁడుమాటలలో నాఱుతప్పులు బట్టుదురు కూర్చున్నఁ దప్పు. లేచినం దప్పు. వెనుకబోయినఁ దప్పు. ముందఱుండినం దప్పు.

సీ. తపసి వచ్చితి నంచుఁ దప్పితి నటయంచుఁ దాఁబుమాటలఁ దిట్టితన్నువారు
రామ—బిడ్డ లేడ్చెద రంచు గొడ్డు లార్చెడి నంచుఁ గట్టడికిఁ టులఁ గొట్టువారు,
లక్ష్మ—పరదారలను దెచ్చు పనులఁ జాలవ టంచుఁ బలువాదు ఁదెప్పి పదరువారు,
జీవా—సేవకునకు నీకుఁ జెలువుల చెలి యేల? యలినిస్మనుచుఁ గోయా బల్లార్చువారు,
రామ—గీ. కలిమిచేఁ గన్ను గానక కఠినజనులు, కటకటా! సేవకులకిట్టి కఠినములను
జేయుచుందురు భువిలోనఁ, జెప్ప నేల, గలియుగంబునఁగలిగిన కలుషమహిమ?

లక్ష్మ—సీ. వలదు సేవకవృత్తి పగవాని కైనను బలుహీన మైన దీకొలువుచూడ,
రామ—కష్టపునకై యిట్టిచెడుగులు సేసినఁ గడపట నొకకూటికైనడియె గాదె?
జీవా—కానలఁ జేరుచుఁ గోనలు నిచ్చుచు మాని ,మూగ నిట్లు మనఁగ లేమె?
ప్రతా—భళిభళిరే! యెట్టిపాడుబుద్ధులు రోరి! కలికాలమహిమ మీకరిదాదె కద?

గీ. ఉండినన్నినాళ్లు కండపెట్లఁ గదని. యుప్పు గిన్నవాని మెప్పఁ బడయు
గొప్పకాలమందుఁ, దప్పించుకొనఁ నౌనె? గొప్పవారు దీని నొప్పువారె?

భళిరె! అన్నలారా! మీరు మంచి తులు పలుకువారు సుమీ! ఈమిటితు లీ వసుమతిలో మీరే ప్రకటించితిరి కాఁబోలు నేమి? కండ బలియ బరు లుబ్బునటు లిన్నదినంబులు వానియుప్పుఁదిని హాయిగ నుండి నేఁ డొకపని సెప్పిన నొకనికి సేవకావృత్తి వలదఁట! మఱి నెటకేఁ డడవిం జేరెదమనఁట! వేఱొకనికి మర్యాద లంటా! దురభిమాను లగునిట్టియుత్తరకుమారులు ప్రారంభముననే కొలువునకు సమ్మతింప కేల మానుకొనరైరో?

జీవా—ప్రతాపశింగూ! నీమాటలు నిజము. పోషించినవానిం బొందిలోఁ బ్రాణం బుండువఱకు సేవింపనే వలయు.

రామ—అటు లేని నిపు డేమి సేయవలయు?
ప్రతా—ఆసుకవుం డెచ్చట నున్నను వెతకి తేవలయును.

లక్ష్మ—ఆ రాజకుమారుం డెక్కడ? మన మెక్కడ? దూరదేశంబులకు ఘోరారణ్యంబులకుఁ బోవు టెక్కడ? ఇది మన కశక్యము.

ప్రతా—ఇక్కడన యుండి, యెక్క డెక్క డనిన రాకుమారుండు జిక్కునే? పోవలె; వెతకవలె; కనవలె; దోడి తేవలెను. అటు సేయక తప్పించుకొనంజూచిన మన ప్రాణంబులు దక్కం గలవే?

లక్ష్మ—ప్రతాపశింగూ! నీపలుకులు విహితంబులు. సేవకునికి ధర్మంబులు. ఆయుగ్రసేనునికొలువు సర్పసహవాసంబునట్టిది. కత్తిమీఁది సాము. అసిధారావ్రతమునుం గాదే?

ప్రతా—ఇఁకఁ దడయ నేల? ఇద్దఱిద్దఱ మొక్కొకదిక్కునకుం బోయి యారాజకుమారునిం బట్టి తెత్తము.

రామ—ప్రతాపశింగూ! మనయొడయం డానతిచ్చినలక్షణాకారు లెందఱీజగంబున నుండరు? వారి నందఱినిం బట్టి తేవలయునదియ కా?

ప్రతా—ఓయి రామశింగూ! ఎట్టిమాటలాడెదవు? రాజకుమారచిహ్నము లగుపడవా? అనేకు లట్టివారుండిన నందు నేకాకిగాఁ దిరుగువా రెందరుందురు? మఱియును వానియాకారం బానాఁడు మనము పట్టి ఘాతకుల కప్పగించిన జయపాలుని నించుమించుగఁ బోలియుండునఁట. ఇంతకు నట్టివారు పలువురు మనకు దొరికిరి పో, వారినందఱినిఁ దెచ్చి చెఱయందుంచిన మనయొడయుఁడు కావలసినవానింబట్టి మిగిలినవారిని విడుచును.

లక్ష్మ—నిజము నిజము. పోదము. తడసితి మనిమాటలు పడ నేల? వేవేగ రా రండు.

[అనుచు భటులు దిక్కుదిక్కులకుం బోవుచున్నారు]

# సునందనీ పరిణయము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము—అంగరాజు మందిరము.

రాజు మంగళాంగుఁడు. మంత్రి మణికంధరుఁడు.

మంగ—మణికంధరా! వేఁటకుం బోయిన సుదేష్ణుఁ డాఱు నెలలయినను రాకున్నవాఁడు. వానియునికియే తెలియ దయ్యెను.

చ. వినయవినీతుని న్సుతుని విశ్రుతకీర్తియుతు న్గుణాన్వితున్
గనియెడుభాగ్య మిం కెటుల గల్గునె? మంత్రి! విశేషకాల మా
యెను గహనంబు సేరి యది యేటికొ వాఁ డిట రాకపొయ్యె? నే
వని మృగజాలమో యహితవర్గమొ వానిని నేమి సేసెనో?

సీ. విమలవిచారు నెవ్వీరుఁ గానక యున్న నిమిషంబు కల్పమై నెగడుచుండె?
చూడమి నెవ్వాని సురుచిరరూపంబు కట్టెన ట్టుండె నా కంటి కకట!
నిండారఁ జూచినం దృష్టిదాఁకు నటంచుఁ జూడఁగ వెఱచి నేఁ జూడ నెవని!
చూచి చూడక యుండి చూడనిసుఖముల నందితి నెవ్వాని యందముఁ గని?

గీ. అట్టిసుకుమారరూపుని, నాత్మసుతుని, నీతిమార్గానుసారుని కీర్తిపరుని,
సదవనోదారు గంభీరు సత్యసారు సుగుణాధారుఁ జూడక యుండఁ గలనె?

అట్టిసుకుమారకుమారుని శరీరం బేక్రూరమృగావళులపాలం బడెనో? ఏక్రూరాకారులశరధారలపాలికిం జిక్కెనో? ఏఘోరారణ్యం బాకుమారునికి మరణభూమిగ నేర్పడెనో! తెలియ రాక యున్నది. రాజ్యం బిఁక నేల? నే నేలఁ జాల. నా కేల సుతుఁడు లేనిరాజ్యసామ్రాజ్యంబులు?

మణికం—ప్రభూ! విచారంబు వలదు, మనము పంపిన చారులీదినంబున రావలయును గదా? వచ్చువఱకు నెమ్మదిగ నుండుఁడు.

(చారులు ప్రవేశించుచున్నారు)

చారు — మహాప్రభూ! జోహారు, జోహారు.

తిల — చారులారా! సుదేవునిశుభసమాచారంబుం దెచ్చితిరే?

చారు — మహాప్రభూ! దేశదేశంబుల నుండుపట్టణంబులు, జనపదంబులు, ఘోరారణ్యంబులు, వాహినీతీరంబులు, గిరిగహ్వరంబులు, రేయింబవళులు నిద్రాహారంబులు లేక తిరిగి తిరిగి వేసరి యాబాలునివార్త యొకటియేని విని, (యేమేమొ చెప్పఁబోవుచుండ నడ్డమువచ్చి రాజు,)

మంగళా — ఏమేమీ! సుదేవుండు దొరకఁడాయెఁగా! హా! హా!

శా. ఆబాలుం డవనీతలంబునఁ గనం డా! లేఁడుగా! మంత్రి? యో
బాబూ! చిన్నికుమార! యుద్ధతనయా! భాగ్యోదయా! పోయితే!
యీ బాలోగ్రవియోగవహ్ని బలమై యేర్ప న్శరీరం బిఁకన్
నేఁ బ్రాణంగలవాఁడనే? సుతునయో! నేఁ బాసి జీవింతునే?

చ. వని మృగజాలము న్గనిన, వానికి నాఁకటికూడె వాఁడయో!
ఘనతరవైరు లాజిఁ గొని గాసిలఁ బెట్టఁగ నగ్గఁడే సుతుం?
డనవరతంబు నాదుహృదయాంబుజమిత్రుఁడు పుత్రుఁడక్కటా!
నను విడనాడి పోయె; నిఁక నాబ్రతు కెంతయు రిత్తగాదొకో!

మహేశ్వరా! నే నిఁక బ్రతుకఁజాల.

మణికం — రాజేంద్రా! ఊఱడిల్లుఁడూఱడిల్లుఁడు చారులను విచారింతము. వాండ్రేమొ చెప్ప నప్పళించుచున్నారు. చారులారా! మీ రేయే దేశంబులకుం బోయితిరి. అందందుఁ గలవిశేషంబు లేవి?

చారు — ప్రభూ! అన్ని దేశంబులం దిరిగితిమి. తిరుగుచుఁ గళింగదేశప్రాంతంబున నొకపిచ్చివానిం గంటిమి. వాఁడు చూచినవారి నెల్లరను సునందనీ యని పట్టుచుండెను. ఎదిరించినవారి నెల్లరను సుదేవా యని కొట్టుచుండెను. వాని నేమిపల్కరించిన నా రెండుమాటలే

తప్ప వేఱొకవిషయంబునఁ బల్కఁడు ఇది యేమివిశేషంబో యని వానిం బట్టి తెచ్చితిమి.

మణికం—మంగళాంగప్రభూ! ఇఁక మీ విచారంబు వదలుఁడు మీసుతుఁడు కళింగదేశంబున నున్నవాఁడు. కళింగదేశాధిపతి యగు ప్రతాపునికూఁతురు సునందని బహుసుందరి యని నేను విని నాఁడను. (చారులతో) చారులారా! ఆ పిచ్చివాని నిచటికిఁ బిలిచికొని రండు.

చారు—చిత్తము స్వామీ! (చారులు వెళ్లి పిచ్చివానిం దీసికొని వచ్చుచున్నారు)

మణికం—చారులారా! వీఁడా మీరు చెప్పినపిచ్చివాఁడు?

చారు—చిత్తము, బాబూ!

కుబే—హా! సునందవే;

చిత్రపదవృత్తము. అంగన యేలవె నెమ్మిన్ । మంగళమానుష కేళిన్,
బంగరుబొమ్మరొ! నే నీ । యంగజుబారికిఁ దాళన్.

(అనుచు మణికంధరునిం బట్టుకొనఁబోఁగా భటులునివారించుచున్నారు.)

కుబే—

సుకాంతివృత్తము. ఇదేయసిన్ । మహాన్వితున్
సుదేవునిన్ । వధించెదన్.

(అనుచు భటులం దన్నంబోవ వారు వానిని బంధించుచున్నారు.)

మణి—చిత్రీకరించితిరే! ప్రమాత్తహా! ఈపిచ్చివానికి సునందనిపైనుండు మోహ మెవ్విధియు సుదేవునిపై నుండు పెచ్చుమచ్చరమును? మన సుదేవుం డాసుందరి సునందనిని వరించి యచ్చట నెచ్చటనో నిలచిన వాఁడు ఈపిచ్చివాఁడు సునందనిని మోహించియు నష్టమనోభీష్టుఁడై యున్నాఁడంబున నం ద్రిమ్మరెడు.

మంగ—మంత్రివరా! దీనినిశ్చితార్థంబు నెటులు దెలియ నగును?

మణి—మనమే యచటికిం బోయినఁ గలకేరు తెలిసికొన నగు.

మంగ—అట్టు లయిన నీదినంబుననే పయనముఁ జేయుదము. ఈ పిచ్చివాని సైతము తోడ్కొని పోదము. రారమ్మ. లేలెమ్మ. (వెళ్లిపోవుచున్నారు.)

---

## తురీయాంకము.

### ద్వితీయరంగము - అరణ్యము.

సుదేవుఁడు - భటులు.

**సుదే**—హా! ఆ సుందరికి నే నిచ్చినగడువు నేటికేఁ గదా మీఱెడు? ఏమి సేయుదు?

క. జనమతి నే గడు విచ్చితి, జలజాక్షికి నాఱు నెలలు చయ్యనమీఱెన్,
గడుభయ మయ్యెడు, శౌరీ! బడలుచు నే మాను శుద్ధభామ యది యిఁకన్?

క. గడువు న్మీఱెడుదాఁకను, బుడమి న్మని యుండుదానఁ బురుషోత్తమ! యీ
గడువు తొలంగిన మన నని, జలజాయతనేత్ర పలికె జడుపయ్యెఁ గదా!

క. అడవి న్జిక్కితి, నయ్యో? వడి తగ్గుట నడలు చాల వడఁకెడు, నాహా!
యెడు గిడ లే, నకటంటా! తడసిన నే మగును తన్వి తహతహపడుమన్?

మ. మితి మీఱెన్, నగతిఁ గానఁ, గానఁ బడితె, న్మీఱెన్ గదా మాట నా
సతిని న్ధీమతి శ్రీమతి న్గుణవతిన్ సాంగత్యసంపత్తి నే
మతి నూహించి తలంచుకాల? యకటా! మానె న్గదా హర్షముల్,
క్షితిలో రాజకుమారుఁ డిట్టియడవిన్ క్షీణించునే? దైవమా!

సీ. కంటకవల్లీకకర్కశపాషాణకరివకాననములఁ గలుగు కలఁత,
తపనాతపాధికతనుతాపమోర్వక విపరీతగతిఁ గను వితతచింత,
దవదావసమదాహదహ్య మౌదేహము తహతహలను జెందు తగనియలఁత;
చండార్కకరతప్తసైకతాతతముగ్ర రాగ్నికీలలఁ గాలి యడరు వంత,

గీ. తరళతరతారకేక్షణ తరుణి తన్వి, సురుచిరోదారశృంగార సుమశరీర
సుమచకచభార ఘనతరసుగుణహారఁ, దలఁపఁ దలఁగని తలపోఁత దలరుచుండె.

ఇట్టి తరుణీమణినామస్మరణ సేయుటకు సైతము బలముడుగుచున్నది

హా! హా! నాబలముడిగిన నుడుగనిమ్ము. నా ప్రాణంబులు పోయినం బోనిమ్ము. ఆసుందరి బ్రతికియుండినం జాలును.

క. మురహర! గిరధర! సురవర! కరుణాకర! దారిఁ గానఁ; గరివరదా! నీ
చరణములను నెఱనమ్మితిఁ బురహరసఖ! దురితదూర! పోషింపు చెలిన్.

సునందనీ! సోదరునకై పరితాప మొందుసీకు నే నతనుతనుతాప మొనరించితిఁ గదా! నను మన్నింపుము. తరుణీ! విపదబ్ధితరణి యగు శ్రీహరి నిను రక్షించుం గాత.

సీ. కావఁడే ప్రహ్లదుఁ గంబంబునం బుట్టి ఘోరహిరణ్యాకు గుండెఁ జీల్చి?
ప్రోవఁడే బాలుర భూరిమృత్యువునాచి? యర్జునుశపథంబు నరయఁ జూచి
ఇయ్యఁడే గురువర్థమిమ్మని వేఁడిన మృతసుతు జీవసంయుతునిఁ జేసి?
కట్టఁడే సామ్రాజ్యపట్టంబు ధ్రువునకుఁ, దండ్రి పరిభవింపఁ దదయ కవుడు?

గీ. అట్టియనుపముఁ డనవద్యుఁ డచ్యుతుండు
నాదిమధ్యాంతరహితుండు నఖిలలోక
పాలకుండును గరుణాలవాలుఁ డలఘుఁ
డొక్క చెలిఁ బ్రోవఁడే నాదుమ్రొక్కు లందు?

శంకరాభరణరాగము-ఆది తాళము.

మందయానా - కుందరదనా - యిందు రావే - సుందరారవిందనయనా - యిందు రావే ॥
కోపమేల - నాపైబాలా? పాపినే నేను! ఏపార నీముద్దుమోముఁ - జూపవె రమణీ ।౧
నీరేజానన! ఘోరారణ్యముఁ జేరితి నేను - సారసాక్షిరో - దారిఁ గానక - తారెదేహము॥౨
దీనావనా! మానరక్షక! నీనామము నే - మానితం బని - పూనివేఁడెదఁ - జానఁగావరా॥ 3

నా వియోగంబువలన నకటా! నాముసలి తలిదండ్రులు చింతిలి యాహారాదులం ద్యజించి కృశించి ప్రాణంబులు విడుతురకదా! ఏమి సేయుదును? నాయట్టిపుణ్యవిహీనులగు పుత్రులు లజాగళస్తనంబులబలె వ్యర్థ జన్ములు కారే?

ఉ. పుత్రులు పుణ్యహీను లయి పుట్టఁగ నేటికి భూమిఁ బొల్లుగా?
మాతృపితల్ వియోగమున మానని వంతఁ గృశించి వందురన్.

గో త్రముపాత్రతం జెఱచి కూరిమిబంధుల క్షోభ పెట్టఁగా
మిత్రులు చింతిలంగఁ బుడమిం దమశత్రులు పొంగి నవ్వఁగా

శ్రీహరీ! ఏమిది? యీ యేడులోకంబులు బొంగరంబులుంబోలె గిర గిరం దిరిగెడు! మిన్నంతయు ఘనీభవించి నాపై నొక్కుమ్మడిం బడినట్టయ్యెడిని! నాదృష్టి నిలిపినను నిలువక శింశుమారచక్రంబునుంబోలె దిర్దిరం దిరిగెడు! చరాచరసృష్టి యంతయు శూన్యం బై తోఁచుటయేగాక నాయునికి సైతము సందియంబై యగపడెడును! ఏమి సేయుదు! నిలువం జాలకున్నాను. హా! సునందనీ! సునం దనీ!! సు నం ద నీ!!! (అనుచుఁ గ్రిందఁ బడి మూర్ఛపోవుచున్నాఁడు.)

ప్రతా—చూచితివే రామశింగూ! క్రూరమృగావళీభయదంబై మానవసంచారంబు లేనియీదుర్గమారణ్యంబున మనసునందనీనామంబుం గొని యెలుఁగెత్తి చీరెడువాఁ డెవఁ డయియుండును?

రామ—అదియె యచ్చెరువుగా నున్నది. చేరువం జేరి చూచిన మన సందియంబు దీఱెడిని.

ప్రతా—మంచిది. మనము పోవుదము. (అనుచు సుదేవుని యొద్దికిం బోయి) ఓరీ వీఁడేరా సుదేవుఁడు; సందియంబు లేదు,

రామ—నేఁడు గదా దైవంబు మనకు ననుకూలం బయ్యె?

ప్రతా—ఆలస్యం బేల? వీనిని బంధించి వేగంబె కొనిపోయి యుగ్రసేనునియాజ్ఞానుసారంబుగ మనచెఱయం దుంతము.

రామా—సరే మెలఁకువ రాక మున్నె బంధించుట మేలు.

ప్ర ా—అటులే చేయుదము. [అనుచు, బంధించి యెత్తికొని పోవుచున్నారు.]

———

## తృతీయరంగము-రాజమందిరము.

సునందని-

ఆ-వె. సతతసదవనుండు వితతనయుండయో ! అతివిలాసయుతుఁడు మతిగురుండు
క్షితిధరంబు గేరుధృతిసమేతుం డహా ! సతులచిత్తజుండు చనియె రాజు.

తరళవృత్తము. అడవిఁ బోయినబాలఁ దెచ్చెద నంచుఁ బోయెను దైవమా !
గడువు మీఱెను రాక తక్కెను గాఢకాననసీమలన్ ;
దొడరి చొచ్చెనొ ? గాజువాటుచుఁ ద్రోవఁ గానక నొచ్చెనో ?
చెడితి నే నిఁక నేమి సేయుదు ? శ్రీహరీ ! ననుఁ బ్రోవరా.

ద్విపద. వందారుమందార ! వసుధాకళత్ర !
బృందారకస్తుతి-బృందచరిత్ర !
మంధరగిరిధర ! మహితపవిత్ర !
బంధురభవవార్ధి-బంధలవిత్ర !
అంధకరిపుమిత్ర ! యరవిందనేత్ర !
కంధరశ్యామల ! కమనీయగాత్ర !
ఇందిరాసుందరీ-హృత్కంజమిత్ర !
వందనం బిదె నీకు-వసుదేవపుత్ర !
అలనాఁడు వనతల-మలరి నేఁ జేరి,
చెలులతో వనకేళి-జెలరేఁగి సల్ప,
లేని వికారము-లెక్కకు మీఱి,
కానఁగ వచ్చినఁ-గాఱియ పడుచు,
హారామ ! శ్రీహరీ ! యని నేను జీర,
నా రామసీమల-నతిసుందరాంగు
నొకఘను నచట నీ-వానరంగఁ జూపి,
యిఁక నేఁ చింత నీ-వె మితో నుండు,
మని మతి బోధింప-నటు నేయ నైతి.
ఘనుని నేఁ బంపితి-గహనసీమలకు,
మాధవా ! యట్టివాని మానససీమ,

నాథవుఁ డని నేను - నమ్మితిఁ గాన,
నవివేకినియని న న్ననఘ! యెంచకుము,
భువిలోన శాశ్వత - భూరిమంగళము,
లొసఁగి ప్రోవవె వాని - మోయిత్రీశౌరి,
మసలఁగ వల, దహో - మధుకైటభారి.

అకటా! ఆసుందరుం డడవిం బడి సంకటంబులు వడుచుండ నే నీరీతి మణిమయమందిరంబుల నుండ నగునే? ఆప్రాణేశ్వరుఁడులేని నా యునికి, యీమనికి నిష్ప్రయోజనంబు గాదె? ఇఁక నీగృహంబున నిలువం జాల. రాజ్యం బేలం జాల. నాసుందరు నన్వేషింపం బోయెద. యతఁడు దొరకఁడేని యీదుర్భరశరీరంబుంద్యజించెద. హా! ఈరాజ్యపట్టం బెరికిం గట్టుదు? ప్రాణంబుం ద్యజించుటకు నిశ్చయించిన నా కీయాలోచన లేల? పితృవచనోల్లంఘన సేయం దగునా, యనుబాధ యొకటి బాధించుచున్నది. ఇసీ! నా కేల పాపభయము? ఇఁక క్షణమాత్రం బైన నిచట నిలువం జనదు. ఘోరారణ్యంబులం జేరెద. [అనుచు మందిరంబు విడిచి వెళ్లిపోవుచున్నది.]

---

## తురీయాంకము

### చతుర్థరంగము—మంత్రిమందిరము.

జయమాలి. సుమతి.

జయ —

క. తలఁచినకార్యములెల్లను, దలఁచినయటులాయె నిఁక ను దడయఁగ నేలా!
కలకాలము యోచనలో, పల నుండినఁ గార్యమెటు సఫలమగుఁ? దండ్రీ!
క, కందర్పరుచిరరూపుని, సుందరు నట బంధనమున ద్రుక్కఁగఁ జేయం
గం దెటు? విందు నెటు? లీ, మందిరమున నుందుఁ దెమ్ము మసలకుతండ్రీ.

తండ్రీ! గడియ యొకయుగముభంగి, దిన మొకప్రళయంబురీతిఁ, గాలంబు గడపుననుం జూచి నీకుం గరుణ రాదుగా? ఆరాకుమా

రుని బంధంబున నుంప నేల? బాధింప నేల? మనమందిరంబున నుంచినం దప్పా? తండ్రీ! ఏమి యోచన సేసెదవు? కలకాలంబు యోచనలలో మునిఁగిన, కలిగినఫల మనుభవించు టెప్పుడు?

సుమ—తనయా! ఆసుదేవుని మనమందిరంబున నునుప నగునే? వాఁ డీపట్టణంబున నున్నవాఁడని యితరులకుం దెలుప నగునే? వాని వార్త సునందని వినిన మనబ్రతుకు తెల్లవాఱుం గాదే! మనకార్యంబులు వ్యర్థంబు లగుం గదా?

జయ—తండ్రీ! సునందని యెచ్చట నున్నది?

సుమ—తనయా! దానిమందిరంబుననే యున్నది?

జయ—తండ్రీ! నీ వెఱుంగవా? అది యరణ్యంబుం జేరెను.

సుమ—ఎపుడు?

జయ—నిన్నటిరాత్రియే?

సుమ—తనయా! నీ కెట్లు తెలిసెను?

జయ—

ఉ. పంచితిఁ జంచలాక్షులను, బంచలచాటులఁ బొంచి యోచన
ల్వించును నెప్పు డప్పటివి వీనులవిందుగఁ దెల్పఁ డంచు, వా
రంచితప్రజ్ఞతోఁ గనిరి! యాచెలిబాళియుదంత మంత, త
ప్పించుక లేక నాకు వినిపించిరి రాత్రియె, తేటతెల్లగన్.

తండ్రీ! ఆసునందని కడుదుఃఖించి నిన్న నడికిరేయిట గూఢముగా నిలు వెడలి యడవిఁ జేరె నఁట. ఇఁక నేల నీ కితరులభయము? నీవే కళింగదేశాధిపతి వైతివి. లోకు లందఱు నీసేవకుల కాదే?

సుమతి—తనయా! యీవార్త నిశ్చయంబ యే నిఁక నే ధన్యుండ నైతి ననుటకు సంశయం బేమి? ఈరాజ్యంబు సాధించితి, కుబేరుం డున్మాదుం డై, పట్టణంబు విడిచి గ్రుమ్మరుచున్నవాఁడు; వానిగతి యేమయ్యెనో తెలియ కున్నది.

జయ—తండ్రీ! వానికై వగవ నేల? వేఱుకొందఱిని భటులం బంపుము, వారు వానిం బట్టి తెచ్చెదరు. దేశదేశంబులనుండియు వైద్యులను రప్పింపుము. వారు మందు లిచ్చెదరు. నీవు కళింగదేశాధిపతివని యితరరాజులు వినినతోడన వా రందఱు నీతో వియ్య మందనపేక్షింతురు. తండ్రీ! నీబుద్ధిచాతుర్యంబువలనం గదా యింతటి పదవి నీకుం గలిగె! జనకా! ఇట్టిసమయంబున నీతనయనగు నేనీలాగున దపించుచుండుట నీ కొకకొఱఁత కాదా? ఆలోచింపుము.

సుమ—తనయా! ఇంచుక సైఁపుము.

క. పంకజముఖి! యింకను దన। బింకమ్మున నున్నవాఁడు భీతిఁ గెడపె నా
యంకకుఁ దెచ్చెద నిజ మిది। శంకింపకు ముద్దుపట్టి శాంతవు గమ్మా

జయమాలీ! ఈదినంబున మరల మాఱు వేషమ్మున వానిం జేరి చతుర్విధోపాయమ్ముల వానిసమ్మతిఁ గొనం జూచెద.

జయ—దేశంబులు సాధింపం జాలు నీ కేముష్టివిశేషంబున కొకమానవుని సాధించు టేమి విశేషంబు? తండ్రీ! మఱచితిని. ఆచండాలుఁడగు నుగ్రసేనుని విషయం బేమి సేసితివి? వాని బాధలు నాకుం బెక్కులు, వాని నీప్రపంచంబున నుంచు యత్నంబు సేయకు.

సుమ—తనయా! వాని కిఁక వడిసు వలదు తగినయుపాయంబుఁ బన్నినాఁడను.

జయ—ఆయుపాయం బేది?

సుమ—

సీ. విగ్రహోద్దగ్రు నాదుష్టు నుగ్రసేనుఁ. బట్టికొని పోయి కానని నట్టడవిని
పదవిహీనునిఁ జేయ నేఁ బన్నినాఁడ జాన! నీ విఁక వానికై జడియవలదు

జయమాలీ! ఇఁక నీవు సుఖం బుండుము, పొమ్ము.

జయ—బాగు మంచియాలోచనము చేసితివి! తండ్రీ! నేఁ బోయివచ్చెద.

[అనుచు వెళ్లుచున్నది.]

సుమ— స్వగతముగా.)

ఔరా! ఎంతటిదీ బుద్ధిసామర్థ్యంబు! పదచలనంబు సేయక రథగజ తురగపదాతిసంపదం గోరక రాజ్యపదవి నాక్రమించితి. కళింగరాజ్యంబు నాది యగుటకు సందియం బేమున్నది? సుకుందునకు నరణ్యాచరణం బేనిర్ణయించెదన పుత్రవియోగంబునం గృశించు ప్రతాపునకుం బుత్రికామరణంబుం దెలిపినతోడన వాయువశంబునం బడిన జీర్ణపర్ణంబు వలె వానిశరీరంబు పడిపోవును. ఆసమయంబు నంగదా యించుకసాహసంబు మరల సేయంగలయు? అది యెంతటిపని? ఒకపత్రంబుం, గాని పై ప్రతాపునిలిఖితంబు, జ్ఞాతులవాంఛ స్పష్టింగొట్టుం గదా! కళింగరాజ్యాధిపతి సుమతి యను నదిసిద్ధం బయ్యె. ఇంక నంగరాజ్యమో నాకూంతుడి యవును. సందియంబు లేదు. ఆసుసేవుండు దండసాధ్యుండుగాని, సామసాధ్యుండుగా లేడు. ఎటు లయినను నాతలంచిన కార్యంబునకు సమ్మతింగొన వలయును. ఈరాత్రి యాపనిం జేసెద. మఱచితి, ఆయుగ్రసేనుని నారామంబునకుం గొనిపోయి మత్తుపఱచి యుంపుమని వానిభటులకే నాజ్ఞ నిచ్చితి, పదవిహీనునిం జేసి దుర్గమారణ్యంబునం బడవేసిన నాబుద్ధిబలంబుం దలంచుచుం బ్రాణంబు విడుచు. అటులే సేయవలయు. తగినయత్నంబులు సేసెద. పోయెదం గాక. [నిష్క్రమణము.]

## తురీయాంకము—పంచమరంగము.

అరణ్యము.

జయపాలుఁడు—(ఆత్మగతముగ.)

ఉ. అక్కడఁ దన్నిదండ్రు లకటా! మదిఁ గుందుచు నెంత చిక్కిరో?
ఇక్కడ నన్నుఁ బెంచి సుతుఁ డే యని నమ్మినవారు ప్రుక్కిరో?

చిక్కితి నన్ను బాధలకు, శ్రీహరి! యెంతకృతఘ్నుఁడంగటా!!
త్రొక్కెని యిట్లు సేసితె? విధీ! కృతకర్మఫలానుసారివై.

చ. భువి నవిధేయ సేవకునిఁ బ్రోచుట చెంగటఁ బాముఁ బెంచుటే,
యవినయపుత్త్రుఁ బెంచుటది యాఁకొను బెబ్బులి నింట నుంచుటే,
సవతుల నింట నుంచుటది సౌఖ్యమును న్వైడఁ బట్టి గెంటుటే,
తివిరి కృతఘ్ను సాకుటది తీపని హాలహలంబుఁ గోలుటే

ఛీ! నాయట్టికృతఘ్నుని నాయెఱుక లేల పెంచి పెద్దఁ జేసిరో? తెలియకున్నది. నాయట్టిపుణ్యహీనుని నామహానుభావు లయినజననీజనకు లేల కనిరో తెలియకున్నది. వారిసౌఖ్యంబుపాలిటఁ బెనుమృత్యువు నైతి. నాయీపుట్టువు నాతల్లి యౌవనవనంబుపాలిటి కుఠారంబ కాని వేఱొకటి గాదు. అజాగళస్తనంబునుంబోలె నాయట్టినిష్ప్రయోజకపుత్త్రుండు పుడమిఁ బుట్ట నేల? నాయత్నం బేమి యున్నది? సర్వంబునకు నెన్నొసట విధి వ్రాసినవ్రాఁతయే కారణంబు గాదె?

సీ. కన్ననాతల్లికి నన్నెడఁబాపెను జిన్నిప్రాయంబునఁ జెలఁగి విధియె,
కాననంబునఁ జేర్చి కరినదండనఁ గూర్చి మరలఁ బ్రోచెను మహామహితవిధియె,
ఎఱుకులఁ బంపించి యెలమి నన్నాచిన కరుణానిధానంబు కనఁగ విధియె,
కాచినవారిని ద్రోచి నన్నీరీతి నేఁచుచు నున్నది యిపుడు విధియె.

గీ. ఔర! విధిబలమే బల మవనియందు; బుద్ధిబల మేల? మఱి యేల భుజబలంబు?
వింత! పొగడంగ వశమె యావిధిబలమును ఫణిపతికి నైన భారతీపతికి నైన

ఔరా! విధిమాయ తెలియ నెవ్వరికి శక్యము? హా! బడలిక హెచ్చె. ఇఁక ముందడు గిడఁ జాల. ఈతరుమూలంబున విశ్రమించి సేద తీర్చుకొని ప్రాణంబు లున్న మరలఁ బ్రయాణంబు సేసెద. [అని యొకచెట్టుక్రిందఁ బండుకొని నిద్రించుచుండఁగా జీవాజీలక్ష్మణ సింగులు ప్రవేశించుచున్నారు.]

జీవాజి— లక్ష్మణసింగూ! మనపని సముద్రమున కేతము నెత్తినట్టు లున్నది సుమీ.

లక్ష్మణ—అందునకు సందియం బేమి! వింధ్యపర్వతంబుం దల క్రిందు సేయం బూనుటయు కాదే?

జీవాజి—ఈ ధర మీఁది యున్న ధరాతలంబుం దిరిగి లెక్కకు మిక్కిలిగా నున్న జన సమూహంబునుండి తాను జెప్పిన లక్షణంబులు గలవాని నొక్కని నేర్పఱచి తే వలయు నఁట. అట్టివాఁడు చిక్కు టెట్టులు? వానిఁ జిక్కించికొనఁ గలుగుట చుక్కల లెక్కింపఁ గలుగుటయె కాదే!

లక్ష్మణ—చుక్కల లెక్కిడుట యసాధ్యమేగాన నతఁడు చిక్కఁడనుటయు నసాధ్యమేయనుట నిజమగు.

జీవాజి—అటు లయినచో నీయడవులలో నిడుమలం గుడుచుచు నడల నేల?

లక్ష్మణ—పట్టణంబుం జేరి యాక్రూరునికి మన ప్రాణంబులం గోల్పో నేల?

జీవాజి—రిత్తచేతులఁబోయిన వాఁడు మన ప్రాణంబులఁ దీయుట సిద్ధంబే కదా.

లక్ష్మణ—సూర్యచంద్రుల యునికి సిద్ధంబ యే నదియు నట్టిద.

జీవాజి—ఆక్రూరుఁడు ప్రాణహింస యించు కైనను పాపం బని తలంపఁడు కదా?

లక్ష్మణ—వేఁటకాఁడు మృగంబులపై దయ యుంచునే?

జీవాజి—మన మిప్పుడు సేయం దగినకార్యం బేమియుం దోఁపక యున్నది

లక్ష్మణ—మన మాఱునెలలనుండి తిరిగి తిరిగి యలసితిమి. ఈ చెట్టు క్రిందఁ గూర్చుండి యొకింత యోచింతము.

జీవాజి—మంచిది. నాకు నదే కావలయునది. [అని యొక చెట్టుక్రిందఁ గూర్చుండెను.]

లక్ష్మణ—ఓయీ! జీవాజీ! చూచితివే? ఈచెట్టుక్రింద నెవఁడో మానవుఁడు నిద్రించుచున్నవాఁడు.

జీవాజి—(లేచివచ్చిచూచుచు) ఆహాహా! ఎంత సుందర పురుషుఁడోయీ!

లక్ష్మణ—వీఁడే సుమీ మనయుగ్రసేనుండు తెలిపిన లక్షణాకారుండు.

జీవాజి—నిజము నిజము సందియంబు లేదు. నిజము.

లక్ష్మణ—(మెల్లఁగ) జీవాజి, వీని నిద్రించునపుడే బంధించి యెత్తికొని పోదమా? వానికి మెలఁకువ గల్గినచో మనకును శ్రమ యగు. ఇపుడు గోటితోఁ దీరుపని కపుడు గొడ్డలి కావలసి యుండుం గాదే?

జీవాజి—అటు లయిన నాలస్యం బేల? బంధింతము. పట్టు. (అనుచు బంధించి యెత్తికొని పోవుచున్నారు.)

# సునందనీపరిణయము.

## పంచమాంకము—ప్రథమరంగము.

చెఱ.

జయపాలుఁడు. చండోఁడు. వెఱ్ఱోఁడు. పిచ్చోఁడు).

చండోఁడు— కేదారగౌళరాగము. ఆదితాళము.

వస్సెనుగదరా పానముసుట్టు-తెస్సెనుగదరా కీడులిట్టు-సస్సేమురా సామి షేమికొట్టు
తస్సనలాడిన-వస్సెను అట్టు॥ పల్లవి.

పాపోని దునుమనిపాపము వస్సె-నాపని వఱదని వాఁడు వాకస్సె-నాపాపులకాసు
లింతకు దెస్సె-మాపాలిదేవర మాకును సస్సె. ౧.

కాసుకు నాసిడ మోసము లాయె-మోసము సేసిన దోసము వస్సె-మీపాల బూ
సోని పీసాని నీసోని-గానికి దేవర మము నేఁడు దెస్సెం. ౨

ఓయబ్బా! యెఱ్ఱిగా! ఓరీ పిస్సిగా! నేఁడు సస్సితి మసీ. దోసము
సుట్టుకొన్న దసీ.

వెఱ్ఱోఁడు—ఏల నసీ. అటు కూసేది?

చండోఁడు—కూసు కా దసీ. కాసు కాసపడినదోసమురో సిదీ.

పిచ్చోఁడు—ఏమి రసీ యది?

చండోఁడు—సెప్పే దే మసీ! మోసము సేసిన దోస మని జోసయ్యొ
సెప్పలే దంట్రసీ.

వెఱ్ఱోఁడు—మా మేమిదోసము సేసితి మసీ?

చండోఁడు—కుత్తుకకు దెస్సెడిదోస మసీ, మాము నేసుకుంది.

పిచ్చోఁడు— ఏం దసీ యది? సెప్పక పానము దీసెదవే మసీ.

చండోఁడు—సెప్పే డే మసీ. ఇపుడు సెరలో యేసినసిన్నోణ్ణి సూసితిరి
కా దం।టసీ.

వెఙ్గోఁడు—సూసితివసీ. ఓఁడో దొరబిడ్డోణికి మ ల్లిండో(డసీ ఆహా!

చండోఁడు—ఓఁడో దొరబిడ్డఁడు కాఁ డసీ. మెట్టుపై పుట్టిమన్న కామ య్య యొడలి సింగారము సూడం(డసీ.

వెఙ్గోఁడు—అవునసీ. వీఁడు మనపత్తాపయ్యబిడ్డఁడే గాబోలసీ? నాఁడు మా మెఱుకల కిస్సి నోఁడే నసీ యీఁడూ!

పిచ్చో—అవు నసీ, ఆఁడేరా. ఆడే సుమా.

చండో—ఆబూసికోడు కుగ్గసేనుఁడు రేపొస్సి సూసెనా మనగొంతు కోకసేను నొసీ. యింకేది దోసము సుట్టుకొనె నసీ.

వెఙ్గోఁడు—ఒరే! నా కోయుత్తి దోసిందసీ. అటు సేస్తమా?

చండో—ఏ మసీ యది? అట్టుకు వురితాడా?

పిచ్చో—కా దసీ. వెన్నుకు సత్రాయి కట్టుక బావిలో దుముకుట కా బోల్నసీ?

వెఙ్గో—అవికావసీ. అవి యుత్తులా?

చండో—ఏమిసేవలె నసీ మరి?

వెఙ్గో—మనపత్తాపయ్య పాపోని గాపాటిని కాడ్దేవరను తలసుఁక కూస్సున్నాడంట కాదసీ. ఇపుడేమాము పోయి లోని దంతయు సెప్పిన యీయుగ్గసేనుని సంపిస్సి మనలను కాపాడుతాఁడు కాదసీ.

చండో—ఔనౌనసీ! బాగా వుం దసీ నీయుత్తి. బల్బాగుందసీ. యెూ సవ సక్క సేసితివసీ. యేమితిని సేసితి వసీ. మాము తిరిగ దే తీఁదు వుకా వసీ మాకు దోసనియుత్తి నీకెటువొస్సె నసీ. గుడ నొద్ద సది తే మసీ? బలుబాగుం దసీ. అటులే సేత మసీ. ఈడ కొందరిఁ బెట్టి మా మిపుడే పోదమసీ పరుగిడదమసీ.

వెఙ్గో—పోదము పదుఁడసీ పదపదం(డసీ. అనుచు వెళ్లుచున్నారు.)

---

## ద్వితీయరంగము—అరణ్యము.

(మంత్రి- ఉగ్రసేనుఁడు).

ఉగ్ర—

చ. కటకట యిట్టిచేఁతలకుఁ గట్టిడి వైతె? యెఱుంగ నైతి నీ
తటమట, లక్కటా! తగని దారుల ద్రొక్కినవారి కీగతుల్
దిటములు గావె యెట్టియెడఁ? దీ పని గ్రోలితిఁ గాలకూటముం
బటుతరక్రూరకృత్యములఁ బాతకి! చేసితి నీదుసంగతిన్.

దుర్మదాంధుండ నై దోర్బలగర్వంబుచే ద్రోహంబు లెన్నియో నీకొఱకుఁ జేసితి! ద్రోహీ! తుదకీ దుర్మరణంబునకు ననుం గుఱి సేసితి వే?

సుమ—

ఉ. ఓరినరాధమా! వినర యోర్చితి నిన్నటిదాఁక నీదు దు
ర్వారకఠోరభీకరనరాదదురుక్తశరాళివ్రేట్లకుం;
గారణ మంత దీఱెఁ; గడకట్టెను గార్యము లెల్ల, నింక నీ
కూరిమిమృత్యుకన్యకను గూడఁగ నిచ్చితిఁ బెండ్లియాడరా

ఉగ్రసేనా! నీవివాహంబునకుం గన్యకామణిని గదా నే నిచ్చెద నంటిని. ఇదిగో! మృత్యు వనియెడి యుత్తమాంగన నిచ్చితి. పెండ్లి యాడుము.

ఉగ్ర—హా! ద్రోహీ! ఆహా! దురాత్మకా! ఓరీ! పాతకీ!

మ. చరణంబు ల్తెగి చావఁ బోవుతఱి నీచత్వంబునన్, దుర్మదా!
పరసాలపము లాడ నాసరసుఁడన్ సై యంచు రాఁగిబోలునే?
విరసాలాపము లేల? చాలు నిఁక నీవిద్య, ల్విసం జాలఁ బో!
పరుఁగన్, దోర్బల మేను నమ్మి చెడితిం, బాపైతి నీబాధకున్.

చాలు చాలు; ద్రోహీ! ఇది నీవైరశుద్ధికిం దఱి కాదు. నాదోర్బల గర్వంబున నేఁ జెడితి.

సుమ—క్రూరా! భుజబలంబే సర్వం బని గర్వించినవెఱ్ఱివి నీవు కావే? బుద్ధిబలంబునకును భుజబలంబునకును గలతారతమ్యం బిపుడైన నెఱుంగుము.

సీ. కాలానలాభీలహాలాహలముఁ గ్రోలి యేలీల నునఁ గలఁ డిలను జీవి?
శూద్రాద్రిమందిరభద్రాయుధోదగ్రకోద్ధృతి కెటు లోర్చు నోర్చి మరుఁడు?
నాశారిఁ బోకార్చుపాకారిశ్రీకారిఁ గాకారి నెదిరింపఁగలరె రిపులు?
జంభారిగంభీరదంభోళిజృంభణ సంరంభ మెటు సైఁచు క్ష్మాధరములు?

గీ. భూరిసాహసబుద్ధిని భువి నెదిర్చి బ్రతుక నెటు లగు నోర! యాబ్రహ్మకైన?
నింక నైనను దెలియుమా శంక వదలి బుద్ధి కెనయగుబలిమి యీభువిని లేదు

ఓరీ నీచాధమా! యీభువిని బుద్ధికి సాటి యగుబలిమి లేదని చక్కఁగా నమ్మి ప్రాణమ్ముల విడువుము. (అనుచు సుమతి వెళ్లుచున్నాడు)
(సన్యాసివేషముతో సునందని ప్రవేశించుచున్నది.)

సన్యా—

సీ. అంగనానంగుఁ జక్రాంగమా! చపలకుళింగమా! కన్నులారంగఁ గనరె?
రంగారువాని సారంగమా! చకితకురంగమా! కన్నులారంగఁ గనరె?
శృంగారయుతునిఁ బ్లవంగమా! పనితపతంగమా! కన్నులారంగఁ గనరె?
అంగుగువాని భుజంగమా! గరువంపు భృంగమా! కన్నులారంగఁ గనరె?

గీ. తుంగవిక్రముఁ గనరె? యేకాంగులార!
సంగరోదగ్రుఁ గనరె! నిస్సంగులార!
మంగళోత్తుంగులారమా! మంగళాంగు
బంగరుకుమారుఁ గన్నులారంగఁ గనరె?

నేటికి నాబల మడిగె. ముం దొకయడుగిడఁ జాల! హా! ప్రాణేశ్వరా! మితి మీఱె నను కారణంబునం బ్రతిన సాగించితివి కాఁబోలును! పరోపకారంబునకై శరీరంబుం దృణమ్ముగఁ దెంచిన నీపరోపకారంబునకుం బ్రతి దుర్భరం బగునాశరీరంబుం ద్యజించుట తప్ప వేఱొకటి కాన. జీవితేశ్వరా! వేఱొకజన్మంబున నైఁన నిను

గూర్పనావందారుమందారుఁడగుగోవిందునిపాదారవిందమ్ములు డెంద
మ్మున నిల్పి శరీరమ్ముం ద్యజించుచున్నదాన.

ఉ మందరధారి! శౌరి! శ్రుతిమౌళివిహారి! దయాప్రచారి! స
ద్బృందమనోబ్జచారి! యరిబృందవిదారి! త్రిలోకధారి! యీ
బంధురదుఃఖహారి! భవబంధవిమోచనకారి! శ్రీహరీ!
యెందును దిక్కు గాన నిఁక నే మని నే మనుదాన నిత్తఱిన్.

శ్రీహరీ? జన్మాంతరమునం దైన నాసుగణోదారుని నామనోవిహా
రుని నాసుదేవుని నావరునిగాఁ జేయుదువని నిను వేఁడెద; మఱి
కొనియాడెద, (అనుకొన్చుండఁ జేరువ నొకచెట్టుక్రిందఁ బడియు
న్నయుగ్రసేనుఁడు.)

ఉగ్ర—హా! దాహము! హా! తాపము! హా! పాపము! హా! దైవమా!

పద్మా—ఇది యేమి? ఈఘోరారణ్యంబున "దాహము" "తాపము"
అని వాపోవుమానవుం డెవఁడు? పోయి చూచెదం గాక.

ఉగ్ర—అయ్యో! దాహము! నీరిచ్చి రక్షించువారీయరణ్యంబున
లేరుగా? శ్రీహరీ! అయ్యో! తాపము!

పద్మా—ఎవఁడై యుండును? దాహంబుచేఁ బరితపించెడు నీతఁడు?
దాహంబిచ్చి యడిగెదం గాక. (నీ రిచ్చుచున్నాఁడు.)

ఉగ్ర—దైవమాయ.

క ఎంతటిక్రూరుం డేనియు, నెంతటినాస్తికుఁడు గాని, యేమఱక హరిన్
బంతలఁ గుందెడువేళలఁ జింతించిన, బాధ తొలఁగు, సిద్ధమిది భువిన్.

యోగివరా! నాద్రోహంబులు ననుం బ్రదికొనెను. క్షణక్షణంబు
నకు బలంబు తగ్గుచున్నది.

పద్మా—ఓరీ! నీ వెవఁడవు? నీ కిట్టిబాధ లేల కలిగె?

ఉగ్ర—యోగివరా! నాయుదంతం బొకచరిత్రగా నున్నది. నమస్
నోటం గడి లేదు.

సన్యా—(మనంబున) వీఁ డుగ్రసేనుఁడుగా నగపడెడు. వీని కిట్టిదుర్మరణం బేల కలిగి యుండును? ఇది యెవఁడో చేసినకృత్యంబుగా నున్నది విచారింతము (అని నీ రిచ్చుచున్నాఁడు,)

ఉగ్ర—తాపసోత్తమా! నా కీదుర్మరణంబుఁ గలుగఁజేసినద్రోహిని నాయంతటి దురవస్థకుం దెచ్చెద వే? వాఁ డిపుడే పోయెను. ఇట్టి సమయంబున వాఁ డాడిన యేటుపోటుమాటలు నాహృదయకమలంబున నాటి బాధించుచున్నవి. మాట లాడం జాలను.

సన్యా—ఆద్రోహి యెవఁడు? వానికి నీ వేమి సేసితివి? వాఁ డేల నీ కిట్టిబెట్టిదం బొనరించెను?

ఉగ్ర—యోగివరా! నాదుపాపంబులు నోట నుడువం జాల. లేఖన సామగ్రి యిచ్చిన నే నెటులయినశ్రమపడుచు సంగ్రహంబుగా వ్రాసి యిచ్చెద.

సన్యా—మంచిది. అటులే చేయుము. (అనుచుఁ జెట్టుపట్టయు నొకపుల్లయు నియ్యఁగా నుగ్రసేనుఁడు ప్రవహించుచున్నతననెత్తుటిలో ముంచి వ్రాసి).

ఉగ్ర—తాపసోత్తమా! ఈకమ్మం జేకొని యాద్రోహిదుర్వర్తనమును దేశదేశంబులం దెలియునట్లు చేయుము. యోగివరా! నాదారుణకృత్యంబునకుం జిక్కి రాకొమారు లిరువురు కళింగరాజధానియందుఁ గారాగృహములో నున్నవారు. వైళంబె యచ్చటికి విచ్చేసి వారిని జెఱనుండి వెడలించుయత్నంబు సేయుఁడు. హా! దాహము! తాపము! (అనుచుహీనస్వరముతో గొణఁగుచుండఁ గన్నులుమూఁతలు పడుచున్నవి.)

సన్యా—(కొంత మఱుఁగునకుఁ బోయి)

మ. ధర జీవుండు శరీరధారి యయి తా దారాదిసంఘంబులన్
బొరయం జొచ్చిననాఁట గోలె, విషయములోఁగొనం, జిక్కుడు

పంచమాంకము.

పూర్వ దుష్కర్మము లాచరింప నవి యెదుర్పడి దృశ్యం బగుచు
మరణాంతమ్మున, నీతి వల్ల నవలు నల్లాడు దుఃఖంబునన్.

ఏమీ? నీవు కళింగ రాజధానియందుఁ జెఱలో నిద్దఱు రాకొమరు లున్నవారని పలికెను వారెవ రై యుందురు? ఒకఁడు నాముద్దు సోదరుఁ డై యుండునా? వేఱొక్కండు నామనోహరుండు సుదేష్ణుండు కానోపునా? ఏల యీయడియాస? వారిని జెఱ నుంచు కారణం బేమి యున్నది? అటు లుండిన నాకుం దెలియకుండునా? ఈ క్రూరుం డేమో లిఖించెను. దీనిం జూతము. [అనుచుఁ జాబుఁ జదువుచు] హా! జయపాలా! నాముద్దులబాలా! విధి నీనొసట నిట్టి దుర్మరణంబు వ్రాసెనే! కాలజ్ఞులపలుకు లన్నియుఁ గల్లలాయెఁగా!

గీ. తల్లిప్రక్క నుండి చల్లఁగా నిద్రించు
పిల్లవాని నిన్నుఁ బ్రీతి శేక
యల్లనాఁడు క్రూరుఁ డామంత్రి పట్టించి
భల్లమునకు నిడెనె బాలభిక్షు?

జయపాలా! ఈ ఘోరవార్త నిజననీజనకులు వినినతోడనే స్వర్గంబున నైన నిన్నుం జూచెద మని తత్క్షణంబునం బ్రాణంబులు విడుతురు. నేనుండి ప్రయోజనం బేమి? ఈ క్రూరుండు చెఱనుండు రాకొమారులను విడిపింపు మని వేఁడెను. వారెవరో? జాబింకయుఁ జదివి చూతునా? (అనుచు మఱలఁ జదువుకొనుచు) ఏమీ! [illegible] సుదేష్ణుఁడా! నాసుందరుఁడా! నామనోహరుఁడా! ఎంత [illegible] [illegible] డిఱుకుడ్డ నైతిని! ఒడిలో బిడ్డ నుంచుకొని యూరెల్ల వెదకిన ట్లాయెఁగదా నాబ్రతుకు! సర్వదేశంబులుం [illegible] గాని నాపట్టణంబే నేఁ జూడ నైతి! ఏమి? ఇంతటిద్రోహమా! [illegible] క్రౌర్యమా! దారుణకర్మంబులకుఁ దుదిమొదళ్లు లేవా? [illegible] మేము నేసినతప్పేమి? అనుచు [illegible]

బేమి కావలయును? పట్టణంబునకు శీఘ్రంబె పోవలయును. ఇంక నీజాబు పూర్ణంబుగాఁ జదివెదం గాక. (చదివి చూచి) వేఱొకరా కౌమారుండెవఁడై యుండును? ఆ క్రూరుండే ద్రోహంబులం దలంచి వీరిని కారాగృహంబున నుంచినవాఁడో తెలియకున్నది. కాలవిళంబము సేసిన నేప్రాణి కేకీడు అంత కలుగునో తెలియదు ఇతరాలోచన లిపు డేల? జీవించియుండినవారిని రక్షించిన పిదప యోచనలకు సమయంబున్నది. వాయువేగమనోవేగంబులకు మించినవేగంబున నేఁ బోయి పట్టణంబు సేరెదం గాక (అనుచు వేవే నేగుచున్నాఁడు.)

---

## పంచమాంకము

### తృతీయరంగము—అరణ్యము

(ప్రతాపుఁడు. జయదేవి)

ప్రతా.-(తపంబున నేకాగ్రచిత్తుండై మైమఱచి కూర్చుండియున్నవాఁడు.

జయదేవి—

సీ. చేయివ్వ జాలెడు చెలువారు నను మేను కరినొప్పలంబులఁ నేసివాఁడు
పంకజంబులఁ బోలు పాదతలంబుల్లు ముంటిపంట్లలఁ జిక్కి గాఁచువాఁడు
పటునీలిమచ్ఛాయఁ బరగినకేశము ల్బలుధూళిచ్ఛాయ జెందువాఁడు
సుమదామశోభితసురుచిరకంఠంబు తులసీమాల్యములచే త్తులఁగువాఁడు

గీ. నహహా! దైవమ! యీతని వనము నిడుల
నేఁచగా నేల? యక్కటా! యేను మున్ను
పాపకర్మంబు నేయ నాఫలము లిట్టు
లనుభవమునకుఁ దెచ్చితే హా! ముకుంద!

మ. అకటా! యచ్యుత! శ్రీహరీ! హరిహరీ! యానందరూపావ్యయా!
యకళంకా, భవదీయమంత్రజపనిష్ఠాధీనచేతస్కునిన్,

సకలలోకోన్నతల రాజవంశతిలకు స్సామ్రాజ్యధౌరేయునిన్
వికటవ్యాపులవార్ధి పూరమున నిర్వీరాగతి స్తంభించితే?

ఉ. రా రఘురామ! రాక్షసవిరామ! విశాలయశోభిరామ! రా
రా రవివంశధామ! మధురాక్షరపావననామ! రావదే
రా రణరంగభీమ! సువిరాజితసుందరకామ! ప్రోవఁగా
రార త్రిలోకధామ! నతరక్షణ! నీ కిది భూరిభారమా?

సీ. రామ! పరంధామ! రవికులాంబుధిసోమ! రామరామా! రమారామ రార;
నిర్వికల్పా రార! నిర్వికారా! రార! నీలమేఘశ్యామ నీవు రార.
సగుణనిర్గుణరూప, సర్వసాక్షివరార! రా, భవదుఃఖవిరామ! రార;
సర్వలోకాధీశ! సకలజీవోపాస్య! రామ! రక్షోగణభీమ! రార,

గీ. రార రామా త్రిలోకాభిరామ! విజిత
రామ! శ్రీరామ రఘురామ! రామచంద్ర
జానకీరామ! సకలసార్వభౌమ!
విభవసుత్రామ! త్రైలోక్యవిమలనామ!

కోకిలకాకలీవృత్తము. ఘనమతి నీదు నామమును గానము సేసితి నే,
మనమున నీదు మంత్రమును మానక యెంచితి నే,
ధనమతి నీదు రూపమును దాఁచితి నే నెద నే,
కనికర మేల రా? కన్వు కా మొక్కితి నే.

రామా! పరంధామా! నీవు సర్వజ్ఞుండవు, సర్వకర్తవు, సర్వభర్తవు, సర్వసంహర్తవు, సర్వసముండవు, సర్వసాక్షివి, నిర్వికల్పుండవు, నిర్వికారుండవు, పరంజ్యోతిస్సు, నీ మహిమానువర్ణనలు లెక్కిడ, హిరణ్యగర్భాదులకు నలవి కాదన, దిక్కుమాలిన నాకు శక్యమగునే? దీనరక్షణుండను బిరుదకురుండనగు నీ కక్షయంబుగ నున్నది. ఈ భూభర్తను నా ప్రాణభర్తను వ్యసనపారావారంబునుండి యెత్తి తీరంబుఁ జేర్పవె యని దీనురాలనై వేఁడెద. ప్రోవరా. కరుణించి కావరా. రామా! రామా! రామా!

ప్రతా—[కన్నులు దెఱచి జయదేవిదిక్కునకు మరలుచున్నాఁడు.]

ఇంత లేఁ డంత లేఁ డెందు లేఁడనువారి కందందు నగపడు నద్భుతముగ;
చిట్టిదుగులపొట్టి పట్టి పేఁడదనువారి కట్టి విరాడ్రూప మట్టె చూపు
సీ రూపహీనుండు వీఁ డన రూపు చూపు; నంబుచరుఁ డని చూచిన నవని నిలుచు;
నవనిచరుఁ డన నగపడు నంబరమున, నార! హరిమాయ తెలియఁగఁగనగునె తరుణి!
తే హరి యన హరి నరుఁ డగు ధర, నరుఁ డన నే నరుఁడఁ గాను నరహరినె యనుఁగా
నరహరి యనఁ గా దన, తా। నరరక్షణబిరుద మూను నాతిరో వినవే.

ఇట్టిమహేంద్రజాలంబులు కరతలామలకంబులు గాఁ గలమహానుభావునకు నొకబాలుని నాకుఁ జూపి మరలఁ జూపక మఱుఁగిడు టేమి యశక్యంబు. తరుణీ! నాపుత్రుని, శుభగాత్రుని, నేఁ గన్నులారఁ జూచితి. నాసుతుండు లేనిది యీజీవనంబేల?

ఉ పుత్త్రుఁడు లేనిభాగ్యమును, బుత్త్రుఁడు లేని నివాససౌఖ్యముల్,
విత్తము లేనికార్యము, వివేకము మానినవానివైద్యముల్,
చిత్తము లేనినాతిరతి, చిత్తజవైరియులేనిగ్రామముల్,
రిత్తసు, లోకకల్మి బలె, రెక్కలు వోయినపక్షి కైవడిన్.
ఉ శీతకఫాదిరోగములఁ జిక్కుచు నుండఁగ వచ్చు, శ్రీహరీ!
ఏతిజరాదికష్టములఁ బెక్కుదినంబుల నోఁపవచ్చు, హా!
ఘాతతనిర్ధనత్వవిపదబ్ధిని మున్గఁగ వచ్చుఁ; గేశవా!
భూతలమం దసహ్య మహ! పుత్త్రవియోగము గోర నేరికిన్

హా! ప్రాణంబుం ద్యజించుటకై ఘోరోపవాసంబు లెన్ని యొనరించినను బొందిలో మొండివడి ప్రాణంబు వెడల కున్నది. ఆయుఃపరిమితి ప్రాణికిఁ నూఱేండ్లు "బాపిచిరాయు" వను వచనప్రమాణమునఁ బాపికిఁ బదినూఱేండ్లు కాఁబోలు. ఇట్టిది కదా యాబ్రహ్మసంకల్పము?

ఉ. జోకకె నిచ్చఁ బుత్రులను జొప్పడఁగా దని కీయఁ డొక్కనిన్,
యోగికిఁ గూర్చు సుందరిని చెప్పఁ, గురూపిని భోగి కిచ్చుఁబో,
రాగిని రోఁగఁ జేయును, విరాగికి దేహపటుత్వ మిచ్చెడుం;
డాఁగిని జోఁగఁ జేయు, వెడిచ సుగ్గసంపద లిచ్చు లోకికిన్.

ఈరీతి బ్రహ్మ యకటావికటములు సేయుచు జనుల ననేకబాధలం బెట్టెడు. ఏమిసేయుదు? నా కేల పుత్రసుఖంబు? వాని న్మఱచెద నన్నం బాడుమనస్సునకు మఱపు రాదు. హా! దైవమా! [పొంచి కాంచికొనియుండిన చెఱగావలివాండ్రు ప్రవేశించుచున్నారు.]

చండోఁడు—వెఱ్ఱోడా! అబ్బా యమ్మా పాపోన్నికై పానాలిడిసెరంట్రనీ: సూన్లేననీ. అబ్బ తాప సయ్యాఁ డనీ. ఇపు డూఱ కుండాఁడు పోదాం పదం డ్రనీ.

వెఱ్ఱోఁడు—అవు ననీ యమ్మ సూండు. సివికిసివికి గాలికి పోలా గున్నది కన్నీళ్లు సూడనీ కాలువలై పాఱుసున్నయి? మా మనీ యింత సేసినవాండ్లమ్ నాఁ డెఱుక లేకపోయెననీ. నేఁ డయినను బిరాల్న సెప్పుదా మనీ: (అనుచు నందఱుబోయి జోహారు లిడుచున్నారు).

చండోఁడు—బాబోరూ! నీబిడ్డలము మాము. దండం, దండం. జయమ్ జయమ్.

ప్రతా—ఓరీ! కాఱడవులు సేరి యిసుమలు వడు నాయెడ కేల వచ్చితిరిరా.

వెఱ్ఱోఁడు—యబ్బా నీసిన్నోఁడు నీయూరిసెఱలో నుండోఁడు బాబయ్యా!

ప్రతా—ఓరీ! ఏమీ! నాచిన్నికొమారుఁడు నాపట్టణంబునఁ జెఱలో నున్నవాఁడా? నాపుత్రునిం జెఱం బెట్టినధూర్తుం డెవ్వండు?

చండో—యబ్బా! మాలను మన్ని స్సెద నన్న సెప్పెదము బాబా

ప్రతా—ఓరీ! మిము మన్నించెద. యథార్థంబు పలుకుఁడు.

చండోఁడు—యబ్బా! యుగ్గసేనప్ప యాకందను దోపిస్సి మాకిస్సి సాల నెట్టు మని సెప్పె. మూ మాసిన్నోణ్ణి సూసి తల నెట్ట సేయిరాక

(వ్రేళులు చూపుచు) మెఱుకల కిన్ని వాఱల కిస్సితిమి. ఆ సిపోస్తే డెట్లో యిపుడు మజల మనసెఱలో కొసె బాబోరూ.

సత్యా—హా దైవమా! రాజాధిరాజకుమారునకుఁ గారాగృహవాసం బయ్యెనే? ఇది దైవమాయ. ఉగ్రసేనుం డేల యీదారుణకర్మం బొనరించి యుండును? ఓరీ! యుగ్రసేనా! దురాత్మకా! దుర్మదాంధా! దుర్మతీ! ఇట్టిదురాచారంబులు దుర్వర్తనలు దుష్టకృత్యంబులు సేయం జేయింపం జేతు లెటు లాడెరా.

గీ. ఎట్టిద్రోహంబు సేయ నీ కిన్నఁ డేని
నిట్టిద్రోహంబు నీ కెట్లు పుట్టె నకట!
పట్టి వలపులతిట్టను బట్టి శిరముఁ
గొట్టఁ దలఁ పెట్లు పుట్టెరా! క్రూరపాపి!

హా! హా! నీచాధముఁ డగువాని కిద్రోహగుణంబే నైజంబు గాఁబోలు. పామునకుం బాలు పోసి పెంచినరీతి నీకృతఘ్నునిం బోషించితి.

తరళవృత్తము.

పరగఁ బ్రీతినిఁ బాలు వోయుచుఁ బాముఁ బెంచినభాతిగా,
ధరణి మాంసము వెట్టి వ్యాఘ్రము దండ నుంచినరీతిగా,
నిరపరాధుని సెయ్యుఁడై కడునీచుఁ డేఁచుట నైజమే,
యరయ శర్కరఁ బోయ వే మెటు నందునే మధురత్వమున్?

ఆసుకుమారబాలుం డటఁ జెఱయం దిడుమలందుచుండ నే నిట నిమిషం బైన నిలువం జనదు. దేవీ! వేగంబె పట్టణంబునకుం జని మన పుత్రుని మనము గనులారఁ గందము రమ్ము. శ్రీహరి నేఁడు మనపాలిటివాఁడాయె. రేప మనము పురంబు సేరవలయు.

జయ—ప్రాణనాథా! మనంబునకం బెను వేగంబగు నమనసాధనం... కటియుండిన మన మిపుడే పురిం జేరి పుత్రునిం జూచుచుం...

డాఁబసి బాపనయ్యలకు నర్పణసేసెడు భూమిలోఁడ, నిం
కేఁ బనిఁ బూని పన్నుల ననేకముల న్దనివోక కట్టెదన్.

అనేకవిధమ్ము లగుపన్నులు గల్పించి జనులసంపద లాకర్షించి సిరితోఁ దులఁదూఁగుచుండెద. మఱచితి! అరణ్యంబు సేరిన సునందనిప్రాణంబులు నడవి నుండు ప్రతాపుని ప్రాణంబులును నాహస్తగతంబులు గావలయుం గదా? మొదటిది యొకటయిన రెండవది తోడ్తోడఁ దానె యయ్యెడిని. పెమ్మట రాజ్యదానపత్రంబున కేమి? నాచేత నుండుపనియకదా. రేప యాపనికిం బూనెదం గాక. ప్రొద్దు చాలఁ బోయినది. నిదుర వచ్చుచున్నయది. నిద్రించెద. (అనుచు మంచము పై నిద్రపోవుచునిట్లు కలవరించుచున్నాఁడు.) ఓరీ! యుగ్రసేనా! చూచితివే! హీనంబగు భుజబలంబు నిన్నెంతటి దుర్దశకుం దించె! అహీనంబగుబుద్ధిబలంబు నన్నెంతటి మహాదశకుం బెంచె? ఓరీ! నిజమాడితి నన్నిగ్రహింపఁజేసెద వేలరా? కత్తి యేల యొఱఁ దీసెదవురా? వలదు. వలదు నాగొంతుఁ దఱుగ వలదు. (అనుచుం ద్రుళ్లిపడిలేచి) ఏమియిది! ఇట్టిదుస్స్వప్నంబుఁ గంటిని. మరలఁ శయనించెద. (పండుకొని) జయపాలా! బాలగ్రహంబుమాడ్కి నీ వేల వచ్చెదవు? చాలు-చాలు. ఆమాటలేల? నీవే బ్రతికియుండిన రాజ్యంబు నాకెటులు లభింపంగలదు? ఏమీ? మ్రింగ వచ్చెదవు? వలదు. వలదు. మ్రింగవలదు. (అనుచు మరలఁ ద్రుళ్లిపడిలేచి) ఇది యేమి? చెడు కలలొకటిపై నొకటి నాకు నిద్రాభంగంబు గావించుచున్నవి? చేసినకార్యంబులు మనంబున నుండి బాహ్యేంద్రియంబులచే నామనంబునకుం బని పెట్టి సుషుప్తిసమయంబునం దామానసేంద్రియంబునకుం బని యిచ్చును. ఇట్టిదికదా స్వప్నలక్షణంబు! వెఱవ నేల? (అనుకొని మరల నిద్రించుచు) హా! సుదేవా! ఆమంత్రిసుత బలుచక్కనిది. నిను మోహించినది. నీవ్రాసా-

వివాహంబునం జేకొంటి వేని నీచేత దప్పు. అది కాదనినఁ గారాగృహమరణంబే శరణంబు. సందియంబు లేదు విషప్రమింక సునందనిపై మోహంబు. అది మరణంబు నొందినది. ఏమిరా యిఁక నుద్యుక్తుఁడ వయ్యెదవు? వలదు. వలదు. నఱుక వలదు. (అనుచు మరల లేచి) చాలుం జాలు! ఈ రాత్రి నాకు నిద్ర వలదు. కను తెప్ప లింత వాల్చినతోడనే చెడుకలలు వచ్చుచున్నవి. మరల నాకారాగారంబునకె పోయి నామా ద్యుపాయమ్ములచే నా సుదేవునిఁ ద్రోవకుఁ దేఁ జూచెదం గాక. (అనుచుం బడకటిల్లు విడిచి వెళ్ళి పోవుచున్నాఁడు.)

## పంచమాంకము—పంచమరంగము.

### కళింగదేశాధీశ్వరునిసభామందిరము

(ప్రతాపుఁడు-జయదేవి- సుమతి. మంగళాంగుఁడు-చణికిం[illegible] సన్న్యాసి, జయపాలుఁడు, సుదేవుఁడు. భటులు).

ప్రతా—సుమతీ! మనరాజ్యంబునం దెట్టియద్భుతంబులు గలిగెనో చూచితివే?

సుమ—అద్భుతం బేమి విషయమున?

ప్రతా—మనజయపాలుని విషయమునసే.

సుమతి—జయపాలునివిషయంబున బ్రహ్మలోకంబ్యాం[illegible] చాలోచించినను బ్రహ్మభేద్యం బై యున్నది.

ప్రతా—సుమతీ! నిజము. తెలియనప్పు డంతయే కదా? వాఁడు మన పట్టణంబునం జెఱలో నున్నవాఁ డఁట. దేశదేశంబుల నీ కొట్లు గాల్పించెడిని?

సుమ — ఏ. ఏ. ఏ. ఏ. ఏమీ? జయపాలుఁడు! మనజయపాలుఁడు! మా రాజపుత్త్రుఁడు! మన చెఱలో నున్నవాఁడా? ఎటులు?

ప్రతా — ఎటు లయినది వి కెట్లు తెలిసెను? ఇంటిదొంగను బ్రహ్మయుం బట్ట నేరఁడుగాదే? ఆబాలుండు చావుం దపించికొని చెఱలోఁ బడ్డవాఁ డఁట.

ఉ. నచ్చినసేవకుండు దను నమ్మినవానికి ద్రోహ మెంచినన్,
మెచ్చగు మచ్చిక న్నగని మెచ్చులు నచ్చిక లెచ్చఁ జేసి తాఁ
దచ్చన లాడి భార్య కడుఁ దప్పదు ద్రోహము ద్రొక్కఁ జూచినన్,
జొచ్చి తదీయచిత్తమును జూడఁగ బ్రహ్మకు నైన శక్యమే?

సుమ — (గడగడ వడఁకుచుం దనలో) అయ్యయ్యో! దైవమా! నాద్రోహం బెవ్వఁడో తెలిపి యుండుఁ గాఁబోలును! (ప్రకాశముగా) రాజేంద్రా! నే నేపాప కర్మంబు నెఱుంగనే? నే దేవరవిషయంబున నట్టిది తల పెట్టుదునే? (ఆలోచనము నభినయించుచుఁ దనలో) నిజ మాతని వలనఁ గనుఁగొనక యీ తత్తరంబు నాకేల? ఇందువలన నది నేఁ జేసినద్రోహం బని యాతండు విని యుండకున్న ననుమానము గల్గించినవాఁడ నగుదుం గాదే? (ప్రకాశముగా) మహాప్రభూ! అట్టి ద్రోహులు నైతము ప్రపంచంబునం గలరా? అంతటిపాపమా? ఆపాపి యెవ్వఁడో? వాని పేరేమో?

స్రగ్ధరావృత్తము.

భూపాలా! యిట్టి ద్రోహంబులు భువి నెచటం బోలునే? ఘోరమహోగ్ర
పాపాత్ముం డెవ్వఁ డౌరా! పతి కహితగుణు న్బాలునిం జంపఁ బూనెన్?
కోపాటోపంబు మీఱ న్కులిశసమమహాఘోరశాతాసిధారన్
వాపోవం బట్టి వాని న్వడి శిరము దెగ న్వ్రేయ చేవం జేయకొమ్మా.

మ. ఖలితాకారుని వాని నెవ్వఁ డిట నిక్కంబుగా నట్లు గా
సిలఁ జేయం బనిఁబూనె? నెట్లు తలఁచెం? జే యాడె నేఁడిలి? నా

కులవిధ్వంసిఁ గృతఘ్నుఁ గ్రూరుఁ గుజను న్క్రోధంబున న్బట్టి, నేఁ
డలఁ గొట్టించెదఁ జేరుఁ జెప్పఁ డిఁక నేఁ దాళ న్నృపా! యోపఁగన్

ప్రతా—సుమతీ! ఇంచుక యుపశమింపుము. నిదానంబున విచారించి నిజంబుఁ దెలియవలయును. కోపంబునం జేసినపని పాపంబునకుం గారణం బగును.

౭. ఓపికను బాపు బుద్ధిని నూఁపు, సుఖము
నాఁపు, నురుపాపములఁ గూర్పు నోపు, నయము
ప్రాపుఁ జెడఁబాపు, రూపును మాపు, నౌర!
కోప మనురోగతాపంబు డాఁప వలదె?

సుమతీ! యిట్టిపాపకారం బగుకోపంబుం బూన వలదు.

సుమ—ప్రభువర్య! దేవరవాక్యామృతధారలు వీనులారం గ్రోలి చరితార్థుఁడ నైతిఁ, గాలంబయ్యె! ఇట్టిశాంతగుణంబు ప్రపంచంబున నెందేనియుం గలదే? భళిరే! యెట్టిమహానుభావులరు!

ప్రతా—సుమతీ! మనసునందని యిచటికి రాక యున్న దేల? ఉగ్రసేనుం డేలరాక యున్నవాఁడు? నారాక వారికిం దెలియదుగాఁ బోలును. వేవేగ రప్పింపుము.

సుమ—(ఇంచుక యోచించి) మహాప్రభూ! నే నేమని తెలుపుదు?

ప్రతా—అట్లందు వేమి.

సుమ—స్వామీ! ఇపుడు కొన్ని దినంబులుగ వా రిరువురును మనపట్టణంబున లేరు.

జయ—నాథా! నామనంబున కేమియో భీతిగా నున్నది.

ప్రతా—(చింతించుచు) సుమతీ! ఇది యేమి యద్భుతంబు? సునందని రాజ్యంబు విడిచి పోవుటకుం గారణం బేమి? ఏదియుం దోఁపకయున్న దే!

సుమ — మహాప్రభూ! మనపట్టణంబున నుండుచారుల నందఱను సునందనిపనుపువారంబుఁ డేఁ బంపినాఁడను. విచారింపుఁ డలము. వా రింతలో వచ్చెదరు. జానింగూర్చి నెమ్మదిమీఁద మనవి చేయుదుం గాని, మనవారలందు చెఱయందు నున్నవాఁ డన్న నద్భుతంబుగ నున్నది. చూచి యిటకుం గొనివచ్చెద. పెఱకుం బోయి (యనుచు! జయపాలునిఁ బ్రతాపునిచేరువకుం దెచ్చి యొప్పించుచున్నాఁడు.) (ప్రేమతోఁ దలిదండ్రులు జయపాలుని నామంత్రణంబు సేయు)

కీర్తనము.

జయ — రార రాజకుమార! రాజితసుకుమార! రా సుగుణోదార! రారతండ్రి!

ప్రతా — రా రాజవంశపారావారహిమకర! రా మంగళాకార! రారతండ్రి!

జయ — రా లాలితాకార! రా లక్షణశరీర! రా సుతశేఖర! రారతండ్రి!

ప్రతా — రా కలితసంహార! రారా మనోహర! రా మేరుసమధీర! రారతండ్రి!

జయదే — రార ముద్దులతనయ! రార నానాయనా

ప్రతా — రార చిన్నిచిఱుత! రార తండ్రి

జయదే — రార యడవి నెంత రాలాపువడితివో,

ప్రతా — రార యంతకష్ట మేర నీకు?

క. ఏ స్వేచ్ఛలపైన వదలక, నెయ్యంబునఁ గాంచి పెంచి నిను నా డడవిం
ద్రొయ్యంగ బహువైచితినే, నయ్యో! నాయన్న! యెంత యడలితివొ వనిన్.

జయదే —

సీ. మెత్తని చలిమంచు లాత్తైడు ననునీకు నెట్టులు గులకఱాలితవు లయ్యె?
నీరెండకాకపనె పగొందనీకమో! బీఱెండవడి యెటు ప్రీతి యయ్యె?
వాయసాన్నముఁ దినుపాలపాపఁడ! యెటు లాకలములు తింట యర్హమయ్యె!
చలిగాలి సవలిన శైత్య మయ్యెడినీకు వర్షధారల నెట్టు హర్షమయ్యె?
గీ. అహహా! విధివ్రాత యెంతటి యబ్బురంబొ!
వ్రాల బోడఁగూర్చు నెంతశ్రీమంతునికిని,

పుట్టునిర్భాగ్యునకు నిచ్చు భోగవితతి
రాజరాజును బిచ్చాలరాజుఁ జేయు.

హా! హా! తనయా! ఇది విధిమహింస. దీని మీఁద నెవ్వరివశమగును?

జయపా — అమ్మా! దుఃఖింపకుము. జననీజనకులసుఖదమనుండగుతనయుఁడు తనయుండనం దగునే? ఈప్రపంచమునం బుత్రులవలనఁ దల్లిదండ్రులకు నెల్లకాలంబెడతెగనిదుఃఖంబ గాక సుఖంబు లేశమాత్రం బైనను లేదు కదా!

సీ. తనువులు తఱుఁగఁగఁ దల్లడిల్లుచు ఘోరతరముగఁ దపములఁ దలరి తలరి,
ఆపన్నసత్త్వత నాపద కలుగునో? యని యహరహముల నడలియడలి,
బాలగ్రహాదుల బాధలు గలుగునో బాలున కని చాల బడలి బడలి,
వినయంబు విద్యయు వితతవివేకంబు గలుగు నెప్పుడో యని కలఁగి కలఁగి,

గీ. తల్లిదండ్రులు కలకాల మెల్ల నిటులె
యుల్లమున భీతి నొందుచు నుండువారు
సుతులమేలునకై యిట్లు చూచుచుండు
కన్నతలిదండ్రులసుఖంబు కన్నకాఁడ.

సుమ — తలపైఁ గొట్టికొనుచు జయపాలునిఁ గౌఁగిలించికొని

గీ. దండధరునిహార్దదంభంబు ఖండించి
చాఁపఁ బంపి తౌర! జగ మెఱుఁగ
వీర! శూర! ధీర! పైర! నీసరి యెరు?
రార రాకుమార రార తండ్రి!

సుకుమార! రాకుమార! ప్రద్రోహి యనుకంపారహితుండై నీయసువులు వెస నార్పం దలంచె? ఎంతటియున్నాదుండో గాక యిట్టి ద్రోహంబు సేయఁ బాల్పడు నే?

మేఘవిస్ఫూర్జిత వృత్తము.

ఉమాదంబున్ హెచ్చె యురగయును దా నూఁచి పై నుంచికొన్నన్,
క్షమానాథా! బాధ గలుగక క్షమం గాచునే మత్తుఁ డన్నన్?
కుమారా! యీరీతిన్ గుజనుఁడు నిన్నున్ గ్రూరతన్ గొంతుఁ గోయన్,
సుమాళిన్ దాఁ బూనెన్ సుమతి బలముం జూడఁడా యింక నైనన్?

జయపా—అమాత్యవరా నావిధి కెవ రేమి సేయుదురు? కోపంబు వలదు

పద్మనాభ వృత్తము.

కోపంబు నీ కేల పాపాత్ముఁ డీభూమిఁ గ్రొవ్వారి దుష్కృత్యము ల్సేయ నెంతే
నాపాపి నేవేళ నేదిక్కు వెన్నంటి యాకర్మ ఘోరాళిగాఁ గుట్టుచుండున్;
దాపంబున న్వాఁడు దార్తాలుగా వంతఁ దాలు స్తపించుం దలంచు న్మనంబం
దేపారు జీవచ్ఛవుం జంపఁగా నేల? నెవ్వాని పాపంబు లవ్వాని మ్రింగున్.

మంత్రివర్య! నాగాదిలి యక్కయ్య యెక్కడ? రప్పింపుము, చూడం గోరెద.

సును—జయపాలా! ఆమానినికి నీపైనుండిన ప్రేమాధిక్యంబున నీవియోగంబు సైఁపఁ జాలక రేలుంబవళుల నినుం దలంచుచు, నీగుణంబుల నుగ్గడించుచు, నిప్పుడు గొన్నిదినంబులుగా రాజ్యంబు విడిచి పోయినది. నినుం గనిన సంతసం బెంతగా నుండినను, నాయమ పోయినందున దుఃఖంబు నామానసంబుం బాధించుచున్నయది. ఏమి సేయుదు?

జయపా—హా! హా! సునందనీ! నాకుఁగా నీ కిన్ని యిడుమలు సంభవించెనే? నా బ్రతుకిఁక వ్యర్థము.

సీ. ఈడగుపోఁడిమి నూడిగంపుంజెలు ల్గోశను వీడఁగ నేఁడ వాడు నొక్కొ?
కడుపిన్న గాజ్పుల వడిఁదడయఁగ లేని యమ్మపాస్య నుడిగాలిఁ దడయుంనొక్కొ!
నడయాడ గడగడ వడఁకెను పడతి యే యడవుల నిడుమల నడఁలు నొక్కొ?
అడి అలజడిఁ బడి జడజాక్షి శడి ఏడి పుడమిపైఁ బడిపడి బడలునొక్కొ?

గీ. పుడమి నేఁ బుట్టి నాతోడఁబుట్టువునకుఁ
దోష మొదరఁగఁ దొడవులు దొడఁగఁగాని,
గోడు లెన్నియొ కుడిపితి ఘోర మకట!
పాతకుల నేల పుట్టించుఁ బాపి బ్రహ్మ?

(భటుఁడు ప్రవేశించుచున్నాఁడు).

భటుఁడు—ప్రతాపమహీపాలా! దేవరకు జయమగుంగాక, జయమగుంగాక. మహాప్రభూ! అంగదేశపురాజు మంగళాంగుఁడువచ్చిద్వారంబునఁగాచి యున్నవాఁడు.

ప్రతా—మంగళాంగుఁడా! నా బాల్యస్నేహితుఁడా! నేనె పోయి కొని వచ్చెద.

(అనుచు వెళ్లి మంగళాంగునిఁ గ్రుచ్చి కౌఁగిలించికొని కొనివచ్చి).

ఉ. పిన్నటినాటిమిత్రముచు బ్రీతి యెలర్పఁగఁ గన్నులారఁ గ
న్గొన్న సుకర్ముకన్న మదిఁ గోరఁగ వేఱొకసౌఖ్య మున్నదే!
మన్నన మానినీసుఖము మానిత సూను సుఖంబు భూరిభా
గ్యోన్నతసౌఖ్యము న్సురవరోన్నతసౌఖ్యము దానిఁ బోలునే?

నెచ్చెలి! మంగళాంగా! ఎన్నిదినంబులకు నినుఁ గంటిని? మిత్రమా! అందఱును క్షేమమా? రాజ్యంబు విడిచి వచ్చినకారణం బేమి?

మంగళాం—మిత్రహృదయానువర్తి! ప్రతాపచక్రవర్తి! నాదు రాకకు గారణంబు దుఃఖకరం బైన, నీకుఁగాదని యింకెవ్వరికిఁ జెప్పుదు.

ద్విపద. వసుధేశ! నావగు-వంతలు నీవు!
వినువక వినవయ్య-విన్నవించెదను!
నా కొక పుత్రుండు-నయగుణశాలి;
లోకైకసుతుఁ డయో! లోకమోహనుఁడు
అలనాఁడు వేటకై-యడవికిఁ బోయి,
నెల లేఁడు మించెను-నేఁటికిఁ దాను,

రాకున్నవాఁ డట్టి- రాకుమారుండు.
నా కేమొ భయ మయ్యె- నయవిశారదుఁడ!
చారులఁ బంపి వి- చారణ సేయ,
ధారుణీస్థలిపై న- తఁడు గానరాఁడు.
ఇటు లుండ నీపురి- యీబరి నొకని
భటులు దెచ్చిరి పట్టి - ప్రశ్నింప వాఁడు.
ఇది సునందని యని - యెంతయుఁ ద్రుళ్లు,
అది! సుదేవుఁ డటంచు - నార్చుచు దుముకు.
ఇందునకుం గత - మిచట నీవలన
విందురు మీరని- విశదంబుగాను,
మణికంధరుండు నా - మంత్రివరుండు,
వినయంబుగాఁ దెల్ప - వెడలి వచ్చితిని,
తెలియఁగఁ బల్కుమా - తెరు వేద్ది నాకు?
నిలుఁవఁగ లే నిల - నిమిషార్థమైన,
తల్లడిల్లు మనమ్ము - తనయునిఁ జూడ,
తల్లి దుఃఖం బిఁకఁ - దడవంగఁ జాల

ప్రతా—మంగళాంగా! ఈ వృత్తాంతం బతిదుఃఖకరంబు, పుత్రవియోగంబు దుఃఖతమం బనుటకు సందియంబు లేదు.

చ. మది పదిలంబుఁ జేసి యరిమార్గణకోటి సహింపవచ్చుఁ బో,
పద నగుసూదిపోటులకుఁ బ్రాణము గట్టిగ నిల్ప వచ్చు, నా
మ్మదిఁ గొని కీలికీలములమధ్యను నిల్చి సహింపవచ్చుఁ బో,
కుదురుగ నోపఁగావశమొకో సుతభూరి వియోగబాధలన్

మంగళాంగా! ఇన్ని దినంబులవఱకుఁ బుత్రవియోగంబువలన నేఁ బడిన పాటు లన్నియు నీవు విని యుందువు. ఈ వియోగం బెట్టిదైనది నాకుం దెలియును. ఇంచుక యోఱడి యుండుము. నే నన్నియు విచారించెద. (మంత్రివంకకుఁ దిరిగి) సుమతీ! ఈయంగదేశాధీశ్వరుఁడు నుడివిన పిచ్చివాఁడు మనపట్టణంబునం దెవఁడు?

సుమ—(మాటలు తడఁబడ) మహాప్రభూ! వాఁడా, వాఁడా? వాఁడు. ఎవ్వఁడయినది నాకుం దెలియదు. అట్టివాఁడు మనపట్టణంబున లేఁడు. (ప్రవే ద్వారపాలకుఁడు)

ద్వార—మహాప్రభూ! దేవరకు జయ మగుంగాక; జయమగుంగాక. ద్వారంబున నొకసన్యాసి వచ్చి కాచికొని యున్నవాఁడు.

ప్రతా—సన్యాసి వచ్చి ద్వారంబున నిలుచు టేల? అతిశయులు లయ యతు లెచ్చటికి వచ్చుటకు స్వతంత్రులు గారు? త్వరగా నేఁ బోయి పిలిచికొని వచ్చెద. (అనుచుఁ బ్రతాపరాజు పోయి సన్యా సిని వెంటఁబెట్టుకొని వచ్చి) మహాత్మా యాసనంబున విశ్రమింపుఁడు.

సన్యా— "లయగ్రాహి"

నీకులభూషణుని నీకులయశోనిధిని నేకుజనుఁడో యకట! చీఁకటిని రాత్రిన్
నీకుసుమగంధి కడు జోక విడి తా నిదురపోవ మున నుండఁగని, భీకరమతిన్ వే
చేకొని చనన్ సుతుఁడు వ్యాకులముచే నడవి నాకు నలముండని పిశాచుపడి నేఁడే
సాకుననె వచ్చెనట! యాకొడుకు గంటి పట నీకుశలములిన్ని గ మాటు మెపుడయ్యెన్

రాజోత్తమా! ఈశుద్ధులసుకుమారుని కుమారుని నే ద్రోహి పట్టి కొనిపోయెను? అదియికెటులఁ దెలిసెను?

ప్రతా— "లయవిభాతి."

తపసివర! మీరు విన, నారిమితిభూత మిది, యిపితలమందు సుతుఁ గపట్కటుఁ దుగ్రుం
డపహృతునిఁజేసి, గురుశపథమునహింసకుని ప్రసన్నుఁడయియెఁ గనిక్కనెటుల అంతే
నుకృతిఁ దలంచి, ఒక ముపదగను నిచ్చి సురుచనయముఁ దోర్చి పడినపటువును వే దా
మెపుడెటులో వీని మనయిలువసను నుంచె నుతిని కెడార్చిరని యిపుడెవినికంటిన్.

యోగివరా! ఆద్రోహి యీబాలు నేల గొనిపోయినది, యేల చంపఁ బూనినది, ప్రాణం బిచ్చి కాపాడినయెడలను నేల మఱల వీని మనపట్టణంబునఁ జెఱ నుంచినది తెలియకున్నది.

జయపా— "లయహారి"

కను గొనుమ కుఱుకు లటు, చనిరి తమగృహమునకు-
ననవరత మును విడని కనికరము చేసె̄ ।
వసిచి, ముదమునను దమతపయుఁ బలె ననుఁ గనుచు-
ననుదినము మమతఁ గడు మన మలగమింపం ।
గనిరి సుఖములు మిగుల మనమున నొకదినము-
మునుల మిముఁ గనుగొనఁగఁ గను మొఱఁగి వారి̄ ।
ఘనశిపిరము దఁ గడచి వనంభము లెఱుఁగమిని-
దను వలయ నిలఁ జడితిఁ గన నవలివార్తల్ ।

తండ్రీ! వనమధ్యంబునం బడిననను జెఱ నుంచినవా రెవరో నాకుం దెలియదు.

జీవా—

ఉ. చిన్నెలు దెల్పి యట్టిచిఱుచిన్నెవానినిఁ బట్టి యాచెఱ-
న్గ్రన్నన బెట్టుఁ డంచుఁ గఠినం బగునానతి నిచ్చె నుగ్రుఁ డా
సన్నలఁ బట్టి యీశిశువుఁ జక్కఁగఁ బట్టితిఁ బెట్టితిం జెఱ-
న్మన్నన మానవేంద్రు సుకుమారుఁ డితం డని నే నెఱుంగమి̄!

మహాప్రభూ! ఈసుకుమారునిఁ జెఱ నుంచినతప్పిదంబు నాది. దేవర సుతుం డని తెలియక చేసితి. కావున మన్నింప వేఁడెద.

సన్యా—ప్రభూత్తమా! ఈయుగ్రుం డనువాఁ డెవండు?

ప్రతా—తాపసోత్తమా! వాఁడు నేనమ్మినసేనానాయకుఁడు. ఉగ్రసేనుం డని వానిపేరు.

సన్యా—వాఁ డిపు డెచ్చట నున్నవాఁడు?

ప్రతా—ఇపుడు కొన్నిదినంబులనుండి రాజ్యంబు విడిచి పోయినాఁ డని నామంత్రి వచించెను.

సన్యా—రాజేంద్రా! నీమంత్రి యెక్కడ?

ప్రతా—ఇతఁడే రాజ్యతంత్రనిపుణుం డగునామంత్రివరుండు. ఏలిక క్షేమమునం దెడతెగనిజాగరూకత గలప్రజ్ఞాశాలి. పైఁగా నాకు బాల్యస్నేహితుఁడు నాప్రాణమిత్రము.

సన్యా—సరిసరి. ఇట్టితంత్రనిధి నీకుమంత్రిగను, నచ్చినమిత్రముగను నుం డుటంబట్టియే నీరాజ్యం బింతగ శోభిల్లుచుండెఁ గను.

(సుమతివంకఁ దిరిగి) మంత్రివరా! ఈసుకుమారుని రాకొమారునిఁ గారాగృహంబునం దుంచిన కారణం బేమయి యుండును?

మంత్రి—యోగివర్యా! ఆయుగ్రునకు విషమబుద్ధి నైజము.

సన్యా—అటు లయిన నీరాకొమారునిం బలె నితర రాజకుమారుల నెందఱిని వాఁడు చెఱయం దుంచినవాఁడో నీకుం దెలియునా?

మంత్రి—నాకుఁ దెలియదు. రాజ్యంబు క్షేమంబున నుండుకతంబునఁ గారాగృహంబులజోలికి నేఁ బోయి యుండ నైతి.

సన్యా—అటు లయిన నిపుడే కొందఱినిం బంపి చూచుట మేలుకాదే?

ప్రతా—తాపసోత్తమా! నిజము నిజము. ఈమహానుభావుండు తన పుత్రునింగానక దేశదేశంబులుం దిరిగెడు, ఇదె దానినిజముం గంద ము. జీవాజీ! చెఱయం దుండువారి నందఱ నిటకుం గొని తెమ్ము.

జీవాజి—బుద్ధి! బుద్ధి! దేవర యాజ్ఞాపించినట్లు చేసెద. (అని కారా గృహమునకుఁ బోవుచున్నాఁడు.)

సన్యా—(మంగళాంగునిఁ వ్రేలితోఁజూపుచు) ప్రతాప ప్రభూ! ఈతం డెవ్వఁడు?

ప్రతా—తాపసోత్తమా! ఇతఁ డంగదేశపురాజు. మంగళాంగుం డం దురు. వేఁటకుం బోయినసుదేవుం డను సుతుఁడు తిరిగి రానికతంబున

వెతఁ జెందియుండ, నితనిభటులు కొందఱు, సునందనీ యని మోహంబునను, సుదేవా యని కోపంబునను, త్రుళ్లుచు నెగిరిపడుచుండ వెట్టివాని నొక్కనిం గొనిపోయి యాతఁడు నాపురజనుఁ డని చెప్పిరఁట. సునందని యనుసుందరి నాసుత, కావున నా దేశంబునకు వచ్చిన సుదేవునివార్త తెలియంగ నగునని యిపుడే వచ్చిన వాఁడు.

సన్యా—మంగళాంగప్రభూ! ఆపిచ్చివాఁ డిచ్చట నుండిన రప్పించెదరా?

మంగ—చిత్తము. గుణోత్తమా! మణికంధరా! వానిం దోడ్తెమ్ము.

మణి—దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను. (అని వెళ్లి కుబేరునిఁ దోడ్కొని వచ్చుచున్నాఁడు.)

కుబే—సన్యాసినిం జూచి పట్టుకొనం బోవుచు.

"స్రగ్విణీవృత్తము."

బామినీ! చాలనే, బాధ నే నోర్వనే
కామినీ! యేలనే! కాలము న్బ్రోవునే;
రా మనోహారిణీ! రావె నారీమణీ!
యే మతం జాలనే, యే మనం జాలనే.

(భటుఁడు నివారింపం బోయినం బిచ్చివాఁడు వానిం జూచి.)

"సమానీవృత్తము"

రార నీదు జీవ మిలన్, జీరి నైచెదం గను నా
వీరశూరశక్తి యిదే, పోరుఁ గోరి రేర సరే

(మఱియొకభటుఁడుం బోయినఁ బిచ్చివాఁడు వానిం గాఁగలించికొని,)

"ఉపేంద్రవజ్రావృత్తము"

సునందనీ! భాగ్యమె? చూడ వేమె?
మనంబున న్లోపము మాన వేమే
దినంబు గల్పం బగు దక్కుఁ గానన్.
ఘనం బడఁచే నన్నిటు గాసి వెట్టన్?

(భటులు మఱికొందఱు వచ్చి పిచ్చివానిం బట్టి కట్టుచున్నారు.)

సన్న్యా—మంత్రివరా! ఈపిచ్చివాఁ డెవ్వఁడు?

సుమ—తాపసోత్తమా! విని నే నెఱుఁగ. ఆ! యెఱుఁగుదు. రూపు మాఱినది కాఁబోలును. వీఁ డెవఁ డయినది తెలియ కున్నయది.

పిచ్చి—తండ్రీ! తండ్రీ! నీవే నా? సునందనం దెచ్చి యిచ్చెద నంటివే? ఏదీ? (భటులు మరల నాపిచ్చివాని వారించిన వానికిఁ బిచ్చి దొర్లుకొని)

*"ఉన్మాదవృత్తము."

ఏ నాగా! । చలమేలే
యెలయింపక । ఫలమేమే?

(అనుచు నున్మాదాధిక్యంబుచేఁ గ్రిందఁ బడుచున్నాఁడు)

సన్న్యా—మంత్రీ! వీఁడు తండ్రీ యని నిన్నుం బిలిచెనే? నీకుమారుఁడు కాఁడుగదా? అయినచో వీని కీయున్మాదం బేల కలిగెనో చెప్పుమువా?

సుమ—యోగివరా! వీఁడు నాకుమారుఁడే కాని రాజనందని యగు సునందనం గని కామవిమోహితుం డైనకారణంబున రాజ్యంబు నుండి వెడలఁగొట్టించితి.

ప్రతా—కంటిరే! తాపసోత్తమా! రాజద్రోహంబున కోర్వక, యేకపుత్రుం డైనను మోచింపక తనతనయునిం ద్యజించినవాఁ డీయమాత్యమణి.

సన్న్యా—నిజమకా నృపోత్తమా! సర్వరాజ్యంబుల ధర్మైకనిష్ఠాగరిష్ఠుం డగుటం బట్టియో యితఁడు సుమతి యని పేరందెనఁట? (భటులు సుదేవునితోఁ బ్రవేశించుచున్నారు.)

---

* ఇది నాట్యవిషయంబున 1 గవ వృత్తము.

మంగ—(కొడుకును కౌఁగలించుకొని)

క. రారా ముద్దులతనయా! రారా నాతండ్రి! యిన్నిరాఁపులు నీ
కేరా! సుకుమారా! పటుధీరా! యెటు సైఁచి తీవిధఁ గష్టమ్ముల్.

కుబేరుఁడు—

క. గారాముగ నేఁ గోరిన। యారామామణిని నీకు నారామమున -
క్రూరా! కోరితె స్త్రీగత్తె? । వాఁడెవఁడు? నారి యేల? వా కాంతా పురికిన్.

(భటులు వచ్చి కుబేరునిం బట్టుకొని యీడ్చికొట్టుచున్నారు).

ప్రతా—రాకుమారా! ఈకారాగృహంబున నిన్నెవ రుంచిరి?

సన్యా—రాజచూడామణీ! ఈకుమారుం డలసి సొలసినవాఁడగుచున్నాఁడు. ఇన్ని యిడుమలు పడిన యీబాలకుని పూర్వయుదంతంబు ఘోరంబు గనే యుండును. దాని వ్యసనకరంబుగా నిప్పుడె చెప్పఁ గోరవలెనా? ప్రజాపరిపాలకా!

చ. పంచపాది నిలువక దాఁటెడి వాహినుల కొట్టినగట్టు గుట్ట లెక్కుచుం,
జలిపడి నీతు వెంచక ప్రచండకరాతపభీతి మాని, యా
జలధరఘోరధార కు జంకక, కొంకక యించుకేని, ని
శ్చలమగు మానసంబున నజయ్యునిఁ గ్రమ్మరుచుండి. కంటి నే
నిసుక మర్త్యు, వాఁ డిడిగో యిచ్చెనీ నాకొకకమ్మ చూడుమా

(అని యుగ్రసేనుఁ డిచ్చినకమ్మను బ్రతాపుని కొసంగుచున్నాఁడు.)

ప్రతా—(కమ్మ చేత నందుకొని) సుమతీ; ఈజాబుం జదువుము.

సుమ—మహాప్రభూ; చిత్తము (అనుచు జాబు నందుకొని లోలోనఁ జదువుకొన్నకొలఁదిని ముఖము వెలవెలంబోవ బిక్కమొగము వైచి చేతులు గడగడ వణఁక నోటఁ దడి యాఱ నాకమ్మనే మరల తలఁ క్రిందుమీఁదులు చేసియుం ద్రిప్పి త్రిప్పియుం జూచుచున్నాఁడు).

ప్రతా—సుమతీ! ఎట్టి చిక్కక్కరంబు లయినను ధారాళంబుగాఁ జదువు నీవేల నేఁ డీరీతి మతివిభ్రమముఁ జెందుచున్నావు?

సుమ—(చేతులు వడఁకించుచు గ్రుడ్ల నీళ్లు గ్రుక్కుకొనుచు నోటఁ దడి యాఱి మాట రాక చప్పరించుచు, ప్ర...ప్ర.. ప్ర...అనుచు మ్రింగుచు ముఖము నేల వైచి జీచ్చవడి తూలుచున్నాఁడు.)

ప్రతా—ఏమి! మంత్రివరా! ఈయచ్చెరువు? మనసునందవిశేషము నెఱియుం గొంత వడదు గద?

మణి— మహాప్రభూ! ఆ కమ్మయం దీమంత్రి మహాకృత్యం బేదియో వ్రాయం బడి యుండు నని యే నెన్నెద. కాననే ఖేతిల్లి నోరు తెఱవ నేరకున్నాఁడు. అందునకు సందియంబు లేదు.

ప్రతా—అమాత్యవర్యా! మణికంధరా! అటు లయిన దయచేసి మీరు చదివెదరా?

మణి—మహాప్రభూ; చిత్తము, దేవరయానతి శిరసా వహించి చేసెద (అనుచు సుమతిచేత నున్నకమ్మఁ దీసికొనుచున్నాఁడు.)

సుమ—(బిక్కమొగము వైచి మణికంధరుని కాళులమీఁదఁ బడుచు, నమస్కరించుచుఁ, జేయి త్రిప్పి చదువ వల దని సైఁగ చేయుచు, నుదురు కొట్టుకొనుచు, గ్రుడ్ల నీళ్లు గార్చుచున్నాఁడు.)

ప్రతా—సుమతీ! ఏల నీకీభయము. మణికంధరామాత్యా! పుత్రుని వెట్టి చూచి యీమంత్రివరుని మనస్సు చలించి యున్నట్టు కన్పట్టెడు. మీ రాలసిం బాటింపక యాకమ్మ నిమ్మగఁ జదువుఁడు.

సుమ—[పెడమొగము వెట్టి, తల వేలవైచి, కన్నులు చేలితో మూసికొని కూరుచున్నాఁడు.]

మణి—జాబు విప్పి]

చ పురజనులార! భూరితరపుణ్యమహీసురవర్యులార! మౌ
నవరులార! సత్య మిది నమ్ముఁడి, ప్రాణసమీరవారముల్

పురముఁ దోలంగి పోవుతఱి, భూతము లైదును సాక్షి గాఁగ, నే
హరిహరవిశ్వసృద్వ్యకులయానగ వ్రాసెద నాదుకృత్యముల్

ఉ. భూరియశోవిశాలుఁ డిల భూతదయాహృదయుండు సద్గుణో
దారుఁడు నా కళింగుని ప్రతాపుని దండున నాయకుండనై,
యారిపుభీము మన్ననల నందినవాఁడ, సుఖింప లేక యయ్యో!
కోరితి నేను ద్రోహములఁ గ్రొవ్వునఁ జేసితి దోషకర్మముల్.

ఉ. మాటలు తేనియల్ మనము మాననిఘోర కాలకూటముల్.
బైట మృదుత్వ, మంతరమునన్ గఠినత్వము గల్గి యుండుఁ, బా
టోటులమారి, భూరికపటుండు, సుమత్యభిధాన మంత్రి, యా
బూటకపుష్టురాత్ముని ప్రతిక్రియ గాంచి విరాళిఁ జెందితిన్.

మ. మదనోన్మాదపరీతమానసుఁడనై మాయాత్మ యానాసతి
వదనం బెప్పుడు చూతు నన్న మనుట ల్వ్యర్థం బటం, చక్కటా!
మదిలో వందురి కుందె, మందగమనా! మాటాడవే! రావె! నీ
మదిఁ బ్రేమన్ననుఁ జూడవే యనుచుఁ బల్మారాసతో వేఁడితిన్.

క. ఇవ్విధమున వాపోవుచు నవ్వడి నన్మంత్రిఁ జూచి యంతఃకరణం
బివ్విధమున సుడివడియెడి, జవ్వని నీపుత్రి నిచ్చి సాకవె యనుచున్.

ఉ. వేఁడిన, వాఁడు నవ్వె యలివేణి నొసంగద; నాదు నేత్రముం
దో డయి, కూడ దం చనక, తోడన చేయు, మ టన్న, మంచి దం
చాడితిఁ బాపము న్దెలియ, కంతట భూపతి యొక్కనాఁడు దా
వేడుక దారపుత్రులను వేఁటకుఁ గాఁ గొనిపోయి యున్నెడన్.

శా. ఆహా! క్రూరదురాత్ముఁ డా సుమతి నన్నారేయి నుంజేరి, "యే
ద్రోహం బెన్నక రాజపుత్రు నిపుడే ద్రోఁపించి, ఖండించి, నీ
బాహాసత్త్వము చూపు," మన్న నపుడే వాలు న్వెసం ద్రిప్పి, యే
యూహాలేయక, చంప హంతలకు నే నొప్పించితిం బాపినై

అంతట నారాజదంపతులు తమ గాదిలిపుత్రు నిజాడ గానక

సీ. ఘనతరపుత్రశోకమున గాసిలి, పోవంగఁ గాళు లాడ, క
న్నానతం మండె స్రుక్కి, కడు వంతలఁ గుందుచు, [illegible]

సన్యా — ప్రతాపప్రభూ! హా! నీమంత్రిప్రభావంబుం గంటివే? ఎంతటి పుణ్యంబు సేసిన నిట్టిగుణఖని చేకురుం గలఁడు? ఇంకను వీనిపై శాంతివహించెదవే?

చ. కుటిలఘని న్వరించెదఁటె? కుక్కకున్మృష్టి మటఁ జూతురే?
కుటుముఁ బ్రోతురే మకరిఁ? గుక్కక నుంతురె కత్తి వాదరన్?
గటపముఁ జెరుపెట్టుబలినిఁ సారిమఁ గాతురె? కుంసనీవరా!
పటిలునిఁ జేరఁదీయుదురె? కోరుదురే విషభోజనాదులన్?

అట్లు గాన నీకుటిలుని నటవిం జేర్చి యాయుగ్రునిసరసం బ్రోయిఁ పుమా.

ప్రతా — వీరభటులారా! ఈక్రూరునిఁ బట్టికొని పోయి మోకాళుల వఱకుం దెగ నఱికి యాయుగ్రసేనుం డుండెడి యరణ్యంబున వాని ద్రొక్కనుం ద్రోసి రండు. వేవేగఁ బొండు. ఇఁక పని నా యెదుట నుండ నీకుఁడు.

భటు — మహాప్రభూ! చిత్తము. (అనుచు సుమతిం బట్టుకొని పోవుచున్నారు.)

సన్యా — (కుబేరునిం జూపుచు) ప్రతాపభూమిపా! ఈయున్నాతుని వైద్యశాలకుం బంపి, పాపము, తగినచికిత్స సేయింప నాన తిచ్చెదవే?

ప్రతా — చిత్తము. భటులారా! నినిం గొనిపోయి మన యున్నావైద్యశాలలో విడిచి క్రమమైనమహావైద్యసేవ సేయింపుఁడు.

భటు — చిత్తము, మహాప్రభూ! (అనుచుఁ గుబేరునిం గట్టి బోయిరి.)

కుబేరుఁడు — కాంతివృత్తము

భామామణి నన్నిటు బాధలిడన్
రామామణి నన్నిటు రాపులిడన్
హేమాంగిరొ! యింపుగ నేటికొకో
యీమాయలు చాలునె యిందుముఖీ!

(అనుచు భటులపైఁ బోవ వారు వానిం గట్టం బోవుచుండ.)

కుబేరుఁడు—

క గరగరిక లాఁడి కరకరి । సరి కాదిఁకఁ దరమె తరుణి సైపఁగ నటులం
గరిగమనరో! మరుఁ డురువడి । నరవిరిముల్కులను గుచ్చు, నటమటి యేలే ?

అనుచుఁ (బేలుచుండ వాని నెత్తికొని పోవుచున్నారు.)

మంగ—సుదేవా! నాఁ డడవికి వేటకుం జని నీపరివారంబు నెడఁబా
సితి వని విని యుంటిని. పిదప నీ వెట్లు లీద్రోహి దుష్టబుద్ధిచారిని
బడి చెఱఁ జేరితివి ?

సుదే—తండ్రీ! సేనకు దూరస్థుండ నై

మ. అడవిం జేరితిఁ, ద్రోవఁ దప్పితిఁ, బిపాసాయత్తతం జిక్కితిన్,
నుడువం జాలనివేసటం బడలితి, న్ధ్యాపించితిం దైవమున్,
బుడమి న్వ్రాలితి, నట్టె లేచి మఱల న్బోఁ జూచితిం, బోయి నా
యడిదప్పాల్వడి వీడఁ గాంచితిని నే నారామకాసారమున్

శా నీరం ద్రావి సుఖంబున న్నిదురలో నే నుండ, నారామముం
జేరన్ వచ్చినరాజనందనిని రాజీవాక్షినిన్, లేచి, క
న్నారం గంటిని, బల్కరించితిని, మోహంబు ల్వాసం దెల్పితిన్,
రా రాజాస్య! మదీయదార వయి వే ర, మ్మంచు నే వేఁడితిన్

ఉ నే నటు వేఁడఁ జింతిలుచు నీరజనేత్ర వచించె, నక్కటా!
మానవనాధ యే మనుచు మానితసౌఖ్యము లందుదాన, న
య్యో! నవమన్మథు న్నతు మహాగ్రవనంబుంబునఁ గోలుపోయి, యా
కానఁ గృశించుచంద్రులకుఁ గా మది వంచురుచుండు నే ననన్.

క. కుటిలాలక యటు లాడినఁ । గటకటపడె నాదుమనము, "కలికీ! యనుకం
దలుకునఁ దెచ్చెద, వ్యసనము । నిటు పొందకు, నన్ను నమ్ము మింక! యనుచున్

గీ. గడువుపెట్టి యన్నగదువున రాకున్నఁ । మృతుఁడఁ గాఁ దలంపు మెంచి నన్నుఁ
జలజనయన దీని సత్యంబుగా నమ్ము । నుడివి నేయాపన్న నడవఁ గీడు

మ. అని పైనంబయి దేశదేశములు సర్వారణ్యము ల్వాచి, చూ
చినవారిం "బసిపాప నిట్టి నిట మీసీమం గనుంగొంటిరే ?"

యని వేర్వేఱుగ వేఁడి, కాన కేచటన్, హా! యందుఁ జింతిల్లుచున్
వనమధ్యంబునఁ జిక్కి, చెట్టుమొదటం బవ్వండి నిద్రించితిన్.

తండ్రీ! పిమ్మటఁ గను విచ్చి కందుం గదా చెఱఁ దగిలి యుంటి. నన్నెవరు పట్టినది, యెవరు చెఱ నిడినది, నాకుం దెలియదు. ఈదురాత్మకుండు వచ్చి జయపాలి యనువాని వివాహం బాడు మని నను బాధించుచుండెను, గావున నీనిదియే యీకృత్యం బని నే నూహించెద.

జయ—తండ్రీ! నాకు నైనంతశసంతాపభారంబుచేఁ గ్రాఁగి, రాజ్యసుఖంబులు దూఱి, కాఱడవులు చేరిన నాసోదరిం గానక, నిఁక నొక నిమిషం బయిన నిలువం జాల. అనుజ్ఞ యిచ్చిన దాని వెదకం బోయెద.

సుదే—ఏమీ! జయపాలా! నీసోదరి మందిరంబున లేదా? రాజ్యంబు విడనాడిపోయె నా? హా! హా! సునందనా! నా కేమో భయ మవ్వెడు.

క. అక్కవరా! మితి మీఱితి నని। వెతఁ జెందుచు నున్న నాయ నిపీనంబుల వె
గితివో? యలసితివో? తలఁ। చితివో? పిలిచిలివో? సతీ! చెఱఁ గొండనున్

చ. తిరుపెరో! నీదుసోదరునిఁ దప్పక తెచ్చెద నంచుఁ బల్కితిన్,
గురుతరకాననంబులను ఘోరధరాధరతీరభూము లం
దిరిగితిఁ, గానఁ జిక్కితిని, దిక్కులు గానక నేల వ్రాలితిన్,
హరిహరి! నాదువాంఛితము లన్నియు వ్యర్థము లయ్యె నిప్డహో.

సీ. అనుచరులను వీడి, వనభూములను గూడి, వసరుహాసన బాధుపాలు నైతొ?
అతనునిశితశూన మతి చెడి, స్మృతి వీడి, కాఱుఁగోనలఁ గంపువాలు నైతొ?
చిన్నారిపొన్నారి యన్నులమిన్న దేబన్నములఁ జిక్కఁబాలు నైతొ?
తనువారు తనుబోగతను బొంది తనరారు లనుమద్గ తపముల గాలు నైతొ!

గీ. అనుగలఖునుఁ దప్పి యనుదిన వదలునైతొ?
తనువు దగ దని పోనాడఁ దలఁచు నైతొ?
ముదితముసుమట్టులను నేమ మూల నైతి;
ననుఁగుఁగత్తియ లేనినామనువు రిత్త.

## పంచచామరము.

ధరాధరా! పరాత్పరా! సదాసదాళిసన్నుతా!
సురారిసూదనా! సురేశ! సూరిలోకవందితా!
పురాణపుణ్యపూరుషా! యపూర్వపూర్ణసుందరా!
పురారిపూజ్యా! నిన్భజింతుఁ బ్రోవరా సునందనిన్.

జయపాలా! ఆసుందరి లేనినాబ్రతుకేల? ఇఁక నే నిట నుండఁ జాల; వెతకుచుం బోయి యానాప్రాణపదంబుం గొని తెచ్చెదం గాక.

సన్న్యా—రాజపుత్రా! ఏల నీకీవెఱ్ఱి? అబలలు సహజభీరువులు కారే? ఆకన్యక యే పెబ్బులినిఁ జూచి యావులించి యుండునో? కుడిచి కూర్చుండ నేరక లేనిపోని యవిధి యేల తెచ్చి పెట్టుకొందువు?

సుదే—ఆ! ఋషివర్యా! ఏమంటిరి? హా! సునందనీ! (మూర్ఛపోయి పడఁగా సన్న్యాసి మేను నిమురుచున్నాఁడు. అంతట స్పర్శసుఖమున భినయించుచుఁ ద్రుళ్లిపడి లేచి) చెలీ! సునందనీ! (నలుదిక్కులం గలయం జూచి) ఇపుడు మృత్యువుకోఱలనుండి నన్ను బ్రతికించిన ప్రాణధనం బెచ్చట? ఇంతలో నెచ్చటికేఁ బెఱచినది? ఒక్కరును తెలియఁ జెప్పరు గా?

సన్న్యా—ఏమి యీకలవరము? రాజపుత్రా! ఇందఱము మేమింకట నుండ నిపుడు నీచెంత కేకాంత వచ్చినది? కలవరించుచుంటివా యేమి? ఆకన్య యెంతటిదో న్యాలి: కాని యొకకుబేరునికిఁ బిచ్చి పుట్టించి వైద్యశాలం బెట్టించె; ఇపుడు రాజరాజును నిన్నిట్లు మోహనిద్ర పుచ్చుచున్నది. రాజకుమారా! ఏల యిట్టి స్త్రీభ్రమలు? కాదేనిఁ బోయినవారు మరల వత్తురఁటోయీ?

సుదే—ఋషివర్యా! అట్లు సెల వీకుఁడు. హా! సునందనీ! (...

పోయి సన్యాసి తాకఁగా మఱలఁ (ద్రుల్లిపడి లేచి) ప్రాణేశ్వరీ! న న్నేల పరిహాసపాత్రునిఁ జేసెదవే? కరుణింపవె! పొడ సూపవే?

సన్యా—రాజపుత్రా! నీ వేల దుఃఖించెదవు? మీయిరువురిమనంబు లన్యోన్య స్నేహసూత్రంబున నిట్లు గ్రువ్వంబడి యుండ, మీకు వియోగం బేల కలుగు? ఒకతటిఁ గలిగిన నది చక్రవియోగసామ్యం బై యుండుం గాని లాఁతి కాదు. వెఱవకుము.

సుదే—తాపసోత్తమా! భగవానులు త్రికాలవేదులు. అఘటనఘట నాసమర్థులు. మీయట్టిమహనీయులవాక్యములు పొల్లువోవునవి కావు. అటు లయిన నావియోగం బనురాత్రి యెపుడు సమాప్తి నొందును?

సన్యా—ఇపు డది సమాప్తి నొంద కున్న దన నేల?

సుదే—బలే! ఋషిసత్తమా! నావీనులకు విందు సేసితిరి? నేను నామె స్పర్శసౌఖ్యము ననుభవించి నాచెంగట నున్నదాని నిశ్చయించితి. కాని కన్నులకవు దీఱ నామెదివ్యదర్శన మెపు డబ్బునా యని నిరీక్షించుచుంటి. ఏదీ? ఎచ్చట నున్నది?

సన్యా—రాకన్నియలు రాణివాసంబు విడిచి రాఁదగునా! ఆసుందరి తనమందిరంబున నగపడును, పిలువంబడక రాజసభలకు వచ్చుట రాజసుతలకుం గొఱఁత గాదే!

ప్రతా—తాపసోత్తమా! ఆదుష్టబుద్ధి సునందని రాజ్యంబు విడిచి పోయె నని వచించెనే; ఆదుర్మార్గునికూఁత యదియు నబద్ధంబకా?

సన్యా—అది యథార్థమే యయి యుండును. ఇపుడు తనమందిరంబున నగపడునది సైతము యథార్థమే యగును. ఇవి యన్నియు దైవ మాయలు.

ప్రతా—తాపసోత్తమా! ఇది తమయోగమహిమంబ కావలయు. ఇంతకు నాయిందుముఖి మందిరంబున నుండునది సత్యంబే కద?

సన్యా—నే నిచట నుండునది సత్యంబ యే నందునకుఁ సందియం బుండదు.

ప్రతా—ఆమోహనాంగిం జూడ కున్నఁ బ్రాణంబుల భరియింప నోప. భృత్యుఁ గరుణించి యానాపట్టిని, తాపసోత్తమా! రప్పించెదరే?

సన్యా—ప్రతాపభూపాలా! ఆసునందని యోగధారణమున నున్నది వలయు నన్న నేనిపుడే పంపెద. పంపు మందువే?

ప్రతా—అంతటిభాగ్యమా తాపసోత్తమా? దేవరకు విన్నవించుకొన నేరక శంకించుచున్నాఁడను. నను క్షమించి నాపాలిణపదవి యగు పుత్రికారత్నమ్ముం గనఁబఱుపుఁడు.

సన్యా—రాజేంద్రా! చింతిల్లకు. నీపుత్రిక నిపుడె పంపెద. (అనుచు సన్యాసి వెళ్లిపోవుచున్నాఁడు).

ప్రతా—ప్రియమిత్రమ! మంగళాంగా! ఆసుందరి సునందని నాకు జనించినతఱినుండి నీపుత్రున కిచ్చి నీవియ్యం బంద వలె నని తలఁచుచుంటిని. కాని నాకు సంభవించిన దుఃఖంబులచే నేదియుం దోఁపక యామాటనె మఱచితిని. దైవసూత్రమున వా రిరువురిమనంబులు నిపు డన్యోన్యప్రేమపాశంబులచేఁ గట్టువడి పోయెను.

ఉ. మిత్రమ! నాదుపుత్రి జిగిమించుల మించుసుగాత్రిఁ, బున్యచా
రిత్రిఁ, బయోజనేత్ర, సుఖరీతులు నూత్రపడంగఁ జేకొనం
బాత్రుఁడు, గాఁడె? రాజసుల హావనుఁ, డంచితలక్షణుండు, నీ
పుత్రుఁడు, పూర్ణచంద్రనిభమూర్తి, పవిత్రచరిత్రుఁ డెవ్వరణ

మంగ—

ఉ. అంతటిభాగ్యమే? రిపుకులాంతక! భవ్యము నీమవియ్యముక్ ,
సంతస మయ్యె నాకు, నిఁక సంపద కట్టని మాట గాదె? యా

యింతిని నాదునందనుని యింతిగఁ గన్గొను టెంతభాగ్యమో!
వంతలు దీఱె నిన్నుఁ గన, వాసిని జెందనె వియ్యమందినన్?

(సునందని ప్రవేశించుచున్నది.)

ప్రతా—తల్లీ! సునందనీ! ఉభయకులాభినందనీ! మన్మనఃపూర్ణానందనీ! ఇటురమ్మా! ఇటురా. అమ్మా! ఆ యోగివరుఁడెచటనే?

సునం—తండ్రీ! నిజంబు నింకను దాఁప నేల? నేనే యాయోగివేషంబున నడవులం దిరుగుచు దైవవశంబున మఱల నిట్లు మిమ్మింటఁ గనఁ గలిగితి. (అదివినఁగనే సభికులెల్ల నత్యద్భుతంబుగఁ జూచుచున్నారు.)

ప్రతా—ఎంతటియద్భుతమే యిది! అమ్మా యింతటిసాహసము తగునఁటమ్మా? ఏమి యీవిధిమాయ! విధిమాయ.

జయదే—

క. అమ్మా! సునందనీ! రా। వమ్మా? వనతలము లేల వలచితి వమ్మా?
నెమ్మోము వాడెనమ్మా। కొమ్మా! యిటుసాహసమ్ము గూడునె సతికిన్?

జయపా—

క. అక్కా! యెక్కడువంతలఁ। జిక్కులఁ గెడపితి నిఁక నేమి సేయుదు నకటా!
యక్కటికము తక్కక నను। మక్కువ మన్నింపవమ్మ మానని దయతోన్.

(అని కాళులపైఁ బడుచున్నాఁడు.)

సునం—(తమ్ముని ముద్దాడుచు) తండ్రీ! నీ వేమి చేయఁగలవు? విధిమాయ మీఱ నెవరితరము. ఇంతకును మాకన్నులయెదుట ఒడిమమ్మెల్లర బ్రతికించితి వద్దియే పదివేలు.

ప్రతా—

క. లలనా! కులభూషణ! రా,। లలితాంగిరో! రావె, భాగ్యలక్ష్మీ! రావే,
కులతోషణ! రావే, సా। కలపోషణ! రావె, ముద్దుగుమ్మరో! రావే

సునందనీ! కనుగందనిసుకుమారసౌందర్యం బడవిం గాచిన వెన్నెలం బలె వ్యర్థంబు సేయుటకు, వనతలంబులం జేరి మునిలీల నేటికి నవ

లంబించితివే? రాజ్యపరిపాలనము సేయుచు సుఖంబున నుండక పరి
వ్రాజకత్వం జేల గోర వలసి వచ్చెనమ్మా?

సునం—తండ్రీ! నే నేమని పలుకుదు?

సీ॥ ఆలనాఁడు జయపాలుఁ డడవినిఁ బోయినఁ గడు దుఃఖపడుచు మీ రడవిఁ జేరి,
పుడమి నేలు మటంచు వడిఁ బంప, వచ్చి నే నడలుచు మనమున ననుజు వార్త
తెలుఁగఁగఁ గోరుచు నెల్ల వేగులఁ బంపఁ, దే నైరి శుభవార్త వార లేరు
ఇటు లుండ నొకదిన మట నుపవనమునఁ గరుణాలవాలు నీమునునిఁ గాంచి,

తే॥ యెవరికో కో యంచు మదిని నూహించుచుంటి;
గులముఁ దెల్పుచుఁ బెండ్లాడఁ గోరెఁ నితఁడు;
పట్టరానిదుఃఖమున మీవ్యసనవార్త
దెల్పఁ దానేఁగె బాలునిఁ దెత్తు ననుచు.

ఉ॥ పోయెను బెట్టినట్టిమితి, పోయెను, రాత్రిమరుందు తానురాఁ
డాయెను, మోస మాయె, నని యాకులపాటును జెంగి; దైవమా!
హాయిగ నుండువాని నిటు హా! వెతపెట్టితి నంచు నెంచి, నే
నాయతివేషము న్గొనుచు, నక్కట! కాననసీమఁ జేరితిన్

క. చేరియరణ్యంబులు వెసఁ। దూరుచుఁ బొడగంటి నునుఁ దొఱఁగెదునన్గుఁగన్,
గ్రూర మగువార్త వింటిని,। జేరితి నీపట్టణంబు క్షేమముఁ గంటిన్.

తండ్రీ! నీయానతి లేక రాజ్యంబు విడిచినతప్పు క్షమింప మిము
వేడు చున్నాను [దండప్రణామము సేయుచున్నది.]

ప్రతా—(కూఁతును లేవఁదీసి యొడలు దులిపి కూర్చుండఁ బెట్టుకొని
ముద్దాడి) తల్లీ! సునందనీ! ఒప్పులకుప్ప వగునీయందుఁ దప్పుకలుగు
నఁటే? రాజ్యభారము వహించినదానవు కావున, నట్లు ప్రచ్ఛన్న
వేషంబునం బోయి రాష్ట్రపాలనంబునందలి దోషంబులం గనుపెట్టి,
యాగుట్టు బైటఁబెట్టి, యంగకళింగరాష్ట్రంబుల రెండింటిని రక్షిం
చితివి. దోషుల యథాయుక్తముగ శిక్షించితివి. తమ్మునిఁ దెప్పించి
తివి. తలిదండ్రుల ముప్పుఁ దప్పించితివి. ఇందు మన్నింపఁ గోరున ది

మున్నది? కాని సునందనీ! వేఱొకమాట. ఈసుదేవునకు నిన్నిచ్చి యీదినమునఁ బెండ్లి సేయ నిశ్చయించినారము. నీకు సమ్మతంబే కదా.

(సునందని సిగ్గుతో దల వంచుకొని తల్లియొద్దికిఁ బోవుచున్నది)

మంగళాంగా! ఈసుందరి నాహృదయానందకరి నాపుత్త్రి నీపుత్త్రుని వరించియున్నది, కంటివే?

మం౹౹—ప్రతాపప్రభూ! నీవియ్యంబు నాకు లభించుట బంగరునకుఁ బరిమళంబు హత్తినవిధంబు గాదే? ఈ శుభాంగి పనివడి చేసిన యుపకారంబు నే మఱతునే? ఈపాటలాధర నాపాలిటిదైవంబు కాని లోకసామాన్య మగుకోడ లనఁ జెల్లు నెట్లు? ఈయమ నాసంచిత సుకృతఫలము. నాదివ్యఫల పరిపాక సౌభాగ్యలక్ష్మి, ఇట్టిది నాకోడలై యుండుట కల్పవృక్షంబు నాయింటి ముంగిట నాటుకొనుటయె గాదె? ఏలకాలవిళంబనము? ఇట్టి శుభముహూర్తంబు మఱియొకటి దొరకదు. వైళంబ కులగురుల రప్పింపుము.

ప్ర౹౹ తా—సేవకా! పెండ్లికి సర్వంబు సిద్ధంబు చేయించి మనపురోహితుండగు వామనాచార్యులను, బట్టణంబున నుండుభూసురులను, సకుటుంబపరివారంబుగా వచ్చునటుల వేఁడి రమ్ము.

సేవకు—మహాప్రభూ చిత్తము. (అని వెళ్లుచున్నాఁడు.)

భటు—ప్రతాపమహాప్రభూ! ఆమరాత్మకుఁడు మంత్రి మార్గమధ్యంబున నొకచో నీపత్రిక వ్రాసి, ఇది రాజసన్నిధానంబునకుం గొనిపోయి దీనిని రాజ్యంబున వెల్లడిసేయునట్లు వేఁడుకొంటి నని మనవి చేయు మని నాచేతికి నిచ్చి నన్నతివేలముగఁ బ్రతిమాలెను. ఇదిగో పత్రిక ప్రభువర్యా! (అని చూపుచున్నాఁడు.)

ప్రత్రా—మణికంధరామాత్యా! ఆపత్రిక యేమో చదువుమరా?

మణికం—చిత్తము. మహాప్రభూ! (అనుచు నిట్లు చదువుచున్నాఁడు.)

"ద్విపద" పురవరులార! యో- పుణ్యాత్ములార!
ధర ధాతగీఁతకుఁ - ద ప్పెందు లేదు.
దయఁ గని దైవంబు - దన కిడినట్టి
నయ మగు పదవిని - నరుఁ డుండ లేక,
యున్నతపదవిఁ దా - నుబ్బుచుఁ గోరి,
మిన్నుమ న్నెఱుఁగక మీఱినపనులు
సేయఁబూనిన, వాఁడు- సెడు, నది నిజము;
న్యాయముఁ దప్పిన - నరకము ధ్రువము;
తా నొకటి తలంప - దైవంబు వేఱు
పూనికతోఁ బూను - భూజనులార!
ఇందులకొఱ్ఱ - మిలలోనఁ జూడ
నెందునులేదని - యెన్న నేమిటికి?
సందియంపడ నేల - సద్గుణులార!
వందురు ననుఁ గని వాస్తవ మనుఁడి.
ఇలపైన బుద్ధికి - నీఁ డగునట్టి.
బల మెద్ది లే దని - బలుగరువించి,
తలపోయ లే నైతి - దైవబలంబు,
భళిభళి! విధి బలు - బలవంతే మిలను
సకలశాస్త్రజ్ఞుఁడ - సరివారిలోన
నకళంకుఁడ నటంచు - నలరెడు నేను
నున్నంత పదవిలో - నుండక యకట!
యున్నతదేశాధి - పోన్నతపదవిఁ
గోరినందునఁ గదా - గురుతరఘోర
కారణంబులు నాకుఁ - గలిగెను దుదకు,
కూరిమి గలిగిన - కూఁతురు గొడుకు,

ధనధాన్యవస్తుసా - ధనములకలిమి,
తనరార నుండియుఁ - దనివోక నాదు
మట్టుమీఱుదురాశ - మఱి నాఁడుఁ గాలిపె,
రట్టుపా లాయెఁగా - రామ! నాబ్రతుకు;
రాజ్యంబు నెటు లైన - రాఁ జూచికొన్నఁ,
బూజ్యుండ నయ్యెద - భువిలోన ననుచు,
నన్ను మిచ్చినదాత - యనునది మఱచి,
కన్నులు గానక - గర్వించి మిగులఁ,
జిన్నవానిని ముద్దు - చిన్నెలవానిఁ,
జెన్నారారెడు - చెలువులవానిఁ,
గన్నవారికిఁ గంటి - కలిమియై చెలఁగి,
యున్నవానినిఁ గటా! - యుడుగ నీక,
జననికిఁ దప్పించి - చయ్యనఁ దెచ్చి,
ఘనతరం బగుఘోర - కాంతారసీమ,
కటికవాఁడును బోలెఁ - గంఠంబు ద్రుంపఁ,
గటకటా! యాజ్ఞ న - క్కటికము లేక
యొసఁగితి నాకన్న - నుర్విఁ గటిక
కసిహెచ్చునా? దీనిఁ - గన హేయమయ్యె!
ఇంతట నిలువక - యింతంత గాని
వంతలఁ గుందెడు - వసుధేశ్వరునకు
మచ్చువేదాంతము - ల్నాగి నాఁటఁ బలికి,
తెచ్చుకోల్హితములు - దెలిపి కలంచి,
సచ్చరిత్రునిఁ గటా! - సన్న్యాసిరీతి,
మెచ్చుతంబుల - మెలయించి, దాని
మతముఁ బట్టముఁ గట్టి - చూపోవు లేక,
మతకరిమతములు - మతిలో నొప్ప
దాని నేఁ గూడంగఁ - దఱచి తలంచి
కాని దీపని యని - కామిని నాదు,

యాసలఁ గల్పించి - యన రానియట్టి
బాసలు నేసితి - బలుకరినముగ-
బిసరుహాక్షికిఁ బసి - బిడ్డను నేను,
వ్యసనపరం బగు - వర్తనఁ జెలిపి,
మోసపుమోహాన - మోదముఁ గలిపి,
భాసురాంగిని వెల - భామఁగాఁ జేసి
యాయుగ్రసేనుని - యంకెలోఁ గొనుచుఁ,
జేయించితిని జెడు - చేతలు మిగులఁ,
"గార్యంబు లన్నియుఁ - గడచె నీమాట
మర్యాద చూపరా - మాకు వైరంబె
యారామ ని" మ్మని - యడుగ నేఁ గినుక,
నారామమును జేర్చి - యనఘులు దలఁగి
నరు లేరు దిరుగని - నగమునఁ ద్రోచి,
హరుసించితిని మొన్న, - నక్కటా! నేను
ఇంతఁ జేసిననాకు - నేమి ఫలించెఁ?
జింతయొక్కటితక్క - శివశివా! నేడు?
పుత్రశోకముఁ గంటిఁ - బుణ్యంబు చెడితి
ధాత్రిని నాపేరు - దలఁచినంతటనె,
కటికుఁడు, కష్టి బల్ - క్రూరకర్ముండు,
కటికడెందమువాఁడు, - కల్మషుఁ, డనుచు,
గేడించి కందురు- కీడును బోలె
పోడిమి పోయెను - బోదు ప్రాణంబు
ఏమిసేయుదు నయో - యెవ్వారు దిక్కు?
ఏమిపాపములు నే - నెన్ని చేసితిను?
చెలరేఁగి నేను జే - సినపని యేమి?
ఇల దైవవశమున - నెటు లాయెఁ దుదకు
ఇన్ని కష్టంబుల - కిన్నిక్రౌర్యముల,
కిన్నిపాతకముల, - కిన్నిరోఁతలకుఁ,

వారు వీరన కెల్ల - వారును దీని,
సందియింపకుఁడయో - సజ్జనులార!
ఇందులకారణ - మిది యె దురాశ.
పాపరూపము గదా - పాడుదురాశ
యోపికఁ బోఁకార్చు - నోపు దురాశ.
చెఱుగులలోఁ జెడు - చెఱగు దురాశ.
ఇడుమలకును బుట్టి - నిల్లు దురాశ.
మిత్రుల నెడఁబాపు - మిత్తి దురాశ.
పుత్రులఁ జంపించుఁ - బుడమి దురాశ,
తల్లిదండ్రులఁ ద్రెంచుఁ - దగనిదురాశ.
కల్లలు పలికించుఁ - గడిమిదురాశ.
మానవసుఖముల - మారి దురాశ.
హీనతఁ గావించు - నిదిర దురాశ.
న్యాయము లమ్మించు - నజర దురాశ
కాయము లమ్మించుఁ - గదర దురాశ
మానము నమ్మించు - మహాని దురాశ
ప్రాణము నమ్మించు - భళిరె దురాశ.
కామము హెచ్చించుఁ - గదర దురాశ.
నేమముఁ దప్పింప - నేర్చు దురాశ.
కులశీలముల నెల్లఁ - గూల్చు దురాశ.
కలసుఖముల నెల్ల - గాల్చు దురాశ,
దుర్యశఃఖని యగు - దుష్ట దురాశ
దుర్యోధనునిఁ గుల - ధూమకుఁ జేసె
ఆతతపోనిధి - యగునీదురాశ,
ఆతతాయిగఁ జేసె - నానహుషేంద్రుఁ,
జాతకపాథోధి - పాడుదురాశ,
సీతానుఁ జేసె నా - నీచు రావణునిఁ;
కలుషాలవాల మీ - కటికి దురాశ,
బలశాలి బలిని బ - ల్బాధుఁ జేసె,

కలకురారం బగు - కుటిలదురాశ,
తలవంపుఁ దెచ్చు నెం - తటివాని కైన,
వినరయ్య జనులార - విడుఁడి దురాశ,
అనుభవసిద్ధాంత - మైనదురాశ
వినిపించితిని మీకు- విడుఁడి దురాశ.
మనుఁడి మాన్యులు గాను - మాని దురాశ,
తలలు మార్పించును - దగదు దురాశ
వలదు మీ కెన్నఁడు - వలదు దురాశ.

"సుమతి"

సునం—తండ్రీ! పాపము; వీనిపరితాపమ్ముం గన్న జాలి యయ్యెడు, చేసినదోసమ్ములకు మోసమ్ములకును బశ్చాత్తాపమ్ము నొందుచున్న వాఁడు. వీనిప్రాణంబుఁ దీసిన మన కేమి లాభంబు లభించెడిని; మన దేశమ్మునుండి వెడల నడచినం జాలదే? మఱియొక్క చిన్నవిన్నపం బాలకింప నవధరింపుము. వీని నాయుగ్రసేనునొద్దికిం గొనిపోయి. వాఁడు బ్రతికియుండు నేని వానికి వీనిం జూపి, యీభంగంబుం దెలిపి విడిపింప నానతిమ్ము. ఈద్రోహి తన పాపఫలంబుం దాన యనుభవించుం గాక.

ప్రతా—తల్లీ! ఎంతటిదయావతివే నీవు? కానిమ్ము నీయిచ్ఛయె జరుగుం గాక.

(ప్ర. సేవకుఁడు.)

సేవ—మహాప్రభూ! వివాహంబునకు సర్వంబును సన్నాహం బయ్యె. ఆచార్యు లాదిగాఁ గలభూసురులు విచ్చేసి దేవరరాకకై కాచియున్నవారు. తమ కీయుదంతంబుం దెల్పు మన్న నే నిట వచ్చితి.

ప్రతా—అటు లయినఁ బ్రియమిత్రమ! మంగళాంగా! మనము వేవేగ శుభముహూర్తంబుం జరిపింతము, విచ్చేయుఁడు. (అందఱును వెళ్లుచున్నారు.)